బాపట్ల

# శ్రీభావనారాయణస్వామి

## క్షేత్ర మాహాత్మ్యము



ప్రకాశకులు :

కటు రంగాచార్యులు

ంకటు సీతారామాచార్యులు

ఓమ్

శ్రియై నమః

బాపట్ల

# శ్రీ భావనారాయణస్వామి

# క్షేత్ర మాహాత్మ్యము

సుప్రభాతాది స్తోత్రములు, ఈ క్షేత్రమందలి ఆలయాదుల చరిత్రలు గలవు.



ప్రకాశకులు:

శ్రీ భావనారాయణ స్వామివారి అంతరంగ పురుషులగు, కవీశ్వర

భిషగ్రత్న, పండిత. శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులవారి

పౌత్రులు :

భిషగ్వర, పండిత శ్రీ మాన్ వెంకట్రాయాచార్యులవారి

పుత్రులు అగు

వేంకట రంగాచార్యులు - వేంకట సీతారామాచార్యులు

క్రోధి శ్రావణ పూర్ణిమ. 1964. మూల్యం రు. 2-25.



శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ తాయారు
బాపట్ల (భావపురి)



లక్ష్మీవల్లభ సంకల్ప వల్లభాయ మహాత్మనే
శ్రీమద్విఖనసే తుభ్యం మునివర్యాయ మఙ్గళమ్॥



క్షీరార్ణవే ఫణిపతౌ శయితస్త్వమత్ర ।
క్షీరద్రుమేచ వసతిం బహు మన్యమానః ।
క్షీరోదజాసహచర స్సకలాన్ త్వదీయాన్
సంరక్షితుం వససి కేశవ । భావదేవ ॥

శ్రీమహీభ్యాంచ సహితం శ్రీవత్సమణిభూషణం
భావనారాయణం దేవం భజే భావపురీశ్వరమ్ ॥

క్షీరవృక్షేఽవతీర్ణాయ క్షీరసాగరశాయినే
రాజ్యలక్ష్మీసమేతాయ భావదేవాయ మఙ్గళమ్ ॥

# సమర్పణ

బాపట్లలో వేంచేసియున్న

శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేత

**శ్రీ భావనారాయణ స్వామివారి**

చరణ సరోజములకు అత్యంత భక్తితో సమర్పితము

నల్లూరి వేంకట రంగాచార్యులు,

,, వేంకటసీతారామాచార్యులు.

పూజ్యపాదులు

కీర్తిశేషులు

పితామహుల

పితృదేవుల

చరణ నీరజములను

స్మరించుచు

శ్రీ భావనారాయణ స్వామికి

సమర్పితము

వేంకట రంగాచార్యులు

వేంకట సీతారామాచార్యులు



క్షేత్రమాహాత్మ్య ప్రకాశకుల పితామహులు,
శ్రీమాన్ రంగాచార్యులుగారు : శ్రీమతి రత్తమ్మగారు బాపట్ల.





పి తృ దే వు లు
శ్రీమాన్ వెంకట్రాయాచార్యులుగారు- శ్రీమతి రాఘవమ్మ గారు

# విషయసూచిక

# చిత్ర పట సూచిక



గౌతమ బాలురు

చిరంజీవి దీక్షితులు (నల్లూరి) చిరంజీవి పాంచజన్యం



శ్రీ గౌతమ మహర్షిః

# అవతారిక

శ్రీమన్మందకటాక్షవీక్షణములన్ జెల్వొందిలోకాళిన
త్యామోదంబున బెంపొనర్చెడి మహాత్మ్యున్ రాజ్యలక్ష్మిన్ మనః
ప్రేమం బారగ గూడి వైభవము శోభిల్లంగ బాపట్ల స
ద్ధాముండౌ హరిమాకు నెల్లపుడమంద ప్రాభవంబీవుతన్॥

మహాశయులారా !

నేను అల్పజ్ఞుడను, అల్పశక్తుడను, అల్పుడను భక్తాభీష్ట ప్రదాన కాంక్ష పెంపెసగొలుప క్షీరార్ణవమునువదలి నీ భావ పట్టణమున క్షీరవృక్షమునందు సాక్షాత్కరించిన దేవదేవుడగు శ్రీ భావనారాయణస్వామివారి నిత్య కైంకర్యపరుడను. శ్రీవారికైంకర్యమునే పరమధనమునుగానమ్మి బహుకాల

ముగా నారాధించుచుండ నొకనాడు శ్రీ స్వామివారు నాయందలి పరమానుగ్రహముచే ఆస్మత్పితామహరూపముగా స్వప్నమున సాక్షాత్కరించి భగవన్నామమే మోక్షదాయకమని యుపదేశించుచు శ్రీ స్వామివారి అష్టోత్తర శతనామములను పురుషకార భూతురాలగు శ్రీ మద్రాజ్యలక్ష్మీ తాయార్ల యొక్క యష్టోత్తర శతనామములను మరికొన్ని రహస్యములను ప్రసాదించి యంతర్ధానమైరి.

నేను నిద్రమేల్కాంచి పరమేశ్వరునియొక్క నిర్హేతుక జాయమాన కటాక్షమునకు ఆశ్చర్యమునొంది ఆనందసాగరమునమునింగి తేలితిని. భగవదనుగ్రహమునే సాధనముగాగైకొని శ్రీవారి సుప్రభాతమును, మంగళాశాసనమును మొదలగు భగవద్విషయములను సమకూర్చదలచి శ్రీ మత్తిరుమల శ్రీవారి ఆస్థానపండితులగు చతుశ్శాస్త్రవిద్వాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్యులవారి సహాయముచే పూరించి, నాకులదైవతమగు శ్రీ భావనారాయణ స్వామివారి కర్పించి కృతార్థుడనై తమకు అందజేయుచున్నాను.

ఈ కృషియందు గురువర్యులును, అద్వైత వేదాంత శిరోమణులును బ్రహ్మశ్రీ వేదమూర్తులైన యనుపకుతిక శంకరశాస్త్రిగారు నాయందు శిష్యవాత్సల్యముంచి తగురీతి సహకరించి సలహాలనొసంగి ఆశీర్వదించినందులకు వారికి నాకృతజ్ఞతాభి వందనములర్పించు చున్నాను.

క్రీ॥ శ॥ 1904 లో అస్మత్ పితామహులును, వైద్య విద్వాంసులును కవీశ్వరులును భరతశాస్త్ర నిపుణులు శ్రీ భావనారాయణస్వామివారి అంతరంగ పురుషులునగు

శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులువారు స్వయంవ్యక్త స్థలమైన ఈ క్షేత్ర మహాత్మ్యమును సేకరించి శ్రీవారి స్థల ప్రభావాది ప్రబంధములను, స్తోత్రాదులను రచించి స్వామి కంకిత మొసంగియుండిరి. ఆ కాలమున వీరి బావమరుదులు సంగీతజ్ఞులును, కవీశ్వరులును, అనేక గ్రంథకర్తలు నగు శ్రీమాన్ బృందావనం లక్ష్మణాచార్యులువారు రచించిన వాటిలో ప్రత్యేకముగా శ్రీ భావనారాయణాష్టకమునుకూడ రచించి ఖ్యాతిగడించిరి.

ఇంతియేగాక శ్రీ భావనారాయణస్వామివారి ప్రతిష్ఠా పునరుద్ధరణాది విషయములను వివరముగా తెల్పెడు ప్రాచీనుల యొక్క గ్రామకైఫీయతులను గవర్నమెంటువారు సేకరించి శాసన సంరక్షణాలయమున రక్షించుచుండ నేను కడుపేరా శతో వాటిని క్రమముగా సంపాదించితిని. తరువాత ప్రాచీను లగు మహాశయులచే తయారించబడిన మఱికొన్ని ప్రమాణ ములను సేకరించితిని. అన్నియు సమకూర్చి అటులనే ఈ చరి త్రను ముద్రించుటకై ప్రయత్నించుచుండ నామిత్రులును పౌరాణిక శిరోమణులును అగు బ్రహ్మశ్రీ కస్తూరి రాఘవ రామచంద్రశర్మగారు ఈ విషయమునంతయు చూచి తాను ఈ ప్రమాణముల నాధారముగా గైకొని సులభశైలిలో ఆంధ్రభాష చేతనే శ్రీవారి చరిత్రరచనా కైంకర్యము నేనొ ర్చెదనని నాతో ముచ్చటించిరి. అందులకు నేనంగీకరించి వారిచే తయారించబడిన మృదుమధురమగు శ్రీవారి చరిత్రను ముద్రించగల్గితిని. ఇట్టుల సహాయ మొనరించిన శ్రీ రాఘవ రామ చంద్రశర్మగారికి నేను కృతజ్ఞుడను.

శ్రీ స్వామివారి అనుగ్రహముచే ఈ క్షేత్రమున వెల్గొందుచున్న ఆలయముల సత్రముల, మందిరముల చరిత్ర

లను నాసోదరుడును, ఆగమ పండితుడును, ఆయుర్వేద వైద్యులు, అగు చి రం జీ వి వేంకటసీతారామాచార్యులు యథావస్థిత వస్తు ప్రకాశ తాత్పర్యముచే రచించి సర్వవిధ ముల సహకరించినందులకు ఆశీర్వాదముల నొనరించుచున్నాను

ఈ క్షేత్రమందుగల దేవాలయాధికారులు ధర్మసంస్థల యందలి అధికారులు, భక్తులు వారివారి శక్త్యానుసారము నాకృషికి ప్రోత్సాహ మొసంగి విషయ సేకరణలో సహకరించి సహాయ మొసంగి నందులకు భగవంతుడు వారికి ఆయురారో గ్యైశ్వర్యముల ప్రసాదించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

నా ఆప్తమిత్రులును, బాపట్లగ్రామ గడ్డయేర్పడిన నాట నుండి బాపట్ల నివాసులగు అద్దంకివారి వంశీకులలో నొకరగు అద్దంకి వీరాస్వామిగారు సహకరించి వారి ముద్రణాలయములో అందముగా నీగ్రంథమును తయారుచేసి అందించినందులకు వారికిని వారి కుటుంబమువారికిని శ్రీ మత్సుందరవల్లీ రాజ్య లక్ష్మీ సమేత శ్రీ భావనారాయణస్వామివారు సర్వదా ఆయు రారోగ్యైశ్వర్యముల ప్రసాదించవలసినదిగా శ్రీ స్వా మి ని ప్రార్థించుచున్నాను. వీరి ముద్రణాలయములో పనిచేయుచు ఈ కృషిలో తోడ్పడిన చిరంజీవులైన సిద్దాబత్తుని చిరంజీవిరావు గంగుల సుబ్బారావు అనువారలకు భగవంతుడు సర్వదా ఆయు రారోగ్యైశ్వర్యములిచ్చి రక్షించుగాక.

ఈ బాపట్ల భావనారాయణస్వామి క్షేత్రమాహాత్మ్య మును శ్రీ స్వామివారు నాచే సేకరింపజేసి ముద్రింపించి భగ వద్భక్తులగు తమకందచేయు భాగ్యము కలిగించినందులకు శ్రీ వారి భక్తవాత్సల్యతను మిక్కిలి కొనియాడుచు స్వామికి దాసోహ సహస్రము లర్పించుచున్నాను.

ఇట్లు, సల్లూరి వేంకట రంగాచార్యులు

# పండితాభిప్రాయములు

—:o:—

మహావిద్వాన్
పండితరత్న, వేదాంతరత్న, సాహిత్యరత్న, ఆగమరత్న,
ఆగమసార్వభౌమ, విద్యాభూషణ, పండిత శిరోమణి, కులపతి,
పండిత శ్రీమాన్ వేదాంతం జగన్నాథాచార్యులువారు
శ్రీమత్తిరుమల తిరుపతిదేవస్థానం ఆస్థానవిద్వాన్
అప్పికట్ల (గుంటూరుజిల్లా)

ఈ భారతదేశమున ప్రధానమగు మతము హిందూ మతము. ఈ మతమునకు జీవాతువగు ధర్మము విగ్రహారాధనము. ఆధర్మములను విధానములచేతను పరిపాలనములచేతను మహాత్ములు మహారాజులు అభిమానించి ఉత్తరోత్తరాభివృద్ధిని కల్పించిరి. అందుచే నీధర్మ మరణ్యములయందును పర్వతములయందును పట్టణములయందును పల్లెలయందును వ్యాప్తమై మానవులు పురుషార్థముల సాధించుకొనుట కతిలలిత సాధనముగా నేర్పడియుండెను. ఇటులుండ దాదాపు 1400 సంవత్సరములకిందట క్షీరసాగరమందలి నాగపర్యంకమును వీడి ఈ భావనగరమునందు క్షీర వృక్షమున యర్చారూపమున యావిర్భవించిన శ్రీ మన్నారాయణుని చోళమహారాజు శ్రీ వైఖానస సత్తముల రావించి వారల వలన శ్రౌత మార్గముచే ప్రతిష్ఠాపించి ఆమార్గముచేతనే యారాధింప శాశ్వతములగు యేర్పాటులనుచేసి మానవకోటికి మహోపకార మొనరించెను. ఆ ధర్మమునకు కాలప్రవాహ

ముచే దాదాపు 200 సంవత్సరముల క్రిందట సంప్రాప్తమైన ప్రతిబంధకముల బోకార్చి భక్తాగ్రేసరులగు శ్రీ జగన్నాథ రావుగారు పునరుద్ధరణము గావింప నేటివరకు అవిచ్ఛిన్నముగా నాధర్మము ప్రకాశించుచుండెను. ఈనాడాభావనగర నివాసరసికుడగు శ్రీ మన్నారాయణుని యారాధనమునకు పూర్వాంగముగా నొనరించిన యీ సుప్రభాతము అనుదినమును కైంకర్య రూపమునుదాల్చి సుప్రభాతము నొనరించుగాక యని కోరుచున్నాడను.

—(o)—

సర్వజ్ఞుడగు నీశ్వరునినుండిజనించిన శ్రుతులయందును తదనువాదకములగు స్మృతీతిహాస పురాణాదులయందును విధింపబడిన మాత్రమునసే విశ్వాసశ్రద్ధలు గల్గుకాలమంతరించినది. ఆకాలమందు నైతముపాసక ప్రరోచనార్థమై ఉపాస్య దేవతాగుణములను చెప్పుట శృతులయందుగూడగలదు. ఆసాంప్రదాయమునసుసరించియే నేడును భక్తులనివ్యవహరింపబడు నుపాసకుల నాకర్షించుటకై దేవతామహిమలను, క్షేత్ర మాహాత్మ్యములను మాత్రమేగాక కాలప్రాచీనతాదులుగూడ అవసరమగుటను గమనించి శ్రీమాన్ నల్లూరి వేంకటరంగాచార్యులుగారు తగిన పరికరములను ప్రయత్నపూర్వకముగా సంపాదించి చిత్రములతోగూడ బాపట్ల శ్రీ భావనారాయణ స్వామిక్షేత్రమాహాత్మ్యంబను పేరుననిట్లు రూపొందించుట కడుంగడు ప్రశంసనీయము స్వసనామధేయులగు పితామహుల

స్వాప్నికా దేశమును పురస్కరించుకొని, పితరులయొక్కయు, నిత్యకైంకర్యాదులచే భావదేవతయొక్కయు, స్వాగమోక్త విధ్యర్థానుష్ఠానముచే ఋషులయొక్కయు ప్రీతినేకాక, దేవతాస్థల కాలాది విచారణచేసి తత్తద్దేవతా స్థలనిర్ణయముతో భక్తజనప్రీతినిసైతము సంతరించిన యీ ఆచార్యుల వారు, పితృసందేశముచే రాజసూయమును తలపెట్టిన ధర్మరాజును సార్థకనామధేయునిగాజేసి సర్వము సమగ్రముగావించిన భీమార్జునుల మరపించు విధేయానుజుడగు శ్రీమాన్ వేంకట సీతారామాచార్యులు సహకారిగా కృతకృత్యులై భాసిల్లుచు దీర్ఘాయుష్మంతులై యిట్టి కార్యములను మఱల తలపెట్టుదురుగాకయని యాశించుచున్నాను. శ్రీమత్తిరుమలేశాస్థానపండితులును, సర్వతంత్రస్వతంత్రులును నగు శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్యులవారియాశీస్సులకు పాత్రులైన వీరికి నాయాశీస్సు లనువాదకములగుగాక.

ఇట్లు,

సంపాదక శ్రేయోభిలాషి

అద్వైతవేదాంత శిరోమణి

ఇనుపకుతిక శంకరశాస్త్రి, బాపట్ల.

—(౦)—

మీరుపంపిన అష్టోత్తరశతనామావళి సహిత శ్రీభావదేవ సుప్రభాతము అందినది. ఆమూలాగ్రముగా చదివించుకొని వినినాను. శ్రీ వేంకటేశ సుప్రభాతముతో సరిసమానముగా నడిచిన శ్లోకములు సరళముగాను భావయుక్తముగానున్నవి. శ్రీ భావనారాయణస్వామివారి నామావళి "భ"కార

ముతోను, శ్రీ మహాలక్ష్మీ అమ్మవారి నామావళి "ర" కారముతోను పూర్తియొనరించి మీరు శేషత్వమును సంపాదించుకొని దివ్యదంపతుల తిరువడిలో "భరన్యాస" ము చేసినందులకు సంతసించుచున్నాను. శ్రీ భావదేవ దండకము కూడ అమందానంద కరముగానున్నది. మీ యీకృషి సంతోషింపతగినది. తమ పితామహుల విద్యాగౌరవమును ఈ విధముగా ప్రకటింపచేసినారు. శ్రీ శ్రీనివాసుడు మీ కుటుంబమునకు సర్వదా ఆయురారోగ్యములను ప్రసాదించుగాక.

భిషగ్రాజ. దీవి వెంకట నృసింహాచార్యులు

అధ్యక్షులు

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రి గ్రంధమాల, నల్లూరు.

---

శ్రీ వేంకటేశ్వరస్వామి సుప్రభాతమును పురణించుచు శ్రీ నల్లూరి వెంకటరంగాచార్యులువారు రచించిన శ్రీ భావదేవ సుప్రభాతము, శ్రీ మహాలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రము శ్రీభావదేవమంగళాశాసనము శ్రీభావనారాయణాష్టోత్తర శతనామస్తోత్రములు సుప్రసిద్ధమగు ననుటకు సందేహము లేదు దైవమునేరీతినైన తలంచుటయేగదావలసినది, వలచినది. శ్రీ భావనారాయణస్వామివారి చరిత్రను సేకరించి ముద్రింపించుటకు పూనుమీదీక్ష ప్రశంసనీయము మీరు కృతార్థులు కాగలరని విశ్వసించు చున్నాను

కవి శతావధాని, అష్టావధాని,

కొప్పరపు సీతారామప్రసాదరావు

నరసరావుపేట.

సంస్కృతమున నాకు తెలియవచ్చిన సుప్రభాతములు మీాదికాక 42. మీారు రచించిన భావదేవ సుప్రభాతమునకు 'భావనారాయణసుప్రభాతము' అని పేరిడిన బాగుండెడిని. మీా భావనారాయణస్వామి తక్కిన పెరుమాళ్ళవలె అంతగాఢనిద్ర పోరనుకొందును! ఏమన- తక్కిన సుప్రభాత స్తోత్రములలో 30 శ్లోకములుపఠించినఁగాని ఆయాదైవములకు మెలుకువరాదు. మీాస్వామికి 10 శ్లోకములు చదివిననే మెలుకువవచ్చును. మీా సుప్రభాత స్తోత్రముతోఁబాటు, మీా తెనుఁగు కవిత్వము, దండకమును ప్రచురింపఁబడుట యొకవిశేషము.

మీా సుప్రభాత స్తోత్రాదికము మీా స్వామియనుగ్రహమున కూర్చితవని సంతసించితిని. పోతనచే భాగవతమును పల్కించినవాఁడు రామభద్రుఁడఁట మీాచే నీస్తోత్రములఁ బలికించినవాఁడు మీా భావదేవస్వామియే.

ఈ సుప్రభాతస్తోత్రము క్రీ॥ శ॥ 14వ శతాబ్దిలో నారంభమై నేటివఱకు అనుకరణానువాదములచే వర్థిల్లుచున్నవి. నాకు దెలిసినవి 43 తెలియనివి ఎన్నో?

విద్యారత్న.

ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు.

M.A.. A.E.S. (Rtd')

ఎడిటరు: సంస్కృత ఎకాడమి, ఉస్మానియా యూనివర్సిటి

వైస్ ప్రెసిడెంటు: సంస్కృతభాషా ప్రచారిణీసభ

హైద్రాబాదు (బ్రాంచి)

శ్రీ భావదేవ భావమున సవికల్పచిత్తములో కలిగిన వైవశ్యావిష్టమయిన భావ మీఆకృతివహించి భావదేవార్పిత మయినది. నవకాల ప్రోల్లాసమున త్వరాయిత ప్రకృతి కృతివికల్ప మిందునుగలదు. సుప్రభాతమునకు సుప్రభాతము పలుకు వార యత్న యత్న ప్రతిభాతమిట్లు కూర్చుటకలవడిరి. ఈకృతికాకృతి కలిగినది. మంత్రవిన్మననమట్లుగా భావార్చన మందించినది. అది స్వభావార్చనముకాగా నిట్టివిట్టివివచ్చుట పరిపాటి యట భావనారాయణ వరివస్యాధికార సిద్ధికాములొనరింపదగిన వానిని స్ఫురిత స్ఫురితముగనయిన, గుర్తించుటకిది పటు పటు విలాసము. చరిత్ర పరిధిలో భావమిముడదు. భావదేవునట్లు పట్టుటయు నశక్యక్రియ. అశక్యము సుశకమగుటకై ఒక రొకరు యత్నింతురు. ఇంకను ఆగమగుప్త గూఢములయిన అర్చాకల్పముల సవికల్పముగ నిరూపించినచో భావనారా యణాధిష్ఠిత హృదయులు, సహృదయులు సుహృదయులు కాగలరు. అట్లుభక్త్యర్చనా సక్తులయిన పూర్వాచార్యుల ఆశీ రనుగ్రహములను భావించి ఈ యాచార్య భక్తుడు శక్తి యుక్తికలవాడు కాదగునని వారివలె, వీరివలె నేననదలచ కున్నను స్వాస్థామందశ్రద్ధుల నారాయణ భావమునురాధన మొనరింతును.

అస్తు

దర్శనాచార్య, సాహిత్యాచార్య, శాస్త్రవిశారద
సాహిత్యసమ్రాట్, లాక్షణిక శిరోమణి, విద్యాప్రవీణ
జమ్ములమడక మాధవరామశర్మ,
అభినవభారతి. ఎ. సి. కాలేజి-గుంటూరు.

—:o:—

మీరు దయతోఁబంపిన. "(శ్రీ)భావదేవసుప్రభాతము" (అష్టోత్తర శతనామావళి) అందికొంటిని, కృతజ్ఞుఁడను. నాయిష్ట దైవమగు బాపట్ల (శ్రీ) భావనారాయణస్వామివారి సుప్రభాత అష్టోత్తర శతనామావళిని, క్షేత్రమాహాత్మ్యమును యీ రూపముగ నందఁజేయుట ముదావహము. అట్టి మీకృషి నభి నందించుచున్నాను.

ప్రొఫెసర్, ప్రిన్సిపాల్, డా॥ దీవి రంగాచార్యులు
ప్రిన్సిపాల్
యస్. ఆర్ ఆయుర్వేద కళాశాల గుంటూరు.

—(o)—

మీ సోదరులు, భగవత్ప్రేరితంగా రచించి పంపిన (శ్రీ) బాపట్ల భావనారాయణస్వామి క్షేత్రమాహాత్మ్యమును చదివి అమందానందం చెందాను, మీ వివరణం లెస్సగానున్నది మీకృషి ప్రశంసనీయము. (శ్రీ) భావనారాయణస్వామి మిమ్మనుగ్రహించుగాత.

దైవజ్ఞ శిరోమణి, విద్వత్కవి శేఖర
కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, బాపట్ల.

—(o)—

మీరు దయతోఁ పంపిన (శ్రీ) భావదేవ సుప్రభాతము రమణీయముగానున్నది. అది భక్తజనులపాలిటి పారిజాత ప్రసవ మంజరిగా పరిమళించుగాక! (శ్రీభావదేవ కరుణాకటాక్ష వీక్షణ ములు మీకు ఇతోధిక కవితాసంపదను సంపాదించుగాక! మీ ప్రయత్నము సర్వథా ప్రశంసనీయము.

కరుణశ్రీ
జంధ్యాల పాపయ్యశాస్త్రి,
ఎ. సి. కాలేజి, గుంటూరు

నిత్యపారాయణోప యుక్తములగు శ్రీ భావదేవ సుప్రభాత, స్తోత్రాదులను సమకూర్చి ప్రకటించినందులకు ప్రకాశకులభివందనీయులు, అల్పాయువగు కలియుగ మానవులకు 'నామసంకీర్తన,' 'పారాయణ' లే మోక్షసాధనములుగా నున్నవి. అనల్పమగు వీరికృషిని శ్లాఘించుచున్నాను.

ఇట్లు,

డా॥ డి. వి. ఏ. ఆచార్య B.A., G. C. I. M.

ప్రధాన కార్యదర్శి

శ్రీ విఖనస గ్రంధమండలి, పొన్నూరు.

---

ఈ భావపురిచరిత్ర ప్రకటించుటకు సంపాదకులు శ్రీ నల్లూరి వేంకట రంగాచార్యులు, వారి సోదరులు శ్రీ సీతా రామాచార్యులుగార్లు ఎన్నిసాధక బాధకములకులోనైనది నాకుమాత్రమే తెలుసునని చెప్పగలను. చరిత్ర సేకరణ మాటలతో సాగేపనికాదు. ఒక్కమాటలో తెలియచేయాలంటే ఈ గ్రంధ మొక పెద్ద విజ్ఞాన సర్వస్వము. ఇది సామాన్యులకు లభ్యమయ్యేపనికాదు. శ్రీ శ్రీ భావదేవుని కృపాకటాక్ష వీక్షణములవలననే యిది ఈరూపముధరించినది. ఈ గ్రంధమునకు అన్నివిధములతోడ్పడిన పండితవర్యులకు, ముద్రాపకులకు, సంపాదకులకు భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి ఇట్టి కార్యముల సదా నిర్వహించుటకు వారికి శక్తి, సంపదల నిచ్చి రక్షించుగాక

ఏలేశ్వరపు నరసింహారావు

హిందూశాస్త్ర గ్రంధాలయం, బాపట్ల.

శ్రీమాన్ డా॥ నల్లూరు వేంకట రంగాచార్యులవారిచే విరచితమగు శ్రీ భావనారాయణస్వామివారి చరిత్రను పరిశీలించితిని. మత గ్రంథముల మతప్రచారక సంస్థలపరిస్థితి ఈనాడు అభివృద్ధిచేయ వలసిఉన్నది. భగవత్తత్త్వము, ఆస్తికతకల ఈ గ్రంథము చాలా అవసరము.

ఆంధ్ర ప్రజానీకము ఈరచయితను, ఈ గ్రంథమును ఆదరించి అభిమానించెదరని ఆశించుచున్నాను.

ఉపన్యాసకోకిల, సాహిత్య సుధాకర
పండిత. కె. ప్రభాకర శ్రీకృష్ణభగవాన్ M. A. (Lit)
ప్రిన్సిపాల్ శ్రీ. భా. సంస్కృత కళాశాల పొన్నూరు.

---

# ప్రశంసా

అయిభోః ఆస్తికశిఖామణయః !

విదితచర ఏవాయం న్యాయస్తత్ర భవతాం భవతాం 'యత్' "అత్యాసన్నం పరిత్యజ్య మునేర్దత్తంతు నిష్ఫల"మితి. అముమేవాంశం మనసికృత్య భావపుర్యా విష్టస్య స్థానికస్య శ్రీ భావనారాయణస్య సుప్రభాత రచనాంపరిత్యజ్య దేవతాంతర ప్రభావ నిరూపకస్య సుప్రభాత నిర్మాణస్యమంద ప్రయోజన తా మాకలయ్య, ఉభయవేదాన్త ప్రవర్తకౌ శ్రీ మన్తౌ నల్లూర్యుపనామక వేంకట రంగాచార్య వేంకట సీతారామాచార్యౌ మహతాభక్త్యా ప్రపత్త్యా చ శ్రీ భావపుర్యా మావిర్భూతస్య శ్రీ భావదేవస్య సుప్రభాతం, అన్యాని చ స్తోత్రాదీని, శ్రీరాజ్యలక్ష్మీస్తోత్రాదికంచ వ్యరీరచతామ్. తావతా సంతోష మలభమానౌ భావపుర్యాశ్చరితం యథామత్యా మూల చూడమవర్ణయతామ్. సైషాకృషిః ప్రేమ్ణః పరమామోదఇవ శ్రీ భావదేవ సుప్రభాతస్య

సౌగుణ్యం జనయత్ సత్ సుమనసాం సహృదయానాం చామన్దమానందం సంజనయతీతి కథనం పునరుక్తమేవభవతి.

పరమత్రేదమను సంధేయతత్త్వ విద్భిర్విద్వద్వరేయైః యత్ రసాలంకారాదిసామగ్ర్యా ఉపశోభిత మపికావ్యం, శబ్దస్ఫురణేనార్థస్ఫురణేన, తదుభయ స్ఫురణేనైవ సముల్లసితం, విపశ్చితాం మానసోల్లాసాయ ప్రభవతీతి విదిత చరమేవతత్ర భవతాం భవతామ్. అస్మింశ్చ శ్రీభావదేవ సుప్రభాతాఖ్యే కావ్యే అచుంబితార్థ సంపత్త్యాదికం సుబద్ధమితిత్రివిధ స్ఫూర్త్యారారాజతేయం గ్రంథరాజః.

సాధారణ కావ్య నిర్మాణే కవేరత్యంత పరిశ్రమోనాపేక్ష్యతే. ప్రసిద్ధమితివృత్తంస్వీకృత్య కవిః స్వప్రతిభానుసారేణాతిశయోక్త్యుత్ప్రేక్షాద్యలంకారై రభూతకల్పనయా అన్యథా కల్పనయాచ కావ్యంనిర్మాతి న తథా చరిత్రగ్రంథః నిర్మాతుం శక్యతే చరిత్రేతావద్యథా వద్వస్తువర్ణనమేవ కర్తవ్యమ్.

తదేతత్సర్వం పరిశీల్య అవిగణయ్య క్లేశం ఏతౌ మహాన్తౌ శ్రీ వేంకటరంగ సీతారామాచార్యౌ న కేవలం భావపురీ పౌరాణాం సర్వేషామేవజనానా ముపకారాయ బాపట్లపురీచరిత్ర మపి సవిశేషం విరచయ్య జనానాం శ్లాఘ్యచరిత్రౌ వాస్తామిత్యస్మాభిర్మోముద్యతే. తదేతావాచార్యౌ సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సహిత శ్రీభావనారాయణస్వామీ చిరాయురారోగ్య భాగ్య ప్రదానేనాను గృహ్య ఏతాదృశానేక గ్రంథ నిర్మాణద్వారా భగవద్భాగవత కైంకర్యాయ సర్వదాసర్వదాభి రక్షతాత్,

ఏవం నివేదయతా

ధర్మాల సుబ్బారాయశాస్త్రి

వ్యాకరణాచార్య శ్రీ. భా. సంస్కృత కళాశాల

ప్రొ న్సా రు.

మానవజాత్యున్నతికి మతమే ప్రధానము. లోకమున గల ప్రతిమతము పవిత్రమైనది. కాని మందబుద్ధులు కొందఱు ఆయా మతపవిత్రాశయములను మట్టి గలుపుచున్నారు. మతము లన్నిటిలో హిందూమత మత్యుదాత్తము నుత్తమము నై యున్నది. ఇందేవ్యక్తినైనను ఏదైవమునైనను స్వేచ్ఛగా పూజించి తరింపవచ్చును. అందువలన దేవాలయములు తత్ క్షేత్రములు బహుమాన్యములు.

ప్రస్తుతము, భావపురిక్షేత్రము శ్రియఃపతికి స్వయం వ్యక్త క్షేత్రమని ఈ క్షేత్ర చరిత్రమువలన తెలియుచున్నది. స్వయంవ్యక్త క్షేత్రమనగా "నేను ఇచ్చటఉన్నాను" అని చెప్పి భక్తులచే సుప్రతిష్ఠితమైన దైవముగల క్షేత్రమనియర్థము ఇట్లు స్వయంవ్యక్తుడగుటకు దేశకాలాది భేదములేదు. ఇట్లే స్వర్ణపురి (పొన్నూరు) భావపురి (బాపట్ల)లలోని శ్రీమన్నా రాయణుడు భక్తానుగ్రహమునకై స్వయముగా ప్రత్యక్షమై సుప్రతిష్ఠితుడయ్యెనని తత్తత్ క్షేత్ర పురాణములు చెప్పు చున్నవి ఇట్టి కలియుగాదికాలమున జరుగుటనో మఱియే కారణముచేతనో ఈ భావపురిమున్నగు పవిత్రక్షేత్రములు ప్రాచీన శ్రీరంగాది స్వయంవ్యక్త క్షేత్ర ప్రతిష్ఠాతౌల్యమును పొందియుండక పోవచ్చునని తోచుచున్నది.

ఇట్టి పవిత్ర భగవత్ క్షేత్రచరిత్రమును సాకల్యముగ పట్టణ చరిత్రతోగూడ సంగ్రహించిచేర్చి కూర్చిన ఏతద్గ్రంథకర్తలకు పాఠకలోక మెంతయు కృతజ్ఞులుకాక తప్పదు. దీని ప్రచారము ఎంతేనియవసరము. ప్రభుత్వము ఈరీతి గ్రంథ ములను తత్తత్ స్థానిక పండితులచే వ్రాయించి ప్రాచీనారవిం సంస్కృతిని వెలయింపచేయుట ఎంతేని యవసరమని భావించుచున్నాను.

16–7–64, ఇట్లు,

పొన్నూరు. పండిత పరాశరం వేంకటకృష్ణమాచార్యులు.

సంస్కృతాంధ్రోపన్యాసకులు, శ్రీ. భా. సంస్కృతకళాశాల.

పిపీలికాది బ్రహ్మపర్యంత జీవరాశికి స్థానమైన యీ ప్రపంచమునందు గణితబోధిని మొదలు వేదములవరకు గ్రంథములుగలవు. ఈ గ్రంథములలో గణితబోధిని స్థానమేది యనిన అందఱకు నత్యంతావశ్యకమైనది అని చెప్పుటగలదు. లౌకిక దృష్ట్యాగణితబోధినికిఁగల స్థానమునకు తక్కువలేని స్థానమే పారలౌకిక దృష్ట్యా శ్రీమంతులగు నల్లూరి ఆచార్య సోదరులచే రచింపఁబడిన యీ గ్రంథమునకుఁగలదు.

స్టాటిస్టిక్సు (statistics) వఱకు చదువలేని లౌకిక జీవితమును గడుపఁదలచు విద్యార్థులకుఁగూడ ఏవిధముగా గణిత బోధిని ప్రప్రథమమున అవశ్యపఠనీయమో ఆ విధముగనే ప్రస్థానత్రయమువఱకు చదువలేని పారలౌకిక జీవితమును గడపఁదలచు సర్వులకు అనగా నేటిపండితపామరులకు ఈగ్రంథము అవశ్యపఠనీయము అనుటలోనేమియు అతిశయోక్తిలేదు.

“బుద్ధియోగం దదామ్యహం” అనిగదా శ్రీకృష్ణ భగవానునిచే అర్జునుని నిమిత్తముగాఁ జేసికొని సర్వులకు బోధింపఁబడిన భగవద్గీతయందున్నది. దీని ననుసరించి అందఱు ప్రప్రథమమున భగవత్కరుణా పాత్రులుగావలెను. అట్టి మహాత్కార్యమున కుపయోగించు ఈ శ్రీభావదేవసుప్రభాత సహిత శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి క్షేత్రమాహాత్మ్యమును ప్రసాదించిన శ్రీమంతులు నల్లూరి ఆచార్యసోదరుల కృషికడుంగడు ప్రశంసనీయము.

శ్లో॥ జీయాదాచంద్రతారార్కం గ్రంథోఽయం కలిమారణః
భక్తకల్పద్రుమ ఇతి మాననీయోమనీషిణామ్॥

ఇట్లు, భవచ్ఛ్రేయోభిలాషి
భాషాప్రవీణ, ఇనుపకుతిక వీరరాఘవస్వామి బి. ఏ.,
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,
మునిసిపల్ హైయ్యర్ సెకండరీస్కూలు బాపట్ల.



# అభినందనములు

—o—

చారిత్రిక ప్రసిద్ధిపొందిన భావనగరియొక్క పుట్టుపూర్వోత్తరములను తన్నగరియొక్క విశేషాధిక్యములనుచాలా చక్కగా పొందుపఱచి గ్రంథము రచించిన శ్రీమాన్ నల్లూరి సోదరుల కృషిచాలా ప్రశంసనీయము.

ముఖ్యముగ భావపుర స్థలచరిత్రను, భావదేవుని క్షేత్ర మాహాత్మ్యమును మాత్రమేగాక చుట్టుప్రక్కలకల వివిధ దేవ స్థానముల చరిత్రను కూడ విశేషశ్రమకోర్చి సంపాదించి యిందుచేర్చుట గొప్పవిషయము.

అంతేకాక పరమాస్తికులై తామునమ్మిన, తమ కేడుగడ యైన, భావపురపౌరులకు పరమశరణ్యమైన శ్రీ శ్రీ శ్రీ భావ నారాయణస్వామిపై సుప్రభాతాది సమస్తకవితోపచారము లనుగూర్చి వ్రాయుటలో ఈ గ్రంథము మిక్కిలి పవిత్రమై యెల్లఱకు ఆరాధనీయమైనది.

ఇట్టి సత్కార్యమొనర్చిన శ్రీ ఆచార్యసోదరులకు నిజముగా భావపురి పౌరులు ఎంతో ఋణపడియున్నారు.

ఆంధ్రసరస్వతి; విద్వత్కవయిత్రి
ఉభయ భాషాప్రవీణ
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
భావపురి



తమరు దయతో భావనారాయణస్వామివారి సన్నిధిని నాకుయిచ్చిన భావదేవ సుప్రభాతమను పుస్తకమును గ్రహించి ఆమూలాగ్రముచదివియుంటిని ఇందున్న రాజ్యలక్ష్మీ-భావనారాయణ అష్టోత్తర శతనామ స్తోత్రములు ఎక్కువ ఆనందజనకములై దేవతోపాసనమునందభిరుచిని కలిగించు నటుల వ్యక్తములగుచున్నవి. మరియు శ్రీమద్రాజ్యలక్ష్మీ-భావనారాయణులే-శ్రీ సీతారాములుగను శ్రీసీతారాములే-శ్రీలక్ష్మీనారాయణులుగనున్న రామతారక రహస్యార్థమునున్ను ఆంజనేయోపాసనవిధినిన్ని గాయత్రీ బ్రహ్మవిద్యోపాసన విధులన్నియును గోచరించునట్లు రచించిన శ్రీమాన్ నల్లూరి వేంకట రంగాచార్య సీతారామాచార్యులవారి కృషి అత్యంత భక్త మహాశయులకు తరణోపాయమును సూచించుచున్నది. ఇట్లు ప్రకాశకులగు వీరి ఉభయులకు చిరాయురారోగ్యములనుయిచ్చి భావనారాయణ దేవుడు రక్షించుగాకయని కోరుచున్నాను.

ఇట్లు,

పౌరాణిక శిరోమణి
కప్పగంతు సుబ్రహ్మణ్యశాస్త్రి,
విజయవాడ.

# ప్రశంసా పద్యరత్నములు

సుందరమై ప్రమోదమయి శోభనుగూర్చెడు సచ్చరిత్రముల్ ;
గ్రంధుగ భక్తిబోధనలు గావె; మహోన్నతక్షేత్రదేవళాల్ ;
అందున, భావదేవుచరితార్థము కావ్యసురూపమైయునం
బందగ జేసె భావపురి పుణ్యచరిత్రము మెచ్చధీమతుల్॥

భారతసాంప్రదాయకళ బంధుర శిల్పరసజ్ఞతద్వయాల్
సారమహోన్నతాత్మసువిశాలితశిల్పవిచిత్ర చిత్రముల్;
పారములేనికీర్తి నిలుపన్ నృపపోషణ; నాటిశిల్పసం
భారము; దేవతామహిమ; మానితశిల్పివిశేషప్రజ్ఞయున్

ధారుణిబండితాగ్రణులు దారతసప్పిన కావ్యశిల్పమా;
తీరులుదిద్దినాఁడు; మఱి ధీరత నేఁడురచించె; మిత్రులా
చార్యులు సీతరామయ విశారద వేంకటరంగయార్యులున్;
చారుతరంబు కావ్యమది సంతసమీయదె! యెరికిన్ సదా;

సరసరసాలవాలమది; సాంఘిక జీవన సచ్చరిత్రమా;
కరుణరసంబు, సూనృతముఁ గాఁగను ధర్మప్రబోధమున్మహో
ద్ధరణము; భావదేవుఁడిదె దమ్మత; సంపదలిచ్చి పుణ్యమా
చరితలగూర్చ శారదను; స్వాంతముదోఁపనుతింపధీమతుల్॥

గీ॥ వసుధవెల్గెడు నల్లూరి – వంశజలధి
సోముడై కలకాలంబు – సొంపుమీర
బంధుమిత్రులప్రేమకు – బాత్రులగుచు
భావదేవుని నాశీస్సు – బడసి, సతము
మీరు వర్ధిల్లుడాచంద్ర – తారకముగ.

ఇట్లు,

కోళ్ళపూడి మల్లికార్జునకవి నిడుబ్రోలు.

(శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి జీవితము, గేయప్రబోధము
సద్గురుతారావళి ఇత్యాది గ్రంథకర్త)

—'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ'—

అన్నది సాటిలేని ఆర్యోక్తి పవిత్రమైన మీజన్మభూమి యగు భావపురీ చరిత్రను 'శ్రీ భావనారాయణ స్వామిక్షేత్ర మాహాత్మ్యమను పేరవిరచించి గ్రంథించినందులకు మీరు అభినందనీయులు. గ్రంథమును అంకితమొనర్చుటలో జననీ జనకులను స్మరించి వారికిని, క్షేత్రమాహాత్మ్యమును యథాతథముగ విలిఖించి జన్మభూమికిని మీరుచేసినసేవ అసమానము. మీకృషికి శ్రీ భావదేవుడు సర్వదా సర్వథా తోడ్పడుగాక.

పెనుమచ్చ దయానందరాజు

మేనేజరు శ్రీ సంజీవినీ ఆయుర్వేదఫార్మసీ

భీమవరం (పశ్చిమగోదావరిజిల్లా)

శ్రీ భావనారాయణస్వామివారి క్షేత్రమాహాత్మ్యమును ఇంతకాలమునకు మీ సోదరులు రచించి ప్రజానీకమునకు బాపట్ల విశిష్టతను వెల్లడించి నందులకు మిక్కిలి ఆనందించుచున్నారము. ప్రతిక్షేత్ర మహాత్మ్యమునందును ప్రధాన దేవాలయచరిత్ర మాత్రమే లిఖించబడుచున్నది. కానిమీరు సర్వసమత్వముతో మీక్షేత్రమందుగల అన్ని దేవాలయముల, ధర్మసత్రముల ఆధ్యాత్మిక సంస్థల చరిత్రలనుకూడ నేటివరకు సేకరించి నూతనపద్ధతిని తయారించిన మీకృషి ప్రశంసనీయము. మీ సోదరులు శాస్త్రీయమైన ఆయుర్వేద వైద్యమునందు నిపుణులగుటయేగాక చరిత్ర సేకరణ భాషాసేవ యొనర్చుటయందు మీకుగల శ్రద్ధ ఈ గ్రంథప్రచురణతో తేట తెల్లమగుచున్నది.

సూరి ప్రకాశరావు & బ్రదర్సు

ప్రొప్రయిటర్సు S. B. A. నిలయం

తుని (తూ॥ గో॥ జిల్లా)

# పీ ఠి క

శ్రీ భావనారాయణస్వామి బాపట్లపౌరులకేకాక అనేక పరిసర గ్రామములకుగూడ నిష్టదైవము. చరిత్ర ననుసరించి చూచినచో కొన్ని గ్రామములకు శ్రీ స్వామివారికి అతిసన్నిహిత సంబంధము గలదనియు స్పష్టము. అట్టి సర్వాకర్షణీయ సార్వజనీనమైన మూర్తియొక్క క్షేత్రమాహాత్మ్యమును రచించి ప్రచురించుచున్న నల్లూరి సోదరులు ధన్యులు. పారంపర్యముగ ననేక వత్సరములనుండి ఆకుటుంబము శ్రీ స్వామివారి సేవా భాగ్యము నొందియున్నారు. అది యీప్రచురణముతో ఫలించినది.

ఆబాల్యము భావపురముతోడను, మీదు మిక్కిలి శ్రీ భావదేవునితోడను సన్నిహితత్వమును గలిగియున్న నన్ను ప్రచురణ కర్తలు పీఠిక వ్రాయగోరుటయు సముచితమే యగుచున్నది. ఆమూర్తిని గూర్చిన గ్రంథమును అలంకరింప జేయ నెవరు కాదనగలరు!

నా చిన్నతనములో శ్రీ దేశిరాజు రంగారావు పంతులు గారు ఆలయమునకు ప్రధాన ధర్మకర్తగనున్న దినములలో శ్రీ భావదేవుడు నా ముందు నిలచెను ఆనాటి విద్యార్థులందరికి నాపంతులుగారు ఉపాధ్యాయుడుగాన, పాఠముల ప్రారంభమునకు ముందు శ్రీ భావనారాయణస్వామి వారి గూర్చి తెలుపుచుండుట పరిపాటి. అంతియగాక, ఆలయ ఆవరణము సువిశాలమైనదై, గ్రామమునకంతటికి మధ్య హృదయమువోలె నుండుటచే, నట నిత్యముజనాకర్షణీయముగ ననేక హరికథ పురాణాది కాలక్షేపములు జరుగుచుండెడివి. అవి కేవలము పెద్దలనేగాక పిన్నలగూడ నాకర్షించుచు, వారి

మృదు హృదయ క్షేత్రములలో భక్తి బీజముల నాటుచుండు టయు నొక విశేషము.

ఆనాటినుండి నేటివరకు, శ్రీ స్వామివారి మాహాత్మ్య విశేషమున, నా ఆలయమున నిత్య కార్యక్రమముగ నట్టి సమావేశములు జరుగుచుండుట చూచుచున్నాము. సాయం సమయముల నెందరో భక్తులు ఆస్వామిని, శ్రీ చెన్నకేశ వాది పరిసర దేవతలను దర్శించి, కొంతకాలమైనను ప్రాపంచిక సుఖదుఃఖ ద్వంద్వములనుండి విశ్రాంతితో శాంతి బొందు చుందురు. ఆ దేవాలయము అట్లు పురమునకొక ప్రబల పార మార్థిక కేంద్రముగ బూర్వకాలమునుండి విరాజిల్లుచున్నది.

అంతియగాక, నది నగరమునకు మధ్యసువిశాల ప్రదేశ మున హృదయస్థానమై అధిష్ఠించియుండుటకు దోడుగ బూర్వమునుండి నేటివరకు ఆలయమును సర్వాకర్షణీయముగ సకల సదుపాయములతో సుందరాలంకరణములతో రూపొం దించిన కార్యకర్తలును ధన్యులు, కృతార్థులు. అట్టి మహ త్కార్య నిర్వహణమునకు సర్వవిధముల ధన ధాన్య వస్తు రూపముగ సేవా కైంకర్యముల సమర్పించిన అసంఖ్యాక భక్త కోటియు స్మరణీయులు, సార్థకజన్ములు.

అనేక నగరములు కేవలము ధన సంపదల మూలముగ నభివృద్ధి గాంచును గాని, కేంద్రముగ నొక దేవాలయమును నెలకొల్పి తదనుసరణముగ నగరాభివృద్ధియైనచో, నాపురము సుందరమై ఆకర్షవంతమై, విశాలమగు వీధులతో వెలసి యుండును. అట్టి మహాభాగ్యమును బొందిన భావపురి అంద

చందముల కాటపట్టుగ నుండుటలో విచిత్రమేమియు గలదు.

అందుచేతనే, యీ గ్రంథమున దెలుపబడిన చందము, ఈ దేవదేవుని చుట్టును, గ్రామము నలుమూలల నెన్నియో ధార్మిక సంస్థలు నెలకొల్పబడియున్నవి. అనేక ఆలయములు, మందిరములు, సత్రములు సంస్థలు, విద్యాలయములు మొదలగు మానవోద్ధరణ కారకములైన వివిధ పారమార్థిక సమాజములు జనించినవై, పౌరుల అభ్యుదయ నిశ్శ్రేయసములకై కృషి చేయుచుండుట గమనార్హము. బాపట్ల వాతావరణము ఆకారణమున, బూర్వకాలమునుండి ఆధ్యాత్మికమై అనేక పీఠాధిపతులను, యతీశ్వరులను, పండితులను ఆకర్షించి పౌరుల సర్వశ్రేయోభివృద్ధికి సహకారియగుచున్నది మన మెరిగిన కాలమునుండి, నేటివరకు భావపురి కరుగుదెంచిన మహాత్ములను గూర్చియు, వారు యిటగావించిన మహత్కార్యములను గూర్చియు నొక గ్రంథమును సమర్థులెవరైన బూని నిర్మించిన నదియొక పురాణ గ్రంథమువలె రూపొందుననుటకు సందేహము లేదు. మరియు నీపురముయొక్క సౌజన్యత్వము, సర్వసమత్వము, సర్వవిధ ప్రాధాన్యము అభివ్యక్తమగును. అట్టి రచనమునకు నీగ్రంథము నాందియగునేమో!

ఈ విధముగ శ్రీభావనారాయణస్వామి మాహాత్మ్యమును తదవినాభావసంబంధముననున్న భావపురీ స్వరూపమును జిత్రించి మనముందుంచిన శ్రీనల్లూరి సోదరులు నుతిపాత్రులు. వారి కృషి తాత్పర్యమునుగ్రహించి సహకరించిన సహృదయులెల్లరు సంస్తుతి పాత్రులు.

ఈ గ్రంథమును భక్తులెల్లరు గ్రహియించి పఠించి, శ్రీ భావనారాయణస్వామివారి ఆలయమున జరుగు సర్వకార్యముల దోడ్పడుటయేగాక, నగరమునగల వివిధసంస్థల అభివృద్ధికై ఉచితరీతి సహకారులగుదురుగాక!

భావపుర అధిష్ఠాన దైవములైన శ్రీ రాజ్యలక్ష్మీ భావనారాయణస్వామి పౌరులెల్లరిపై దన అపార అనుగ్రహప్రసాదమును వర్షింపజేయుగాక.

బాపట్ల
15-7-64

అనుభవం.
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారు



# పూసమర్పణము

డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి D.Sc.
ప్రిన్సిపాల్, బాపట్ల కళాశాల

'చరిత్ర' అంటే రాజులూ, వారి పరిపాలనమూ వారి దండయాత్రలూ విజయములూ, వారి ప్రేమకలాపములూ కోపతాపాలూ కూర్చిపెట్టిన 'రాజులకైఫీయతు' కాదు. చరిత్ర అంటే ప్రజలచరిత్ర. దేవాలయములూ, శిల్పములూ, చెఱువులూ సారస్వతమూ సంప్రదాయములూ ప్రజలచరిత్రకాధారములు. తెలుగుదేశపు ప్రాచీనదేవాలయములు చిరకాలపు ప్రజల ఆశలూ ఆశయాలూ, పుణ్యకార్యములూ శిల్పసృష్టి, తమ ప్రాకారాలలో ఇముడ్చుకుని ఇప్పటికినీ చదవని పుస్తకాలమాదిరిగా మౌనముద్రతోనే ఉన్నవి. వాటిలోని శాసనములూ, శిల్పఖండములూ, వాటిచరిత్రా ప్రకటితమైతే ప్రాచీనాంధ్ర సాంఘిక జీవనము మీదికి క్రొత్తకిటికీలు తెరుచుకోగలవు. శ్రీమాన్ నల్లూరి సోదరులు రచించిన ఈ "భావనారాయణస్వామి క్షేత్రమాహాత్మ్యము" ఆదృష్టితో పరిశీలించవలసిన గ్రంధము. వీరు వైఖానస సంప్రదాయానుసారులైనను, బాపట్లకు చుట్టుపట్లనున్న దేవాలయములన్నిటినిగూర్చి వివరము లిచ్చియున్నారు. ధర్మసత్రములూ, వేదపాఠశాలలూ, ఆధ్యాత్మికానుభవ ప్రచారసంస్థలూ చేర్చుటతో నీగ్రంథము ఇతోధిక గౌరవమును పొందగలుగుచున్నది. ఇందలి చిత్రపటములకు ప్రత్యేక ప్రాధాన్యముకలదు. రచయితలకృషి ప్రశంసనీయము. అన్ని సారస్వత ప్రక్రియలతోనూ అందగించిన వారి భక్తిప్రపత్తులు పూజనీయము.

---

# ఆముఖము

బొడ్డుపల్లి పురుషోత్తము M A.,    బాపట్ల-కళాశాల
ఆంధ్రోపన్యాసకులు    బాపట్ల 12-7-64

ఆర్యావర్త పుణ్యభూమియందు అసంఖ్యాకములగు పుణ్యక్షేత్రములు కలవు. ప్రతి క్షేత్రమునకును తత్తదుచిత క్షేత్ర మాహాత్మ్యము, స్థలపురాణము, జనశ్రుతి మున్నగున వనేకములుండును. ఇందే క్షేత్రము మిన్న యను ప్రశ్న లేదు. 'వ్రతానామ్ ఉత్తమమ్వ్రత'మన్నట్లు దేనిమహత్తు దానిది. విశ్వాసముతో సేవింపవలయునే కాని, భక్తిగలిగి పూజింపవలెనే కాని, ఫలితము చేకూర్చని పరమేశ్వరుడు కాని, ప్రభావము చూపని క్షేత్రము కాని ఉండనేయుండదు. 'విశ్వాసో ధర్మ మూలంహి' అని కదా యార్యోక్తి !

ఇట్టి క్షేత్రములలో భావపురి (బాపట్ల) యొకటి. ఈ పురము 'ప్రాగుదధివీచీ మాలికా డోలికా శరవాతార్భక సేవ్యమాన'మైనది నిరంతర ప్రశాంత మాధురీ వాతావరణముతో నుట్టిపడునది. శ్రీ భావనారాయణ స్థిరకారుణ్యరసాతిరేకమున వెల్లివిరియునది. "శ్రీరంగము, తిరుమల, కంచి, శ్రీ కూర్మము మొదలైన దివ్యక్షేత్రములవలెనే స్వయం వ్యక్తస్థలమైనది. ఆధునికముగా బహుముఖములుగా పరిశీలించినను. ఈ భావపురి ప్రభావము సంస్మరింపదగినది. తొలిసారిగ ఈ పురమున ఆంధ్రరాష్ట్రవాంఛ చెలరేగినది. అది యీనాడు సిద్ధించి ప్రవర్ధమానమగుచున్నది. మువ్వురు పద్మశ్రీలిట నివ్వటిల్లిరి. అనేక శాస్త్రనిష్ణాతులు, కవులు, కళాకారులు ఈపురమున వికసించిరి ఇదియంతయు నొకఎత్తు. ఇది లౌకికమగు చరిత్ర. ఇంతకన్న ఆంతరంగికమగు చరిత్రయొకటికలదు ఇది

లౌకిక చరిత్రకు తేజస్సును, ఓజస్సును ప్రసాదించునది. అదియే యీ క్షేత్రమాహాత్మ్యము. దీని మూలముననే యాలౌకిక చరిత్రఉజ్జ్వలమైనదనవచ్చును.

ఇట్టి భావపురీక్షేత్రమాహాత్మ్యమును సంకలనముచేయ వలయునను సత్సంకల్పము శ్రీమాన్ నల్లూరి వేంకటరంగా చార్య, వేంకటసీతారామాచార్యులకు బొడమి, కార్యరూపము దాల్చుట ఒక యదృష్టముగా భావింపనగును. శ్రీ నల్లూరి వారు ఈ పురమునందు వేంచేసియున్న శ్రీ భావనారాయణ స్వామివారి ఆంతరంగిక పురుషులు, భిషగ్వర్యులు, కవీశ్వరులు, శిల్పులు. శ్రీమత్ సుందరవల్లీ రాజ్యలక్ష్మీసమేత శ్రీ భావ నారాయణస్వామి దివ్యచరణారవిందములను అమందానంద భక్తి తత్పరతతో అహరహము ఆరాధించు ఈ అదృష్ట వంతులకు అసాధ్యముగుపని యేముండును? ఇందు తొలిభా గము అలౌకికమగు కవితాశక్తితో అలరారునది. మలిభా గము లౌకికమగు శ్రీ భావనారాయణస్వామి చరిత్రాదులతో కూడినది. తొలిదానికాధారము భక్తి పారవశ్యముతో పరు విడ్డుద్రొక్కు కవితావేశము రెండవదాని కాధారము నిరం తర పరిశోధనాత్మకమగు బుద్ధినైశిత్యము. తొలిభాగముతానై ప్రయత్నించి వ్రాసినదిగా గనుపట్టదు. ఆ పరమేశ్వరుఁడే ఈ యాచార్యవర్యుని హృదయాకాశమును రమణీయార్థ ప్రతి పాదకమగు శబ్దములతో జ్యోతిర్మయము కావించియుండును. లేనిచో ఆ అక్షరరమ్యత అంతమనోహరముగా నమరుట అసా ధ్యము. శ్రీ మద్రాజ్యలక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రము

రేఫాక్షర సంయుక్తమై అక్షర రామణీయకముగా హృదయా రామమందు ద్విరేఫసంచారము కావించును. అట్లే శ్రీ భావ నారాయణాష్టోత్తర శతనామ స్తోత్రము భకార ప్రాసయుక్తమై స్వామిని సంభావింపచేయుచున్నది. తక్కిన స్తోత్రాదులు కవితానుభూతి కాకరమైనవి.

ఇక రెండవభాగము విషయసేకరణము. రచనలో బిగువు సడలినను, సేకరణమునందు శ్రద్ధ సడలలేదు. ఏ నగ నెవరొసంగిరి? ఏయలంకరణ మెవరుడుగరగావించిరి? ఏవాహనమెవరు సమకూర్చిరి? ఏపూజ లెవరుచేయించుచున్నారను ఆకాంక్ష భక్తులకుంగల్గును. ఈ యాకాంక్ష తీరుటవలన గల్గు ప్రయోజనములు రెండు: (1) సర్వేశ్వరునకట్టి భూషలు సేకూర్చిన భక్తులను భక్తిపూర్వకముగా సంభావించుట 2) తామును తమశక్తికొలది భగవంతునకు కానుకలు సమర్పించుకొనవలయునను నుత్సాహమును బొందుట. తన్మూలమున నాత్మసౌందర్యమును ప్రకాశింప జేసికొనుట !!

దేవాలయములు భారతీయ సంస్కృతికి జీవగర్రలు. వాని యుద్ధరణము, వానిచరిత్రాదుల సంస్మరణము భారతీయ సంస్కృతీ పునరుద్ధరణమే కాగలదు. స్వయంవ్యక్తస్థలమైన ఈ భావనారాయణక్షేత్రమునకు త్రిమత పీఠాధిపతులు వేంచేసి ఆలయోచిత మర్యాదలతో ఆరాధించుటనుబట్టియే దీని మాహాత్మ్యము అవగతము కాగలదు. ఈపట్టున హృదయాస్థాన మలంకరించియున్న ఈ ఆలయ ప్రాంగణము, నిరంతర వేదాంతోపన్యాస పురాణ హరికథా కాలక్షేపాది కార్యకలాపము

లతో అహరహము కళకళలాడుచుండును. "బావన్న తిరునాళ్ళ యనగనే భక్త్యావేశములతో పరిసర ప్రాంత ప్రజావాహిని పెల్లుబికి తన హృదయహస్తముతో శ్రీ స్వామివారి తేరులాగి ధన్యత గడించుకొన్నట్లు సంతృప్తిచెందును. ఇచట స్వామికి జరుగు నిత్యోత్సవ, మాసోత్సవ, వర్షోత్సవాదులు పండితపామర జనాకర్షణ హర్షదాయకమై హాయి చేకూర్చును. ఇతరములగు ఆలయచరిత్రలు, ప్రజోపయోగ ధార్మిక సంస్థలు భావపురీ దివ్య సౌందర్యమునకు వన్నెదిద్దుచున్నవి. భావుకులైనవారు అనేక చిత్రపటాలంకృతమగు ఈ గ్రంథమును భక్తితో వీక్షించి, పఠించి, శ్రీ భావనారాయణస్వామి నిరంతర కృపకు పాత్రులుకాగలరని, సంభావించుచున్నాను. ఇట్టి గ్రంథరచన కావించిన మాతులతుల్యులగు ఆచార్యవర్యులను అఖండముగా అభినందించుటేకాక వారి కత్యంతగౌరవముతో అభినందించు చున్నాను. శ్రీ భావనారాయణ కృపాకటాక్ష వీక్షణములచే భావపురి సకల కళారంగముల ప్రవర్ధమానమై ఆసకలమోద దాయిని కాగలదని ఆకాంక్షించుచున్నాను

అనేకవక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం, దివ్యానేకోద్యతాయుధమ్,
దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతోముఖమ్॥

—గీత.

# 'శుభాకాంక్ష'

బృందావనం రంగాచార్యులు
పండితులు

వై. ఆర్. వైష్ణావులు
(పర్యాచారు)

శ్రీలు పొంగిపొరలిన దేశము భారత పుణ్యసీమ. ఇందలి ప్రత్యణువులో పావనత్వము ప్రతిఫలించుచుండును. ప్రతిభావనలో విశిష్టత గోచరించుచుండును. ప్రతికార్యకలాపములో మహాదాదర్శము వ్యక్తమగుచుండును.

ఈయంశమున తెలుగునేలకుసైతము సమానస్థాయి దక్కకపోవలేదు. భవ్యసిద్ధాంతసంపదకు నిలయమై-పవిత్రమైన ఆధ్యాత్మిక వైఖరికి ఆలయమై-వెలుగొందుచున్న ఆంధ్రభూభాగ చరిత్ర అజరామరకీర్తితో అలరారెడి దివ్యకావ్యమనడానికి అభ్యంతరములేదు. ఈ దేశవైభవానికి యింతగా నుద్దీపకములైనట్టివి పుణ్యక్షేత్రములు; దివ్యదేవాలయములు.

పట్టణములలో పల్లెలలో కాంతారములలో గహనారణ్యములలో నదీ పరిసరములలో-వేయేల-సర్వత్ర యీభగవదాలయములు మానవజీవిత సఫలతకు మార్గదర్శకములై మంగళకరములై ప్రకాశించుచునేయున్నవి. వీనిలో కొన్ని మహత్తర ప్రభావసమన్వితములై జనులలో ఆధ్యాత్మికజ్యోతిర్దీప్తుల ప్రసరణమునకు బహుముఖములుగ దోడ్పడుచునేయున్నవి. అట్టిపూజ్యస్థలములలో గర్తపురీమండలాంతర్గత భావపురీ విరాజమానమగు శ్రీ భావనారాయణస్వామివారి దివ్యస్థలము గణనీయమైనట్టిది.

ప్రసిద్ధమైన ప్రాచీనగాథ-పరమపావనస్థలమాహాత్మ్యము గల యీ దేవాలయ వైభవము భక్తకోటికి సర్వవిధముల నారాధనీయమైనట్టిది. క్షీరాబ్ధినుండి యాగ్రహించి బయలు దేరివచ్చిన జగజ్జననిని యన్వేషించు నిమిత్తము-శ్రీమహావిష్ణువే జగత్పర్యటనముగావించుచు భావపురిలోగల పాలచెట్టున వసించె నని యొక ప్రతీతి.

ఏదియేమైననేమి? యిచట భావనారాయణస్వామి భక్త కోటికి వాంఛితార్థప్రదుడై వెలసినాడు.

ఈ స్వామి దివ్యగాథను సమగ్రముగవిలిఖింప సంకల్ప సిద్ధులగు శ్రీమాన్ నల్లూరి వేంకటరంగాచార్యులుగారు దీక్ష వహించుట ముదావహమైన యంశము. వీరు స్వామివారికి తరతరాలనుండి కైంకర్యముగావించుచున్న ధన్యులగు మహనీ యుల వంశమునకు జెందినవారు. అగుటవలననే శ్రీ రంగా చార్యులు వారీ గ్రంథరచనకు సర్వవిధముల నర్హులని యనవల యును. ఆగమశాస్త్రప్రావీణ్యమేగాక వైద్యవిద్యానైపుణ్యము నైతము వీరికి కరతలామలకము. ఈపాండిత్యప్రతిభ వీరికి యాను వంశికముగవచ్చినట్టిది. వీరి పితృ పితామహులు గీర్వాణభాషా కోవిదులై మధురములైన దివ్య ప్రబంధములను రచించిన మాన్యులు

శ్రీ రంగాచార్యులువారి పూర్వులు రచించిన వివిధ గ్రంథములు వెలుగునకు రాక మఱుగువడి యుండుటకోచనీ

యము. శ్రీ ఆచార్యులువారు శ్రద్ధవహించి ఆగ్రంథములలో ముఖ్యములైనవానిని గొన్నింటినైన ముద్రణకు దెచ్చుట యోగ్యము.

శ్రీ భావదేవకృపా విలాసము పుష్కలముగాగల శ్రీ రంగాచార్యులు వారు శ్రీ స్వామివార్ల క్షేత్రమాహాత్మ్యమునేకాక భావపురియందుగల పలుసంస్థల - పుణ్యస్థలముల-దివ్యత్వమునుగూడ యీ గ్రంథమున జిత్రించుటవలన యొకానొక మంజులశోభ యీ రచనకు కైవసమైనది.

ఒకవిధముగ - ఆధ్యాత్మికముగా భావపురికిగలస్థాయిని, ప్రత్యేకతను, గ్రహించుటకీ గ్రంథము దర్పణమువంటిది. విషయ ప్రాశస్త్యమును వెల్లివిరియించుటకై రచయిత యిందుదహరించిన గాథలు-శ్లోకములు సంస్తవనీయములు. కొన్ని స్తోత్రములుగూడ యిందు గ్రథితమగుట పరమామోద కారణము.

ఇట్టి పవిత్రగ్రంథములను భక్తజను లాదరింపగలరు. శ్రీమాన్ ఆచార్యులవారు నాకన్న సర్వవిధముల పెద్దలు. నాయందలి వాత్సల్యముచే నామాటల గొన్నింటి నిందు జేర్చుట కుత్సహించిరి.

ఈ రూపమున యీ పుణ్యగ్రంథమహిమను సంస్మరించెడి భాగ్యము నాకు లభ్యమైనది. శ్రీ భావనారాయణస్వామి వారి దివ్యానుగ్రహ విశేషముచే వీరిట్టి ప్రశస్తగ్రంథముల బెక్కింటిని రచింపవలయునని యాకాంక్షించుచున్నాను.

"శుభమ్ భూయాత్"

# విన్నపము

భక్త మహాశయులారా!

భావపురి వాస్తవ్యులు శ్రీమాన్ నల్లూరు వేంకట రంగాచార్య వేంకట సీతారామాచార్య సోదర ప్రణీత శ్రీ బాపట్ల భావనారాయణస్వామిక్షేత్రమాహాత్మ్యమను సార్థకనామంబున న్వెలయు నీగ్రంథ మామూలాగ్రంబుగ నతిశ్రద్ధాభక్తులం బఠియించి యలరారితి. ఆచార్య సోదరులిర్వురు గీర్వాణ హూణాంధ్రభాషాపరిచయులు. అక్కతన నిందలి శైలియు భావములు నతిమనోహరాకర్షణీయము లనుట యతిశయోక్తి కాజాలదు. పూర్వభవసుకృత విశేషంబున నీసోదరులిర్వురత్యంతమైత్రి ననవరతము శ్రీ స్వామివారి సన్నిధిమెలంగుచు, దేవదేవునర్చనాదుల నతిభక్తి నారాధించుచుంట శ్రీ స్వామివారిచరిత్ర నామూలాగ్రంబుగ రచింపనుత్సుకులయి శ్రమకోర్చి దూరభూములగు రాజమహేంద్రవరములోనగు పలుతావుల నుండియు నద్దాని సంబంధమగు విషయాదుల, శ్రీ రాజా కొండ్రేగుల జోగీపంతులు చిత్రపటము లోనగు పెక్కుపురాతన ప్రామాణికంబుల సేకరించి, క్షేత్రమాహాత్మ్యమగు గ్రంథ రూపంబొసంగిరి. ఇవ్వాని సేకరణార్థ మీ యాచార్య సోదరుల శ్రమవర్ణనాతీతము. ఇందలి శ్రీమాన్ వేంకటరంగాచార్య ప్రణీత సుప్రభాతము, శ్రీ స్వామివారి, శ్రీ రాజ్యలక్ష్మీయష్టోత్తరశతనామస్తోత్రములు, దండకము లోనగు రచన లతిమనోహర గీర్వాణపదంబుల నొప్పుచు మూఢులకేని భక్తి ప్రబోధకములగుచున్నయవి. ఇయ్యవి ప్రాచీనకవివతంసుల శైలిననుకరించు. శ్రీ భావదేవ సుప్రభాతమతిరమ్యముగ భావగర్భితముగ, భక్తియుతముగ, మృదుమధురముగ, భక్త

జనాకర్షణీయముగ, సంక్షిప్త రూపంబున రచియింపంబడుట రచయిత పూర్వభవసుకృత మనకదప్పదు, శ్రీ భావదేవ సుప్రభాతమన రచయిత భావంబున మానసదైవంబగు నారాయణ దేవుండలంకరించి భావగర్భితంబుగ, నిజభావంబుల భక్తులకు వెదజల్లుట రచియిత భావంబని యస్మదీయ యాశయంబు. అక్కతన నియ్యది శ్లేషంగూడి శ్రీ భావదేవ సుప్రభాతమని సార్థకనామంబున నలరె. అతిసులభంబుగ కంఠతావశ్యనవేయ ననుకూలముగ నియ్యది క్లుప్తంబొనర్పంబడి రమ్యమగుపదములచే నతిసొంపుగ, మనోహర భావంబుల రచింపంబడె. "ఏకో నారాయణోహరిః" 'అద్వితీయంబ్రహ్మ' భగవంతుండొక్కడు. ఆయనయే నారాయణ దేవుండు. ఆయనదక్క మరొక పరబ్రహ్మ లేడను వాక్యాను సారణి శ్రీమన్నారాయణ దేవుండొక్కండయ్యు, బాలుండొక్క డయ్యు బెక్కునామంబులఁబిలువంబడురీతి, ననంతకోటినామంబుల నారాధింపబడు. నేఁడు భావపురిని భిన్నభిన్న నామంబుల విరాజిల్లు శ్రీ మన్నారాయణాలయాదులు, ధర్మ సత్రములు, మఠములు, వేదకళాశాలాదుల చరిత్రలతిరమ్యమగు శైలినింమ రచింపంబడుటయు నాక ఆచార్యసోదరు లవ్వాని చిత్రరూపంబుల సైతము సేకరించి,పండితపామర జనాహ్లాదంబుగ నిందుబొందుపరచి కృతార్థులైరి. ఇయ్యది భావపురీ క్షేత్రమాహాత్మ్యమన నొప్పు. ఇందలి రచనలంబఠించిన కొలది పాఠక మహాశయులభక్తియినుమడించు. ఇయ్యది దేవదేవు భావంబులగుట, భావంబుల నాదేవుండు విరాజిల్లియుంట, కవివతంసుని భావంబుల నతినిగూఢంబుగ నారాయణ దేవుండు తేజోమూర్తియయి బ్రకాశించుచుంట,

నారాయణ భావంబందులగీలించియుంట, భావనారాయణ, భావదేవ యను రచయిత నామకరణం బిద్దానికి సార్థకం బగు ననియు నయ్యదే రచయితయగు శ్రీమాన్ వేంకట రంగాచార్యులుగారి యాశయమనియు నస్మదీయదృఢ విశ్వాసము వ్యయ ప్రయాసలకోర్చి పెక్కు విచిత్ర విషయంబుల దూర భూములనుండియు సేకరించి రమ్యమగు గ్రంధరూపంబొసంగి భక్తమహాశయుల నానందాంబుధి, భక్తి తరంగముల నోలలాడించు శ్రీ యాచార్యసోదరు లిర్వురతి ప్రశంసనీయులు, ధన్యులు.

నారాయణదేవ గూర్చి నిజమనోభావంబులను, లోకంబున కతివిపులంబుగ భక్తియుతంబుగ వెదజల్లిన శ్రీ యాచార్యసోదరులిర్వురకు, వారి కుటుంబములకు శ్రీభావనారాయణ స్వామివారనవరత మాయురారోగ్య ఐశ్వర్యాదులనొసంగి చిరకాలమిమ్మాదిరి రక్షించుగాక. శ్రీభావనారాయణ స్వామివారి యనుగ్రహంబున భక్త మహాశయులెల్లరీ గ్రంథంబు నామూలాగ్రంబుగఁ బఠియించి కృతార్థులగుదురుగాక,

ఇట్లు,

బుధజన విధేయుఁడు.

శ్రీకృష్ణ పాదసేవకుడు,

చుండూరు నాగభూషణరావు.

పురాణవిమర్శక, హిందీవిశారద, శ్రీ జగత్పురాణ ప్రథమభాగ జగత్ఖండము, ద్వితీయభాగ శ్రీరామఖండము, భక్తిమార్గములు, పురాణాంతర్గత వంశత్రిచారిత్రము వగైరా గ్రంథకర్త బ్రహ్మాండం, జంబూద్వీపాది చతుర్దశ లోకపటములు, బ్రహ్మ, సూర్య, చంద్ర, వంశవృక్షాదుల రచయిత.

# పరిచయము

కృతయుగంబున గౌతమాది సప్తఋషులు బ్రహ్మారణ్యామనఖ్యాతిగాంచిన ఈ ప్రాక్సాగరోత్తర తీరారణ్యమున శ్రీమన్నారాయణుని యజ్ఞేశ్వరునిగా ఆరాధించి దర్శించిరి. అటనుండి బ్రహ్మాదులు క్రమముగా కలియుగమువరకు శ్రీవారి నారాధించుచూ వైభవాదుల కొనియాడిరి.

కలియుగాది 3694వ సంవత్సరమున దిగ్విజయార్థమై వెడలిన క్రిమికంఠ చోళ మహీపతి ఈ ప్రదేశమునకువచ్చి మార్గాయాస శ్రమబాపుకొనుటకై ఇట కొంతకాలముండె. గౌతమునిచే యజ్ఞమొనరింపబడిన కుండమునందు, యజ్ఞేశ్వరుండైన నారాయణుండు క్షీరభూరుహకల్పనంబు చేసి అందు శేషీభూతుండైయుండె. జయయాత్రచేయుచున్న చోళుని గజములు ఆహారమునకై అరణ్యమునకువచ్చి ఈ క్షీరభూరుహంబును గదసి కరంబులూడ కుండుటంజేసి పాలకునకై ఘీంకారమిడజొచ్చెను. చోళమహీపతి మావటీలచే వృత్తాంత మెఱిగి భయవిహ్వల మానసుండై దివ్యభూరుహ దర్శనంబు చేసికొని ప్రార్థించెను. అంతస్వామి రాజు ప్రార్థనకు సంతసించి వారి గజయూథముల రక్షించి విడచె. రాజు తన ప్రార్థనారూపమైన గజపాదాకృత శతస్తంభ నిర్మిత సుందర విమాన చిత్రిత దివ్యాలయమును సమకూర్చ అందుకోటిసూర్య ప్రభాభాసమానుండై భావనారాయణాఖ్య యర్చాస్వరూపుడై వేంచేసిరి. స్తోత్రాదులగావించి యజన యాజకుల నేర్పరచి ఆలయమున గంగాపార్వతీ సహిత సోమేశ్వర ప్రతిష్టాదికముల గావించి పురోగతుండయ్యె.

అటనుండి వీరిసంతతివారు కల్యాది 4216 వరకు 522 సంవత్సరములు ధర్మయుతముగా పాలించిరి. కల్యాది 3949లో చోళుల దివాన్‌జీయైన కుంతీసం రాఘవరెడ్డిగారు ప్రఖ్యాతి గల బాపట్ల చెఱువును త్రవ్వించిరి. కల్యాది 4210లో కుళో త్తుంగ చోళమహీపాలుడు ఇట కనతిదూరమునగల గోష్టీవనం బున శ్రీ భావనారాయణ స్వామివారికి ఆలయమును నిర్మిం చిరి. (ఇప్రుడు స్వర్ణపురీ లేక పొన్నూరు అని పిలువబడుచున్నది.

తరువాత కల్యాది 4419 సం. వరకు గజపతి సింహాస నస్థులయిన గణపతులు పాలించిరి. అటుపిమ్మట కల్యాది 4519 సం. వరకు రెడ్డిరాజులుపాలించిరి. తదనంతరం కల్యాది 4619 వరకు లాంగూల గజపతుల పాలనజరిగినది.

అటనుండి కల్యాది 4679 వరకు నరపతి సింహాసనస్థు లయిన శ్రీ కృష్ణదేవరాయలవారు వారి సంతతివారు పాలిం చిరి. వీరిపాలనలో శ్రీ కృష్ణదేవరాయలు ఈ క్షేత్రమూర్తిని దర్శించిన చిహ్నముగా నొకశాసనము నిచటవేయించిరి.

తరువాత కల్యాది 4851 వరకు తురుష్క భూపతులైన మలిక్ విభురహం పాదుషావారు వారి వంశీకులు పాలించిరి. కల్యాది 4851 నుండి 4859 వరకు ఈ ప్రాంతము పరాసుల విప్లవచర్యకులోనై ఆఖరు సంవత్సరము 4858 లో శ్రీస్వామి వారికి పూజానమస్కారములకు పూర్తి అంతరాయమేర్పడెను.

కల్యాది 4859 సం॥ లో ఈస్టిండియా కంపెనీవారి పాల నకురాగా వారి దివాన్‌జీయైన జోగీపంతులువారిచే పునరుద్ధ రింపబడెను. ఆకాలముననే వీరిచే గంగాపార్వతీ సహిత సోమే

శ్వరస్వామికి ప్రత్యేకాలయ నిర్మాణము, పునః ప్రతిష్ఠాదులు గావింపబడెను. తరువాత కల్యాది 4903 నుండి 4911 వరకు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారి పాలనలోనుండెను. బ్రిటీషు వారి పాలనవచ్చిన తర్వాత ఆలయమును కల్యాది 5030 సంవత్సరమువరకు యాజమాన్య కైంకర్యములు అర్చక స్వాములే భరించుచు భక్తుల ప్రోత్సహించి ఆభరణ వస్తువాహనాదుల నేర్పరిచి శ్రీవారికి విశేష వైభవమును చేకూర్చిరి

కల్యాది 5030 సం॥లో స్కీముక్రాబడి ఆలయమున ధర్మకర్తలపాలన ఏర్పడి, క్రమముగా H. R. & C. E బోర్డు వారి క్రిందకువచ్చి యగ్జిక్యూటివు ఆఫీసరుగారు ధర్మకర్తలు కలసి పాలనచేయుచుండిరి. వీరిపాలనములో కల్యాది 5062 సం॥ లో తొమ్మిదిరోజులు (క్రీ. శ. 1-7-61 నుండి 9-7-61 వరకు) శ్రీవారి నివేదనాదుల కంతరాయము కల్గెను.

ఆ సమయమున గ్రామస్థులు శ్రీ బాపట్ల భావనారాయణస్వామి, శ్రీ సోమేశ్వరస్వామివార్ల దేవాలయముల పునరుద్ధరణ సంఘమను పేరనొక సంఘమేర్పరచిరి. గ్రామస్థులు సంఘముద్వారా జరిపిన ఆందోళన ఫలితముగా అప్పటి H. R. & C. E. బోర్డు అసిస్టెంటు కమీషనరుగారైన శ్రీ కె.రంగనాథరావుగారు వెంటనే యదార్థమెఱిగి ఆగమశాస్త్ర విధి విహితాను సారముగా ప్రాయశ్చిత్తాదుల జరిపించి సక్రమ స్థితికిదెచ్చిరి. అటనుండి దేవాలయ కార్యములతి శ్రద్ధా భక్తులతో జరుపుచున్నారు. భక్తులెల్లరు స్వామినిసేవించి కృతార్థులగుదురుగాకయని యాశించుచున్నాము.

శ్రీ భావదేవునిగూర్చి ప్రజానీకమునకు తెలిసియున్న దసరా పాట నొకదానిని పొందుపరుచుచున్నాము.

"పాలచెట్టునుబట్టి భక్షింపజూచి చోళభూపాలగా
జాలితొండముల చెట్టు కొమ్మననుండ.
జూచియారాజు చేతవందితుడవై సిద్ధంబుగాను,
బాపట్ల నెలకొన్న పరమాత్మనిన్ను, భావదేవ
యటంచు, బ్రస్తుతించెదము, దారిద్రభయ
నిర్దళిత ప్రఖ్యాతి, ఆరూఢి మముబ్రోవుమన్న,
మన్మాతకలగు నీలగు ప్రజ్ఞ, కలగు మాయమ్మ
వెలయంగ శ్రీ మహావిష్ణునికొమ్మ,
రాజ్యలక్ష్మమ్మ రక్షింపుమమ్మ
జయాభిజై భవ దిగ్విజయీభవ"

మాకు తెలిసినంతవరకు శ్రీ భావనారాయణస్వామి వారి క్షేత్రముల ఇందు పొందుపరచినాము.

1. బాపట్ల 2. పొన్నూరు 3. భావదేవరపల్లి
4. సర్పవరము 5. పట్టసము 6. పెదగంజాము
7. పాదర్తి 8. ఇనిమెళ్ళ 9. నరసరావుపేట
10. అమర్తలూరు.

ప్రాజ్ఞులెవరైన యింకను శ్రీ భావనారాయణస్వామి క్షేత్రములు మరిఎక్కడనైన కలవేని తెలుపుదురని ఆశించుచున్నాము.

ఆసక్తి కలవారమే గాని శక్తికలవారముగాము. దోసగు లేవైన పొసగిన క్షమాసాదులగుతాము సహించుదురుగాక యని కోరుచున్నాము.

ఇట్లు,
బుధజనవిధేయులు
నల్లూరి వేంకట రంగాచార్య సోదరులు.



గ్రంథ ప్రకాశకులు

గౌ త మ  సో ద రు లు

నల్లూరి వేంకట రంగాచార్యః — వేంకట సీతారామాచార్యః

బా ప ట్ల.

శ్రీ రామాయనమః

శ్రీమద్వైఖానసమహాగురుభ్యోనమః

# శ్రీ భావదేవ సుప్రభాతమ్

కౌసల్యా సుప్రజా రామ ! పూర్వా సన్ధ్యా ప్రవర్తతే !
ఉత్తిష్ఠ నరశార్దూల ! కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవిన్ద ! ఉత్తిష్ఠ గరుడధ్వజ !
ఉత్తిష్ఠ కమలాకాన్త ! త్రైలోక్యం మఙ్గళం కురు ॥

మాతస్సమైవ । జగదీశ్వరి దివ్యమూర్తే ।
లోకైకనాథ హితకారిణి । లోకమాతః ।
బ్రహ్మాదిదేవ । పరిరక్షణ బద్ధభావే ।
శ్రీభావదేవదయితే । తవ సుప్రభాతమ్ ॥ ౧

క్షీరార్ణవే ఫణిపతౌ శయితస్త్వమత్ర ।
క్షీరద్రుమే చ వసతిం బహు మన్యమానః ।
క్షీరోదజాసహచర స్సకలాన్ త్వదీయాన్
సంరక్షితుం వససి కేశవ । భావదేవ ॥ ౨

వైఖానసాస్స్వభుజ యోజిత యన్త్రికాశ్చ ।
విష్ణ్వర్పితాఖిలభరాః । పరమప్రపన్నాః ।
ద్వారస్థితా స్తవ పదార్చన బద్ధదీక్షాః ।
శ్రీభావపత్తనవిభో । తవ సుప్రభాతమ్ ॥ 3

శ్రీ వైష్ణవాః । పరమసాత్త్విక భాగపూర్ణాః ।
గాథాః పఠన్తి కరపంకజ సిక్తపుష్పాః ।
కైంకర్యలాభ నిరతాస్తు సమాగతాహి ।
శ్రీభావపత్తనవిభో । తవసుప్రభాతమ్ ॥ ౪

ప్రాప్తాస్తువైదిక శిఖామణయః పఠన్తి ।
వేదాన్ త్వదీయగుణ గుంభిత సర్వభాగాన్ ।
చిత్తాపహారచతురాన్ పరమప్రకృష్టాన్
శ్రీభావపత్తన విభో । తవప్రభాతమ్ ॥ ౫

భేరీమృదంగ ఘనకాహళ వాద్యనాదైః ।
సంపూరయన్తి హరితః పరిచారవర్గాః ।
భక్తాః ఫలాంచిత కరాస్తు సమాపతన్తి ।
శ్రీభావపత్తనవిభో । తవసుప్రభాతమ్ ॥ ౬

భాస్వానుదేతి మధుకృన్నికరానదన్తి ।
కూజంతిచాద్య మధురం సకలాశ్శకుంతాః ।
క్షీరాణి గాస్స్రవతి రోదితి తర్ణకస్తే ।
శ్రీభావపత్తన విభో తవ సుప్రభాతమ్ ॥ ౭

వినాభావదేవం ననాథోననాథః ।
సదాభావదేవం స్మరామి స్మరామి ।
హరే । భావదేవ । ప్రసీద ప్రసీద ।
ప్రియం భావదేవ । ప్రయచ్ఛ ప్రయచ్ఛ । ౮

నిందితాశ్చ కృతానిత్యం విహితాశ్చాఽకృతామయా ।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం భావదేవదయానిధే । ౯

శ్రీభావపత్తనవిభో తవసుప్రభాతమ్ ।
ప్రత్యూషకాల ఫలదం పరమం పవిత్రం
యేమానవాః పిపఠిషా వశగాః పఠన్తి ।
తేషామనశ్వరఫలం శుభదం కరస్థమ్ ॥ ౧౦

# శ్రీ భావనారాయణస్తోత్రమ్

అభయవరదహస్తాం పద్మ సింహాసనస్థాం
కనకకమల యుగ్మప్రోల్ల సత్పాణియుగ్మాం
అణుపరిమితమధ్యాంకుంభి కుంభ స్తనాఢ్యాం
పృథుల జఘనశోభాం రాజ్యలక్ష్మీం నమామి॥ ౧

శ్రీభావదేవ మభయప్రదమబ్జహస్తం
చండాంశుతీవ్రకరకల్పసుతీక్ష్ణచక్రం
సోమప్రకాశ జలజంకటిమధ్యపాణిం
వందే రమావసుమతీ సహితం సురేశమ్॥ ౨

దివ్యంక్షీరపయోధిమధ్యశయనం దేదీప్యమానంవరం
కోటీరామలమందరాచలధరం సత్కంధరం సుందరం
మందస్మేరసుధామనోజ్ఞ వదనం మార్తాండకోటిప్రభం
శ్రీ బాపట్లపురీశమీడ అనిశం శ్రీభావనారాయణమ్॥ 3

కాశ్మీరాగరు చందనాక్తమతుల భుజగ్రైవేయహారావళిం
ముక్తాదామవిభూషణాంచితగళం శ్రీవత్సవక్షస్థలం
కస్తూరీరచితోర్ధ్వపుండ్ర విలసత్ఫాలంకృపాళుం భజే
శ్రీ బాపట్లపురీశ మీశమనిశం శ్రీ భావనారాయణమ్॥ ౪

శ్రీమహీభ్యాంచ సహితం శ్రీవత్సమణిభూషణం
భావనారాయణం దేవం భజేభావపురీశ్వరమ్॥ ౫

శ్రీకారుణ్య రసాబ్ధిపూర్ణ! విలసత్సన్మార్గ లోకావనా!
సాకారామల నిర్వికార! విలసత్సానంద శశ్వత్సుఖా!
పాకారిప్రముఖార్చితాంఘ్రియుగళా! పాపౌఘసంహారకా!
శ్రీకాంతాహృదయాబ్జ మత్తమధుపా! శ్రీభావనారాయణా॥ ౬

చండప్రస్ఫుట బాహుదండ ఘన! రక్షశ్శిక్షణోద్దండ! బ్ర
హ్మాండాంతః ప్రతిభాస! భాసురశుభానందైకరూపా! మహో
ద్దండప్రక్రియ మూలకారణ! విశుద్ధా! శ్రీయుతా! శాశ్వతా!
చండాంశుప్రతిభ ప్రకాశ! జగదీశా! భావనారాయణా॥ ౭

సర్వోత్కృష్ట పదా! స్వభావ విలసత్సర్వైక రూపాకరా!
పర్వేందుప్రతిభాసమానముఖ! సత్పంకేరుహాక్షిద్వయా!
నిర్వాణప్రియయోగిమానససుఖోన్మీల త్ప్రభావీక్షణా!
గీర్వాణౌఘనుతా! సమస్తగుణసాక్షీ! భావనారాయణా॥ ౮

కరిరాజొక్క సరోవరంబున మహాగ్రాహంబుచే జిక్కియే
వెరవున్గానక దిక్కునీ వగద రావేయంచు నిన్ వేడగా
వెరపింకేటికటంచు నుద్దవిడితో విచ్చేసి తద్గ్రాహ కం
ధరఖండించి గజేంద్రుగాచితివిగాదే భావనారాయణా॥ ౯

శ్రీ మత్సుందరవల్లిరాజ్యరమతో శృంగార వేషంబుతో
నామోదంబున భక్తరక్షణకు తా నర్చాస్వరూపంబు స
త్ప్రేమందాల్చి విశేషవైభవము శోభిల్లంగ బాపట్ల స
ద్ధాముండౌ వరభావదేవుని నినున్ ధ్యానింతు నశ్రాంతమున్॥ ౧౦

# శ్రీ భావదేవ మఙ్గళాశాసనమ్

శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేఙ్కట నివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్॥

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మఙ్గళమ్॥

వేదవేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మఙ్గళమ్

క్షీరవృక్షే ఽవతీర్ణాయ క్షీరసాగరశాయినే
రాజ్యలక్ష్మీ సమేతాయ భావదేవాయ మఙ్గళమ్॥ ౧

భావపత్తనవాసాయ భక్తాభీష్టప్రదాయినే
భానుకోటిప్రకాశాయ భావదేవాయ మఙ్గళమ్॥ ౨

యోగిమానసగమ్యాయ వైకుంఠ పురవాసినే
విభూతిద్వయనాథాయ భావదేవాయమఙ్గళమ్॥ ౩

కల్యాణగుణ పూర్ణాయ కామితార్థ ప్రదాయినే
కారుణ్యామృత పూరాయ భావదేవాయమఙ్గళమ్॥ ౪

సర్వదేవాదిదేవాయ సర్వభూతాంతరాత్మనే
సర్వకారణభూతాయ భావదేవాయ మఙ్గళమ్ ౫

శ్రీభూమానసచోరాయ శేషపర్యంక శాయినే
వైఖానస మునిశ్రేష్ఠ పూజితాయాస్తు మఙ్గళమ్॥ ౬

మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః
సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మఙ్గళమ్।



శ్రీ సైమనమః

# శ్రీ మద్రాజ్యలక్ష్మి అష్టోత్తర శతనామ స్తోత్రమ్

ఓం శ్రీ గురుభ్యోనమః హరిః ఓం

శుక్లాంబర ధరంవిష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥

వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయవిష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః

ధ్యానమ్:-

అభయవరదహస్తాం పద్మ సింహాసనస్థాం
కనకకమల యుగ్మప్రోల్లసత్పాణియుగ్మాం
అణుపరిమితమధ్యాంకుంభి కుంభ స్తనాఢ్యాం
పృథుల జఘునశోభాం రాజ్యలక్ష్మీం నమామి॥

శ్లో॥ రమా రాజ్యరమాచైవ రామాయణకథాప్రియా
రమణీయాన్నభోక్త్రీ చ రథహాస్త్యశ్వదాయినీ॥ ౧

,, రక్షోఘ్నీ రమ్యరూపాఢ్యా రాజ్యదా రాజ్యవర్ధినీ
రసాధిపా రోగహంత్రీ రాగదా రాగభూషితా॥ ౨

,, రసప్రదీప్తా రసికా రక్షోగణవినాశినీ
రంభాదిపూజితా రమ్యారామానందప్రదాయినీ॥ ౩

,, రత్నహారా రాజమునిస్తుత్యా రాజీవమందిరా
రథారూఢా రాజవంద్యా రుక్మిణీ రుక్మిసోదరీ॥ ౪

,, రత్నగర్భా రోహిణీ చ రత్నకంకణధారిణీ
రత్నాకరసుతా రాజరాజసేవితపాదుకా॥ ౫

,, రత్నాంగీ రత్నదాత్రీ చ రత్నాకరసముద్భవా
రత్నాంచితకిరీటా చ రమ్యోద్యానవిహారిణీ॥ ౬

,, రత్నాఢ్యా రాగరూపా చ రాగాతీతా చ రాగిణీ
రత్నానువిద్ధమాల్యా చ రత్నపర్యంకశాయినీ॥ ౭

,, రత్నాసనస్థితా రాజప్రత్నస్థగితపాదుకా
రతిరాజస్తుతా రమ్యా రుక్మాంగదసుపూజితా॥ ౮

,, రణరంగప్రియా రత్నదాయినీ రాక్షసీవృతా
రాకేందువదనా రామభక్తసౌభాగ్యదాయినీ॥ ౯

,, రంగద్భావపురీరమ్యా రాజదర్పాపహారిణీ
రంగదాసార్చితపదా రఘువంశకథారతా॥ ౧౦

శ్లో॥ రంగరాజపురాంతస్థా రంగరాజసుఖప్రదా
రంగేశ్వరీ రాజముఖీ రణన్నూపురభూషణా॥ ౧౧

,, రాజరాజార్చితపదా రాజద్గంధేభవాహనా
రాజరాజాదిసంస్తూయమానా రాజ్యప్రదాయినీ॥ ౧౨

,, రాజరాజేశ్వరీవంద్యా రావణజ్ఞానబోధినీ
రాజంతీ రాజభృత్యా చ రాక్షసౌఘవినాశినీ॥ ౧౩

,, రాజానుజా రంగరాజమహిషీ రంగనాయికా
రాజితా రమణీ రామా రామచిత్తానుసారిణీ॥ ౧౪

,, రాజ్యకీర్తి రమ్యరూపా రమ్యపుష్పవిభూషితా
రాజ్యశ్రీ రాజ్యరూపా చ రణత్కింకిణిమేఖలా॥ ౧౫

,, రాజీవలోచనా రాధా రాజ్ఞీ రమ్యగుణాశ్రయా
రాజీవపాదా రాజీవహస్తా రాజీవధారిణీ॥ ౧౬

,, రామభక్తార్చితపదా రాజన్మకుటమండితా
రామపాదాశ్రితా రామవామాంకస్థా చ రంజితా॥ ౧౭

,, రామప్రియా రాజ్యలక్ష్మీ రాకాచంద్రనిభాననా
రామానుజస్తుతా రామభక్తా రమ్యవరప్రదా॥ ౧౮

,, రాక్షసీరక్షణవ్యగ్రా రుద్రాణ్యాదిసమర్చితా
రుద్రార్చితపదా రంగనగరాంతర్విహారిణీ॥ ౧౯

,, రుద్రాదిదేవసందోహసమర్చితపదాంబుజా
రుద్రబ్రహ్మాదిసంసేవ్యా రుక్మమాలావిభూషితా॥ ౨౦

శ్లో॥ రోగసంఘవినిర్ముక్తా రుజాహంత్రీ చ రుక్ప్రదా
శ్రీమద్భావపురీవాస రాజ్యలక్ష్మ్యై నమోనమః॥ ౨౧

,, రాజ్యలక్ష్మ్యాః ప్రసాదేన కృతమష్టోత్తరం శతమ్
త్రిసంధ్యం జపతే యస్తు మాసమేకం నిరంతరమ్॥ ౨౨

,, పుత్రాన్ పౌత్రాన్ వరాన్నప్రాప్తిన్ ధనంధాన్యంయశస్సుఖం
ఆయుష్యం లభతేపూర్ణమైశ్వర్యమపి వాంఛితమ్॥ ౨౩

,, సర్వాన్కామానవాప్నోతి శత్రూన్జయతి సర్వదా
రాజ్యలక్ష్మ్యాః ప్రసాదేనహ్యంతే
మోక్షమవాప్నుయాత్ ॥ ౨౪

శ్రీ మద్రాజ్యలక్ష్మీ దేవ్యష్టోత్తర
శతనామస్తోత్రం సమ్పూర్ణమ్
హరిః ఓమ్ తత్సత్.

—(౦)—

## శ్రీ మద్రాజ్యలక్ష్మ్యష్టోత్తర శతనామావళిః

| | | | |
|---|---|---|---|
| ఓం రమాయై | నమః | ఓం రాజ్యదాయై | నమః |
| రాజ్యరమాయై | | రాజ్యవర్ధిన్యై | |
| రామాయణకథాప్రియాయై | | రసాధిపాయై | 10 |
| రమణీయాన్నభోక్త్ర్యై | | రోగహంత్ర్యై | |
| రథహస్త్యశ్వదాయిన్యై | | రాగదాయై | |
| రక్షోఘ్న్యై | | రాగభూషితాయై | |
| రమ్యరూపాఢ్యాయై | | రసప్రదీప్తాయై | |

ఓం రసికాయై నమః
రక్షోగణవినాశిన్యై
రంభాదిపూజితాయై
రమ్యారామానందప్రదాయిన్యై
రత్నహారాయై
రాజమునిస్తుత్యాయై 20
రాజీవమందిరాయై
రథారూఢాయై
రాజవంద్యాయై
రుక్మిణ్యై
రుక్మిసోదర్యై
రత్నగర్భాయై
రోహిణ్యై
రత్నకంకణధారిణ్యై
రత్నాకరసుతాయై
రాజరాజసేవితపాదుకాయై 30
రత్నాంగ్యై
రత్నదాత్ర్యై
రత్నాకరసముద్భవాయై
రత్నాంచితకిరీటాయై
రమ్యోద్యానవిహారిణ్యై
రత్నాఢ్యాయై
రాగరూపాయై
రాగాతీతాయై
రాగిణ్యై

రత్నానువిద్ధమాల్యాయై నమః
రత్నపర్యంకశాయిన్యై 41
రత్నాసనస్థితాయై
రాజద్రత్నస్థగితపాదుకాయై
రతిరాజస్తుతాయై
రమ్యాయై
రుక్మాంగదసుపూజితాయై
రణరంగప్రియాయై
రత్నదాయిన్యై
రాక్షసీస్తుతాయై
రాకేందువదనాయై 50
రామభక్తసౌభాగ్యదాయిన్యై
రంగద్భావపురీరమ్యాయై
రాజదర్పాపహారిణ్యై
రంగదాసార్చితపదాయై
రఘువంశకథారతాయై
రంగరాజపురాంతస్థాయై
రంగరాజసుఖప్రదాయై
రంగేశ్వర్యై
రాజముఖ్యై
రణన్నూపురభూషణాయై 60
రాజరాజార్చితపదాయై
రాజద్గంధేభవాహనాయై
రాజరాజాదిసంస్తూయమానాయై

ఓం రాజ్యప్రదాయిన్యై నమః
రాజరాజేశ్వరీవంద్యాయై
రావణజ్ఞానబోధిన్యై
రాజంత్యై
రాజభృత్యాయై
రాక్షసౌఘవినాశిన్యై
రాజానుజాయై 70
రంగరాజమహిష్యై
రంగనాయికాయై
రాజితాయై
రమణ్యై
రామాయై
రామచిత్తానుసారిణ్యై
రాజ్యకర్త్ర్యై
రమ్యరూపాయై
రమ్యపుష్పవిభూషితాయై
రాజ్యశ్రియై 80
రాజ్యరూపాయై
రణత్కింకిణిమేఖలాయై
రాజీవలోచనాయై
రాధాయై
రాజ్ఞ్యై
రమ్యగుణాశ్రయాయై
రాజీవపాదాయై
రాజీవహస్తాయై

ఓం రాజీవధారిణ్యై నమః 90
రామభక్తార్చితపదాయై
రాజన్మకుటమండితాయై
రామపాదాశ్రితాయై
రామనామాంకస్థాయై
రంజితాయై
రామప్రియాయై
రాజ్యలక్ష్మ్యై
రాకాచంద్రనిభాననాయై
రామానుజస్తుతాయై
రామభక్తాయై
రమ్యవరప్రదాయై 100
రాక్షసీరక్షణవ్యగ్రాయై
రుద్రాణ్యాదిసమర్చితాయై
రుద్రార్చితపదాయై
రంగనగరాంతర్విహారిణ్యై
రుద్రాదిదేవసందోహ
సమర్చితపదాంబుజాయై
రుద్రబ్రహ్మాదిసంసేవ్యాయై
రుక్మమాలావిభూషితాయై
రోగసంఘవినిర్మూలాయై
రుజాహంత్ర్యై 109
రుక్మదాయై
ఓం శ్రీమద్భావపురీవాస
రాజ్యలక్ష్మ్యై నమోనమః

...



ఓం నమో భావనారాయణాయ నమః

# శ్రీ భావనారాయణాష్టోత్తర శతనామ స్తోత్రమ్

ఓం శ్రీ గురుభ్యోనమః హరిః ఓం

శుక్లాంబర ధరంవిష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే

యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నంనిఘ్నంతి సతతం విష్వక్సేనంతమాశ్రయే॥

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥

వ్యాసాయవిష్ణురూపాయ వ్యాసరూపాయవిష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః

ధ్యానమ్:-
శ్రీభావదేవ మభయప్రదమబ్జహస్తం
చండాంశుకోటిరుచిరోజ్జ్వలతీక్ష్ణచక్రం
సోమప్రకాశ జలజం కటిమధ్యపాణిం
వందే రమావసుమతీ సహితం సురేశమ్॥

శ్రీమహీభ్యాంచ సహితం శ్రీవత్సమణిభూషణం
భావనారాయణం దేవం భజేభావపురీశ్వరమ్॥

శ్లో॥ భగవాన్ భవ్యదాతా చ భాగ్యదో భవ్రికారకః
భక్తరక్షణభావాఢ్యో బృందాచిత్తాపహారకః॥ ౧

,, భక్తలోకమనోహారీ భక్తలోక వరప్రదః।
భక్తానురక్తో భక్తేశో భక్తలోకసుఖప్రదః॥ ౨

,, భక్తార్తినాశనో భావపత్తనస్థో బలానుజః
భర్గజేతా భవాత్మా చ బహుబ్రహ్మాండనాయకః॥ 3

,, భవబ్రహ్మాదిదేవేశో భవసాగరతారకః
భార్గవో భృగునిర్ణీతపరత్వో భానుమధ్యగః ౪

,, భావనారాయణో భర్గవరదో భక్తవత్సలః।
భావపట్టణవాసీ చ భూసురప్రీతికారకః॥ ౫

,, భావప్రపంచనిలయో భావచక్రప్రవర్తకః।
భావగర్భో భూమినాథో భవబంధవిమోచకః॥ ౬

,, భాసకో భాస్కరో భానుః బాణబాహువిదారకః।
భాస్కరార్చితపాదాబ్జో భానుచంద్రసులోచనః॥ ౭

,, భాస్వద్రత్నకిరీటీ చ భూసురో భూతిదాయకః॥
భీమో భ్రాతృహితో భీష్మో బీష్మ్రైకైవల్యదాయకః॥ ౮

,, భీకరఘ్నో భీమ్మరూపో భీషణాకారశక్తియుక్।
భూషాభూషితసర్వాంగో భూనభోంతరవిక్రమః॥ ౯

,, భూభారహరణో భూమియాచకో భూసురార్చితః।
భూదేవరక్షణవ్యగ్రో భూతానామభయప్రదః ౧౦

శ్లో॥ భూమీరమహాసుజాతశ్చ భాగ్యలక్ష్మీమనోహరః॥
భృగుపూజితపాదాబ్జో భార్గవీశో భయాపహః ౧౧

,, భృగుపత్నీప్రాణహారీ భృగుప్రీతిమనోహరః
బాణకోదండహస్తశ్చ భావాతీతో బృహద్రథః॥ ౧౨

,, బటురూపధరో భూపరక్షకో బంధమోచకః।
బలరామానుజశ్చాపి భేషజో భిషగాత్మకః॥ ౧౩

బలిశీర్షస్థపాదాబ్జో బాలరూపో భవప్రియః॥
,, బాలగోపాలరూపశ్చ బాలక్రీడాపరాయణః। ౧౪

బాలకృష్ణస్వరూపశ్చ బాలభానుస్వరూపవాన్॥
,, బాలక్రీడాసక్తచిత్తో బాలగ్రహవినాశకః। ౧౫

బాణప్రయోగనిపుణో భానుభాసురవిగ్రహః॥
,, బంధురారణ్యమధ్యస్థక్షీరభూజోద్భవో భవః। ౧౬

బంధుభూతో భవ్యరూపో భావుకేశో బలాధికః॥
,, బృందావననివాసీ చ బృందాదేవీసమర్చితః ౧౭

,, బ్రహ్మకృత్యానురక్తశ్చ బృహత్సింధురగోచరః।
,, బ్రహ్మాండగర్భో బ్రహ్మణ్యో బ్రాహ్మణో
బ్రహ్మమూర్తిమాన్॥ ౧౮

,, బ్రహ్మాంతరాత్మా బ్రహ్మేశో భవఘ్నో భ్రాతృవత్సలః
బ్రహ్మాదిదేవసంధ్యాతో బ్రహ్మాండానాంప్రవర్తకః॥ ౧౯

,, బ్రహ్మాస్త్రరూపీ బ్రహ్మా చ బ్రహ్మాస్త్రవినివారకః।
బ్రహ్మాగమ్యో బ్రహ్మవేద్యో బ్రహ్మశత్రువిభేదకః॥ ౨౦

శ్లో॥ బ్రహ్మవిద్ బ్రహ్మరూపశ్చ బ్రహ్మజ్ఞానప్రబోధకః
(శ్రీ) భావనగరాధీశ నారాయణ నమోఽస్తుతే॥ ౨౧
,, ఇతీదం భావదేవస్య నామ్నామష్టోత్తరం శతమ్।
భయాపహం భవఘ్నం చ పుత్రపౌత్రాభివర్ధనమ్॥ ౨౨
,, ఆయురారోగ్యదం సంపత్కీర్తిదం చ సుఖావహమ్
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం సర్వకామఫలప్రదమ్॥ ౨౩
,, భావనారాయణాధీశ ప్రసాదాత్పరమోత్తమాత్।
సర్వాన్కామానవాప్యైవ హ్యంతే మోక్ష
మవాప్నుయాత్॥ ౨౪

(శ్రీ) భావనారాయణాష్టోత్తర
శతనామస్తోత్రమ్ సమ్పూర్ణమ్
హరిః ఓమ్ తత్సత్.

—o—

## శ్రీ భావనారాయణాష్టోత్తర శతనామావళిః

| | |
|---|---|
| ఓం భగవతే నమః | ఓం భక్తేశాయ నమః 10 |
| భవ్యదాత్రే | భక్తలోకసుఖప్రదాయ |
| భాగ్యదాయ | భక్తార్తినాశనాయ |
| భద్రకారకాయ | భావపత్తనస్థాయ |
| భక్తరక్షణభావాఢ్యాయ | బలానుజాయ |
| బృందాచిత్తాపహారకాయ | భర్గజేత్రే |
| భక్తలోకమనోహారిణే | భవాత్మనే |
| భక్తలోకవరప్రదాయ | బహుబ్రహ్మాండనాయకాయ |
| భక్తానురక్తాయ | భవబ్రహ్మాదిదేవేశాయ |

ఓం భవసాగరతారకాయ నమః
భార్గవాయ 20
భృగునిర్ణీతపరత్వాయ
భానుమధ్యగాయ
భావనారాయణాయ
భర్గవరదాయ
భక్తవత్సలాయ
భావపట్టణవాసినే
భూసురప్రీతికారకాయ
భావప్రపంచనిలయాయ
భావచక్రప్రవర్తకాయ
భావగర్భాయ 30
భూమినాథాయ
భవబంధవిమోచకాయ
భాసకాయ
భాస్కరాయ
భానవే
బాణబాహువిదారకాయ
భాస్కరార్చితపాదాబ్జాయ
భానుచంద్రసులోచనాయ
భాస్వద్రత్నకిరీటినే
భూసురాయ 40
భూతిదాయకాయ
భీమాయ
భాతృహింత్రాయ

ఓం భీష్మాయ నమః
భీష్మకైవల్యదాయకాయ
భీకరఘ్నాయ
భీష్మరూపాయ
భీషణాకారశక్తియుజే
భూషాభూషితసర్వాంగాయ
భూనభోంతరవిక్రమాయ 50
భూభారహరణాయ
భూమియాచకాయ
భూసురార్చితాయ
భూదేవరక్షణవ్యగ్రాయ
భూతానామభయప్రదాయ
భూమీసుహాసుజాతాయ
భాగ్యలక్ష్మీమనోహరాయ
భృగుపూజితపాదాబ్జాయ
భార్గవీశాయ
భయాపహాయ 60
భృగుపత్నీప్రాణహారిణే
భృగుపుత్రీమనోహరాయ
బాణకోదండహస్తాయ
భావాతీతాయ
బృహద్రథాయ
బటురూపధరాయ
భూపరక్షకాయ
బంధమోచకాయ

ఓం బలరామానుజాయ నమః
భేషజాయ 70
భిషగాత్మకాయ
బలిశీర్షస్థపాదాబ్జాయ
బాలరూపాయ
భవప్రియాయ
బాలగోపాలరూపాయ
బాలక్రీడాపరాయణాయ
బాలకృష్ణస్వరూపాయ
బాలభానుస్వరూపవతే
బాలక్రీడాసక్తచిత్తాయ
బాలగ్రహవినాశకాయ 80
బాణప్రయోగనిపుణాయ
భానుభాసురవిగ్రహాయ
బంధురారణ్యమధ్యస్థ
క్షీరభూజోద్భవాయ
భవాయ
బంధుభూతాయ
భవ్యరూపాయ
భావుకేశాయ
బలాధికాయ
బృందావననివాసినే
బృందాదేవీ సమర్చితాయ 90
బ్రహ్మకృత్యానురక్తాయ
బృహత్సింధురగోచరాయ

ఓం బ్రహ్మాండగర్భాయ నమః
బ్రహ్మణ్యాయ
బ్రాహ్మణాయ
బ్రహ్మమూర్తిమతే
బ్రహ్మాంతరాత్మనే
బ్రహ్మేశాయ
భవఘ్నాయ
భ్రాతృవత్సలాయ 10
బ్రహ్మాదిదేవనిర్ధ్యాతాయ
బ్రహ్మాండానాంప్రవర్తకాయ
బ్రహ్మాస్త్రరూపిణే
బ్రహ్మణే
బ్రహ్మాస్త్రవినివారకాయ
బ్రహ్మగమ్యాయ
బ్రహ్మవేద్యాయ
బ్రహ్మశత్రువిభేదకాయ 108
బ్రహ్మవిదే
బ్రహ్మరూపాయ
బ్రహ్మజ్ఞానప్రబోధకాయ
ఓం నమో శ్రీ భావనగరాధీశ
నారాయణాయ నమః

హరిః ఓం తత్సత్



# శ్రీ భావనారాయణాష్టకము

మంగళం మంగళానాం పరం ప్రార్థయే
దైవతం దైవతానాం పరం ధీమహి
కారణం కారణానాం భజే భక్తసం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౧

ఇందిరా సుందరీ చిత్తపద్మస్థితం
దిందిరం మందిరం యోగినాం మానసే
వంద్య పాదారవిందం భజే భక్తసం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౨

దివ్యకోటీర కేయూర మంజీర శ్రీ
కంఠికాహార కాంచీ మణీంద్రాదిభిః
భూషణైర్భూషితం తం భజే భక్తసం
త్రాణ పారాయణం భావనారాయణమ్ 3

రంగ గోదా నృపంచాస్య శ్రీ భాష్యకా
రాంజనేయాది మూర్త్యాబ్జ జాతాదిభిః
పుష్పితం పారిజాతం భజే భక్తసం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౪

శ్రీ సుధావార్ధిమధ్యే యథా మానినా
మంతరంగే ఫణీంద్రే యథా సంస్థితః
క్షీరభూమీరాజగం తం భజే భక్తసం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౫

మాధవేమాసి దివ్యోత్సవే శ్రీకరే
గోపురద్వార మధ్యే రమాభూయుతం
వైనతేయాధిరూఢం భజే భక్త సం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౬

మాస్తుమే దుష్కథాలాప పాపస్మృతి
ర్మాస్తుమే దుర్మదావిష్ట దుస్సం
గతిః కింతు మోక్షప్రదం త్వాం భజే భక్త సం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౭

తత్ర శ్రీ మద్గజేంద్రార్తి నిర్మోచనం
చాత్రతు శ్రీ మద్గజేంద్రార్తి నిర్మోచనం
సత్కృతం యేన తం త్వాం భజే భక్త సం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౮

ప్రాతరుత్థాయ యః పండితః సంపఠే
త్పావనం భావనారాయణ స్యాష్టకం
భక్త సత్పారిజాతం భజే భక్త సం
త్రాణ పారాయణం భావనారాయణమ్ ౯



# శ్రీ భావదేవ దండకము:

శ్రీ మన్మహాదేవ । దేవాదిదేవా । లసద్భావ సంపూర్ణ
సంపత్ప్రభావాఢ్య । భావాఖ్యదేవా । సురాధ్యక్షరక్షా । విపక్షోరు
రక్షశ్చయోద్వృత్తశిక్షా । జగద్రక్ష । దాక్షిణ్యదీక్షా । సనం
దాదియోగీంద్రపోషా । సుభాషావిశేషా । మహోదార । భక్తా
పవర్గాకరా । సుందరాకార సంపూర్ణ సంపత్కరా । శ్రీకరా
భాకరా । శేషభాస్వన్మహాసల్పతల్పా । పరానందకల్పా । త్రిలో
కావనా । పావనాకార । గోవింద । సంక్రందనా । మానిరా
జ్ఞానసావాస । విశ్వేశ । ఈశా । మహేశా । పరాకాశవేశా ।
భవోద్రేకనాశా । సదానందకోశా । సుదంతఃప్రకాశా ।
నిరాకార । సాకారరూపా । ప్రదీపా । విరూపాక్షమిత్రా ।
రమానాథ । క్షీరాఖ్య భూమీజసంభూత । ప్రాక్సాగరోద
కటస్థా । మహాభావపట్టాధివాసా । మహాత్మా । నినున్ బ్రహ్మ
దేవేంద్ర శేషాదులున్ సన్నుతించంగ లేనట్టి సర్వాత్మ
నిన్నెంచ, నేనెంతవాడన్ గృపన్ జూచి రక్షింపుమీ దేవ ।
తుభ్యం నమస్తే నమస్తే నమస్తే నమః.

ప్రాచ్యాం శ్రీరామచంద్రస్తదను సునాశి స్తత్రంభాష్యకారః
నైఋత్యామాంజనేయస్తదను విహగాసంపాతి స్సుప్రసన్నః
ప్రత్యక్ శ్రీకేశవాఖ్యస్తదనుదిశి గమా రంగనాథశ్చ గోదా
మధ్యే శ్రీభూయుక్తం సకలభయహరం భావదేవం నమామి॥

ఓం రామదూతాయనమః

# శ్రీ ఆంజనేయ స్తోత్రమ్ (అష్టకమ్)

—o—

శ్రీఆంజనేయం జగదేకమూర్తిం శ్రీరామదూతం త్రిగుణస్వరూపం
శ్రీస్వర్ణమూర్తిం భువనైకపోషం స్తువే సదా దేవ మహర్నిశఞ్చ
నమోస్తు పంపాతటవాసితాయ నమోస్తు సీతాధవసేవకాయ
నమోస్తు దేవాన్తక శిక్షకాయ నమోస్తు భక్తావళి దక్షకాయ
నమోస్తు మైరావణ ఖ్ఢనాయ నమోస్తు దీనావన వ్రైనాయ
నమోస్తు వారాన్నిధి లఙ్ఘనాయ నమోస్తు శత్రుక్షయకారకాయ
శ్రీ ఆంజనేయశ్చ మదీయమాతా శ్రీవాయుపుత్రశ్చ పితామదీయః
శ్రీరామదూతో మమదేశికేన్ద్రో భూమ్యామ్పరం దేవ మహంనజానే
శ్రీఆంజనేయం మమ దేవదేవం మత్సర్వద్రవ్యం పవమానపుత్రం
భ్రాతాచమే ప్రాణసఖాహనూమాన్ భూమ్యామ్పరం
దేవమహంనజానే

నమోస్తు దివ్యాయ మహత్సుతాయ
నమోస్తు శ్రీరాఘవ సేవకాయ
నమోస్తు పఞ్చానన వానరాయ
నమోస్తు బ్రహ్మగ్రహనాశనాయ
శ్రీఆంజనేయం చిరకాలజీవిం ఓంకారరూపం వరహావతారం
ఖకారబీజం గరుడావతారం మకారబీజంచ నమామినిత్యం
శ్రీ ఆఞ్జనేయం గ్రహమారణాఖ్యం
శ్రీ సూర్యశిష్యం శివనామధేయం
శ్రీ సూర్యపుత్రీమ్భవభర్తృదేవం
భూమౌసదాస్తోత్రి మహఙ్కరోమి.

(బా వ ట్లు. శ్రీ వైఖానసాగమ ధర్మపాఠశాల, పండితులైన
శ్రీమాన్ ప్రొఫెసర్ ఆర్. సత్యానందస్వామి వారి నుండి
సేకరించబడినది.)



శ్రీ భావనారాయణస్వామివారి ఆలయ దృశ్యము
బాపట్ల

ఓం

శ్రీమత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీసమేత శ్రీ భావనారాయణస్వామినే నమః

శ్రీ

# బాపట్ల భావనారాయణ స్వామివారి చరిత్ర

శ్లో॥ విష్వక్సేన స్సృష్టతో నిత్యం భగవాన్ సర్వతస్సను
తస్మాన్నాన్య ముపాసీత విఘ్నానాముపశాంతయె

శ్లో॥ శ్రీ రాజ్యలక్ష్మీశ మఖండవైభవం, శ్రీ సుందరీవల్లియుతం సురేశం
శ్రీ భావపుర్యాం స్థితిమాత్తనాశం. శ్రీ భావనారాయణమీశమీడే॥

శ్రీమన్నారాయణునిచే సృజింపబడిన చతుర్దశ భువనంబులయందుగల భూలోకము కర్మభూమియని పిలువబడు చున్నది. అట్టిభూలోకమున, జంబూద్వీపాది సప్తద్వీపము లున్నవి. భరతఖండము మొదలుగాగల తొమ్మిదిఖండములు న్నవి. సప్తద్వీపములలో మనమున్నది జంబూద్వీపమని పిలువ బడుచున్నది. తొమ్మిది ఖండములలో భరతఖండమని పిలువ బడుచున్నది. భారతకింపురుషాది నవవర్షములలో భరతవర్షమని పిలువబడుచున్నది. గనుక మనము నివసించుచున్న యీభూభా

(3) ద్వాపరమునందు ఆరూధవుని ద్వైవిధముగా అంతగా ఆరాధన సలుపుచుండిరి.

యిట్లారాధింపబడుచుండిన శ్రీ మన్నారాయణుడు ద్వాపరాంతమున శేషభావమును స్వీకరించి ఒకానొకపాలచెట్టు నందంతర్హితుడై యున్నారనిభావము. యీ పాలచెట్టు మొలచిన ప్రదేశ ప్రాశస్త్య మెట్టిదో కనుగొందము.

కృత, త్రేత, ద్వాపరములలో బ్రహ్మర్షులు ఏ ప్రదేశమున యాగకుండము నిర్మించి యాగములతో శ్రీమన్నారాయణునిగూర్చి గోఘృతాది ప్రశస్త ద్రవ్యములతో హోమమాచరించి కృతార్థులయిరో అట్టి యాగకుండమునందే యీ క్షీరవృక్షము మొలచినది. ఆ క్షీరవృక్షమునందే కృత, త్రేత, ద్వాపరములలో బ్రహ్మర్షులచే నారాధింపబడిన శ్రీమన్నారాయణుడు శేషభావముతో నిగూఢుడై యున్నాడనియు, ఒకానొక సమయమున దిగ్విజయమునకై చోళభూపాలుడు బయలుదేరి ఆముదాలపల్లి గ్రామంలో మకాం చేసియుండగా వారి ఏనుగులు, యిప్పుడు శ్రీ భావనారాయణ స్వామివారు ప్రతిష్ఠింపబడియున్నచోటగల పాలచెట్టును తొండముతో చుట్టి విరచి తినుటకు ప్రయత్నించగా ఆ యేనుగుల తొండములు ఆ చెట్టుకు అంటుకొనిపోయినవి. యీ వార్త విని సత్యవ్రతుడైన శ్రీ క్రిమికంఠచోళుడు ఆ పాలచెట్టువద్దకుపోయి నీమహిమ గనుగొనుటకు నాకు సామర్థ్యములేదు. అల్పుడను నా నేరము క్షమించి తమ స్వరూప స్వభావములు దెలుప వేడుకొనుచున్నాను. తమ సాక్షాత్కారము నా శక్తికొలది తమ

సేవ చేసుకొనెదను. యీ నాగజయూథమును గాపాడి నన్ను రక్షింపుడని ప్రార్థించెను.

మ. కరినేలింది హుళక్కి ద్రౌపదికి కోకల్ మెచ్చియిచ్చింది ద
బ్బర కాకాసురునిన్ కటాక్షమున చేబట్టిందబద్ధంబహో
శరణన్నన్ బగవానిదమ్మునకు రాజ్యంబిచ్చుటల్ కల్ల యి
త్తరి నన్నేలిన నిక్కమౌ, కథలనంతా, భావనారాయణా ॥

కం॥ నారాయణుడవో శివుడవో
శారదవో లేక నాదిశక్తివో యిపుడీ
వారణకరములు వదలిన
కూరిమిగట్టింతు నొక్క కోవెలయనినన్॥

(స్థలప్రభావమునుండి)

వెంటనే స్వామి యిద్దరు బ్రాహ్మణులకు ప్రసన్నుడై "ఓ క్రిమికంఠా ఏనుగు పాదాకారములగు స్తంభములతో విరాజిల్లు నొక ఆలయమును నిర్మించి నన్నందు బ్రతిష్ఠింపుము. నా పేరుతో నొకపట్టణముగూడ నిర్మింపుము ఇంతకుపూర్వము కొండపాటూరు కాపులు కట్టెలకైవచ్చి యీ క్షీరవృక్షమును ఛేదింపబూని మూర్ఛిల్లి తన బావకొరకు రెండవవాడు నన్ను బ్రార్థింప నేను వారి ననుగ్రహించితిని. వారు ప్రతిఆదివారము క్షీరాన్నముచే నన్నారాధించుచున్నారు. (1) కాపుచే బావాయని బిలువబడి ఓ యని ప్రత్యుత్తరమిచ్చి బావనారాయణుడనైతిని. (2) విప్రుల భావరూపమున, నీకు బ్రసన్నుడనయి యిపుడు భావనారాయణుడనైతిని. (3) క్షీరవృక్షమందంతర్యామితుడనగుటచే క్షీరభావనారాయణ (4) శేషత్వమున శేషభావనారాయణ (5) ప్రస

స్వత్వమున, ప్రసన్నభావనారాయణ అను నామములు
నాకు స్థిరములు. గాన యిచట నీచే నిర్మింపబోవు పట్టణము
నకు భావపటణమని నామమిడుము. నీవు కృతార్థుడవగు
దువు. నీవారణము (ఏనుగు) లు స్వస్థపడినవి. ఆలయ
నిర్మాణ ప్రయత్నమునందుండుము. తెమ్మెర గృహము
నకుబొమ్ము" అని పలికి అంతర్థానుడయ్యెను.

చోళరాజు ఆముదాలపల్లియందు స్థిరనివాసము కల్పించు
కొని బొవ్వాడి కొండనుండి రాళ్లు దెప్పించి ఆలయనిర్మాణ
మారంభించెను. కట్టిన కట్టడము మరునాటికి కూడిపడిపోవుచుం
డెను. ఇదివిని రాజు దైవమును ప్రార్థించెను. స్వామి చక్రవర్తితో
"రాజా, వెంకటగిరి సంస్థానములో చిమ్మిరిబండ, అనే
కొండఉన్నది. దానిరాయి కృష్ణవర్ణము. దానికి చలికాల
మున వెచ్చదనము, ఎండకాలలో చల్లదనము నిచ్చుగుణము
గలదు. ఆ రాళ్లయందు "భావ" యను అక్షరములుండును.
యీ విషయము వెంకటగిరి ప్రభువుకు దెలియజేయుము. ఇది
మాయాజ్ఞ" అను మాటలు నాలకించి వెంకటగిరి రాజుగారి
అనుమతితో చిమ్మిరిబండలోని రాళ్లను తెచ్చి గజపాదాకార
స్తంభములతో ఆలయమును నిర్మించుటకు పునాదులు త్రవ్వించు
చుండ ప్రాగ్భాగమున నొకవల్మీకమగుపడి అందు జ్వాలా
నృసింహమూర్తి యుండుట గమనింపబడెను. శ్రీ స్వామివారిని
గదల్చుటకు వీలులేక వారి ఆజ్ఞమీద తూర్పువైపు తిరుచుట్టు
మాలిక వెడల్పు పెంచిపెట్టించి, ఆలయము నిర్మించుచుండిరి.
వల్మీకగ్రంథులు దొలగిననాటినుండి శ్రీవారిదృష్టికి గోచర
మగుటచే కారంచేడు గ్రామము దగ్ధముగాజొచ్చెను. అందులకై
గ్రామస్థులు దైవజ్ఞులబ్రార్థించి వారియనుమతిమీద క్రిమికంఠ

చక్రవర్తితో పైకారణములను తెలిపి, యీదోషనివారణకు శ్రీశాంత కేశవస్వామిని, శ్రీ జ్వాలా నృసింహస్వామికభిముఖముగ బ్రతిష్ఠించునట్లేర్పాట్లు గావించుకొనిరి.

యింతలో బావమరదులగు కొండపాటూరు కాపులు క్రిమికంఠ చక్రవర్తి యొద్దకేగి, రాజా కొండపాటూరులో, జొన్నలపాతరయందు అమ్మవారి విగ్రహముగుపించినది. "ఆమె శ్రీ భావనారాయణస్వామివారి దేవేరియట. పేరు రాజ్యలక్ష్మి యట. ఆలయమందు భావనారాయణునకు వాయవ్యభాగమందు తనప్రతిష్ఠ జరుగవలెనట. కొండపాటూరు ఆమెకు పుట్టినిల్లట. ఇక్కడ అత్తవారూరట గాన పుట్టినింటివారే మంగళ ద్రవ్యముల నేటేటా కళ్యాణమున సమర్పించవలెనట యిది తమకు దెలుపమన్నది అమ్మ" అనిచెప్పగా. క్రిమికంఠుడానందించి కొండపాటూరునుండి, గ్రామస్థులచే శ్రీ రాజ్యలక్ష్మి తాయారులను రావించి భావనారాయణస్వామికి వాయవ్య భాగమందుంచి గజపాదాకారస్తంభములతో ఆలయ నిర్మాణము పూర్తిగావించిరి. (తదాది నేటికిని కొండపాటూరునుండి శ్రీ స్వామి కళ్యాణమునకు మంగళద్రవ్యములు వచ్చుచుండుట సర్వజనవిదితమే )

స్వస్తిశ్రీ శాలివాహనశకము ౫౧౬ కల్యాది 3694 (క్రీ. శ. 594) ప్రమాదీచనామ సంవత్సర మీనసంక్రమణ యుక్త ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి ఆదిత్య (ఆది) వారమునాడు శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండనాయక, జగజ్జేయ, విభవ, సచ్చిదానంద, అమితామృత, అప్రమేయ, అవ్యయ, సాక్షాద్దివ్య విగ్రహ, క్షీరభూరుహసంభూత, త్రిగుణాత్మక స్వరూప, చోళ ప్రసన్న, సుందరవిమానస్థిత, దక్షిణాభిముఖ, సాగరోత్తర కుందినీ

పురవిషయే శ్రీ భావపట్ల ఆముదాలపల్లి పురనివాసులయిన శ్రీ మత్సుందర వల్లీ రాజ్యలక్ష్మి సమేత శ్రీ భావనారాయణ స్వామివారిని దిగువవిధముగాప్రతిష్ఠించిరి.

శ్లో॥ "ఈశానంరంగనాథం తదనుపురహరానంతరం నారసింహః
ఆగ్నేయ్యాంభాష్యకారో నిరృతిదిశ మహాఆంజనేయో గరుత్మాన్
ప్రత్యక్ శ్రీ కేశవాఖ్యః అనిలదిశి రమా చోత్తరా శేషభావః
మధ్యే శ్రీ భూయుక్తం సకలభయహరం భావదేవం నమామి॥

1. శ్రీరంగనాథుని శ్రీ భావదేవునకు యీశాన్య భాగంలోను (యీ రంగనాథుని ఆవరణలోనే శ్రీ భూదేవులు, జయవిజయులు, క్రిమికంఠ చోళచక్రవర్తికూడా కనిపిస్తారు)

2. శ్రీ స్వామికి తూర్పున సోమేశ్వరుడను శివుని ప్రాఙ్ముఖముగాను (యీచోట యీనాడు గోదాదేవి ఉన్నది)

3. తూర్పున శ్రీ జ్వాలానృసింహ దేవుని

4. ఆగ్నేయమున భాష్యకారులను, పశ్చిమాభిముఖులు గాను (చరిత్రనుబట్టిచూడగా భాష్యకారులు అని సింగిశాలి వాహనశకములో చెప్పబడినవారు రామానుజాచార్యులువారు మాత్రము కారు)

5. నైఋతి దిక్కున ఆంజనేయ గరుడాళ్వారులను

6. పశ్చిమమున శ్రీ జ్వాలానృసింహమూర్తికి ఎదురుగా కేశవస్వామిని ప్రాఙ్ముఖులుగాను

7. శ్రీరాజ్యలక్ష్మి అమ్మవారిని శ్రీ భావనారాయణ స్వామివారికి వాయవ్య భాగంలోను (దక్షిణాభిముఖము గాను)

8. స్వామికి ఉత్తరమున (ఉదఙ్ముఖముగా) శేషభావనారా

యణస్వామిని ప్రతిష్ఠించిరి. (ఈనాడు వీరిని ఆంజనేయస్వామి వారి దేవాలయములో వెనుకభాగమున చూడగలరు.)

ప్రతిష్ఠాకాలమున శ్రీ స్వామివారి కైంకర్యార్చనలకు విఖనససూత్రజ్ఞులును గౌతమసగోత్రోద్భవులును ఉభయ వేదాంత ప్రవర్తకులునగు చంద్రగిరి వెంకన్న అనే ఆచార్య స్వామిని నియమించి ప్రతిష్ఠ జరిగించిరి. శ్రీ స్వామివారికి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ వత్సరోత్సవ (ప్రతిష్ఠోత్సవ) బ్రహ్మోత్సవాదులకు పంచక్రోశమధ్య భూభాగమంతయు సహిరణ్యోదక దానధారాపూర్వకముగా శ్రీ భావనారాయ ణార్పణము గావించిరి.

శ్లో॥ "ద్వాత్రింశ సహస్రాణాం శతమష్టాచరా స్థిరాః
ఏతేవంశ విశాలాస్తు భావనారాయణార్పణం

అని ఈవిధముగా ప్రాక్పశ్చిమ దక్షిణోత్తరాలు సమానముగా 32800 గడలుగలిగిన ప్రదేశమును అర్పణచేసిరి.

శ్లో॥ ద్విసహస్రం పంచశతం చతుర్దిక్షు పరివృతం
పంచక్రోశమితి ఖ్యాతం భావనారాయణార్పణం

ఈ కొలత ప్రకారం 2500 కుచ్చెళ్ళుగల భూమిని స్వామివారికి అర్పించి ఈ ధర్మమును రాబోవువారు సక్రమ ముగా జరుపుటకు గాను శాసనముచేసిరి.

"ఈ దేవ బ్రాహ్మణ భూములను చాతుర్వర్ణ్యములలో ఎవ్వరేని ధర్మముతప్పి అపహరించినవారు కాశీక్షేత్రమున గంగాభవానీ గర్భమున కోటికపిలధేనువులను, కోటి విప్రోత్త ములను వధించిన పాపమునకు పోదురని, కాశీలో చెప్పియున్న

శాసనముచుబట్టి ప్రతివారును ధర్మమే ఆర్జించుట కర్తవ్యమని తెలిపిరి.

"నిత్యంసన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మసంగ్రహం
క్షణం విత్తం క్షణం చిత్తం క్షణం జీవిత మావయోః
యమస్య కరుణానాస్తి ధర్మస్యత్వరితాగతిః"

శ్లో॥ మద్వంశజాః పరమహీపతి వంశజాః
యేభూమిపాః సతతముజ్వల ధర్మచిత్తాః
మద్ధర్మ మేవపరిపాలయమాచరంతి
తత్పాదుకద్వయమహం శిరసావహామి"

అని క్రిమికంఠ చోళచక్రవర్తి ధర్మమును కాపాడ వలసినదిగా రాబోవుధర్మాత్ములకు నమస్కరించుచు పైచెప్పిన పంచ క్రోశమధ్యభూమిని భావనారాయణార్పము చేసెను. ఈ ప్రతిష్టా కాలమున శ్రీవారి క్షేత్రమునకు భావపురి అని, భావపట్ల అని నామకరణముగావించి ఆముదాలపల్లి గ్రామమును దీనిలోకలిపి ఏక గ్రామముగావించి అష్టదిక్కులయందును ఇంద్రదిక్కు మొదలు వరుసగా ఈశాన్యదిక్కువరకు గ్రామశక్తులను క్షేత్రమునకుచుట్టు ప్రతిష్టించి వారి పురము (గుడి) లను కట్టించెను అష్టదిక్శక్తుల పేర్లు 1 వళ్ళాలమ్మ, 2 కుంచలమ్మ, 3 శంకరమ్మ, 4 శింగారమ్మ, 5 ధనుకొండమ్మ 6 మూలకారమ్మ, 7 నాగభూషణమ్మ. 8 బొమ్మలమ్మ, ఆకాలమందు ఈ క్షేత్రమునకు దక్షణమునగల ప్రోవిలపట్న మందు ఒక వీరాంజనేయస్వామివారి ఆలయముకలదు. ఒక భైరవాలయము మఱొక ఆంజనేయస్వామి ఆలయ

మున్నూ పురాతనముగాయుండియుండెను. ఆముదాలపల్లి గ్రామంలో భీమేశ్వరస్వామి సోమేశ్వరస్వామిఆలయములున్నూ ఆగ్రామమునకు కుందలమ్మ అనుగ్రామశక్తి ఆలయమున్నూ కలవు. గ్రామశక్తి పేరునుబట్టి దీనికి కుందినీ పురమను నామాంతరమున్నట్లు తెలియుచున్నది. భైరవాలయమువద్ద ఒకదిగుడు బావిని, నాగస్తంభమును మంటిబ్రహ్మ గుండమును ఏర్పరిచిరి.

ఈపట్టణంలోనున్న రాతిబావులు ౭కి ప్రావిలపట్నంలో, సాళ్వపురి రామభద్రినింగారు కట్టించినది ౧. పన్నాల చంద్రగిరి వెంకన్నగారిది ౧. అన్నంరాజు పురుషోత్తంగారిది ౧, ఆముదాలపల్లిలో కంచిరాజు సుందరయ్యగారిది ౧, బాపట్లలో మజుందారు రామారాయనింగారిది ౧, చక్రవర్తిగారుకట్టించిన బావులు స్వామివారి సన్నిధిలో ౧, నాగేశ్వరస్వామిగుడి దాపున ౧. యిటికెబావులు ౩౭కి ప్రావిలపట్నంలో ౧౩, భావపట్లలో ౧౬, ఆముదాలపల్లిలో ౫, మొగపాటిలో త్రవ్వచెర్వులు౫, పంటచెర్వు ౧, వసంతోటలు 20 జయస్తంభాలు 9. విలాసాలువేసిన రాళ్లు 32. కకాళ్ళు 4, యీ ప్రకారంగా క్రిమికంఠుని ఆజ్ఞతో ప్రభరాజు శింగరెగారు, అన్నంరాజు పురుషోత్తముడుగారు, చంద్రగిరి వెంకన్నగారు, పరాక్రమం వెంకటాద్రిరెడ్డిగారు, యీ నలుగురు కొలతచేశి నిర్ణయించిన గుడికట్టడి. శ్రీక్రిమికంఠ చోళచక్రవర్తి చాలాకాలం రాజ్యం చేశారు.

తరువాత వారి వంశీయులైన, చోళభూపాలదేవుడు శాలివాహనశకం ౭౭౫, (కల్యాది 3954) క్రి. శ. 854

ప్రమాదిచ చైత్ర శు ౧౦ మంగళవారం మొదలు ప్రభుత్వం వహించి పై అగ్రహారములు శ్రీస్వామివార్లకు అర్పించారు.

ఈ సమయంలో కుండినం రాఘవరెడ్డిగారు కాలువలుత్రవ్వించి, గ్రామానకు ఉత్తరంగా పంటచెర్వు త్రవ్వించి శ్రీ స్వామికి సమర్పించారు. దీనికి బాపట్ల చెర్వుఅని ప్రతీతికలదు. యీ ప్రదేశంలో నివసించే బ్రాహ్మణులకు దేవస్థలాలకునిర్ణయంచేసిన భూస్వాస్థ్యవివరము-భీమేశ్వరస్వామి సోమేశ్వరస్వామి, యీరెండు శివాలయాలకు నిత్యనైవేద్య దీపా రాధనలకు చెర్వుకింద కుచ్చెళ్ళు 5, ఆంజనేయులువారికి పల్లం కుచ్చెళ్ళు 1,1/2 ప్రాచీనంగావున్న ప్రాపిలపట్నం వీరాంజ నేయుల వారికి పల్లంకు 1,1/2 యీ విధంగా, భట్టరుకు, అర్చకు లకు, అధ్యాపకులకు, స్వస్తివాచకులకు తోటమాలికి, భోగం వాండ్లకు. సాతానులకు బైరాగులకు, తిరుమణ్ణాలూ దేవారికిని దేవభోగంకు (నివేదన) నిత్యసేవలో, తిరుపావళికి తూమెడు, యిరసా ప్రస్తుత పరిమాణం సుమారు 40 మానికెలు బియ్యం దీపారాధనకు రెండువరహాలు రొఖం జీతాలు 1/2 వరహాలు యీప్రకారంగా నూటఎనిమిది వరహాలు శ్రోత్రియం ఏర్పరచిరి. తిరుపావళి ప్రసాదంలో భట్టరు మొదలుగాగల అందరికి ప్రసాద భాగములు నిర్ణయించి జరిగించి ప్రత్యేకముగా దివాణపు విని యోగమునకుకూడా ప్రసాద భాగము ౧౦ (పని గిన్నెలు) నిర్ణయించి కొన్ని సంవత్సరములు ధర్మపరిపాలనగావించిరి

అనంతరం శ్రీభావనారాయణ చరణ సరోరుహావిహిత విలోచన, శ్రీలోచన ప్రముఖాభీలపృధివీశ్వర, కావేరీతీర కవికాల కులాబ్ధిరత్న ప్రమత్త రాజకుమార కంఠీరవ శ్రీమ

న్మహా మండలేశ్వర, నిత్యక్రియాపుణ్య నిలయ పేరప్రతాప
శూరభళ్లయ చోళమహారాజు పట్టాభిషిక్తుడై శాలివాహనశకం
౧౦౩౨ విక్రమనామ (క్రీ. శ. 1110) సంవత్సర ఆషాఢ
శు ౧౧శనివారం కర్కాటక పుణ్యకాలమందు శ్రీమత్సుందరవల్లీ
రాజ్యలక్ష్మీసమేత (శ్రీ) భావపట్ల భావనారాయణ స్వామివారికి
అంగరంగ వైభవముతో నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ
వర్షోత్సవ తిరువావళీ మొదలైన సకలోత్సవములు జరిగించి
భావపట్లకు తూర్పున వెలిచర్ల అనేగ్రామమున్నూ ఆగ్నేయ
మున పేరలిగ్రామము, దక్షిణమునసముద్రమును నిరర్తిదిక్కున
మోటుపల్లియు పడమట లవణపురి (ఉప్పటూరు) వాయువ్య
మున పోతినేనివారిపాలెం (పోతుకట్ల) ఉత్తరం రేటూరు,
ఈశాన్యమున కొత్తివాగు దరినగల పూండ్ల, అప్పికట్లయున్నూ
పొలిమేర గుర్తులుగా ఏర్పరచి ప్రభుత్వంచేసిరి.

అనంతరం కుళోత్తంగ చోళయ దేవమహారాజులు
శాలివాహనశకం ౧౦౩౮ (క్రీ. శ. 1116) లగాయతు ప్రభుత్వం
చేసేకాలమందు గజపతి సింహాసనా ధీశుడగు, గణపతి
మహారాజుగారు యీరాజ్యం ఆక్రమించిరి. ఆకాలమందు
వీరి ప్రధానులైన గోపరాజు రామన్నగారు శా. శ. ౧౦౫౮
(క్రీ శ. 1136) రక్తాక్షి భాద్రపద బ. అమావాశ్య మంగళవారం
సూర్యగ్రహణ కాలమందు, ప్రభువు దగ్గరదానంపట్టి సమస్త
మైన, నియోగులకు గ్రామమిరాశిసనదులు వ్రాయించి
యిచ్చెను. అప్పుడు యీ బాపట్లగ్రామం బాపట్లవారు
శిఖరంవారు దేశిరాజువారు ఆముదాలపల్లివారు స్థానంవారు
శూద్రిలు శిఖరంవారు మొత్తం నియోగిసంతతి వారు
4 గురు ఆంధ్రశాఖసంతతి ౧. శూద్రిలు ౧. వెరశి

ఆరు సంతతులవారికి మిరాశీలు ఏర్పాటుచేసిరి. తరువాత వీరి సంతతి వారగు కుమార కాకతీయ్య రుద్రదేవ మహారాజులుంగారి ప్రభుత్వం శా. శ. ౧౨౪౦ (క్రీ. శ 1319) వరకు జరిగినది. తరువాత రెడ్లు బలవంతులై గజపతివారిని జయించి దేశమాక్రమించి శా॥ శ॥ ౧౩౪౦ (క్రీ. శ. 1419) వరకు సహోదర పరం పరంగా ఆరుగురు రెడ్లు ప్రభుత్వంచేసి శ్రీస్వామి వారికి పూర్వోత్తరమైనవసతులన్నియు జరిపించినారు.

తరువాత గజపతి సింహాసనస్థుడైన లాంగూల గజపతి కటకం మొదలు ఉదయగిరి దుర్గంవరకు ఆక్రమించి అత్యంత శూరుడై ప్రభుత్వంచేసెను. ఇతని కుమారుడు కపిలేశ్వర గజపతి, పురుషోత్తమ గజపతి, ప్రతాప రుద్రగజపతి, అధికారం చేసిన తర్వాత, తత్పుత్రులైన వీరభద్రగజపతిగారు ప్రభుత్వం చేసేసమయంలో, నరపతి సింహాసనస్థుడైన కృష్ణదేవరాయలు విజయనగరంనుంచి తూర్పు దేశానికి దిగ్విజయార్థం వెడలి వీరభద్ర గజపతినిజయించి కొండవీటి దుర్గం శా. శ. ౧౪౩౮ క్రీ. శ. 1516 న ఆక్రమించి నాటినుంచి శాలి శ. ౧౪౫౫ (1533) వరకు 18 వత్సరములు పాలించెను.

తరువాత అచ్యుతరాయలు, సదాశివరాయలు రామరాయలు, తిరుమలరాయలు, శ్రీరంగరాయలు మొదలగు కర్నాటక రాజులు శా. శ. ౧౫౦౦ (క్రీ. శ. 1579) వరకు పాలించిరి. తరువాత తురుష్కులు దేశము లాక్రమించగా, మలిక్‌ఇభురాహాం సుల్తాను అబ్దుల్లా తానీషా అబ్దుల్‌హసన్ బహాదుర్ గారి పాలనలో, తిమ్మభూపాలపురానికి నిజాంపట్నం, అని పేరుపెట్టి బాపట్లను నిజాంపట్నం సర్కారులోకలిపి,

దేశముఖ, దేశపాండ్యా మొదలగు బారాముసద్దీలను అధి కారులను నియమించి, వెనుకటి రాజులిచ్చిన భూములను ప్రభుత్వంక్రిందకు తీసుకొని నిత్యనైవేద్య దీపారాధనములు జరుగగలందులకు దేవస్థానములకు బహుకొద్ది భూవసతి మిగిల్చిరి. తరువాత నిజాములుముల్కు వారి అధికారంలో అబ్దుల్లాఖాను, మక్తుంజంగు, కుంతిదురుఖాను, మొదలుగా ఆరుగురు నిజాంపట్నం సర్కారుకు అధికారులై, ప్రభుత్వం సాగించారు. తరువాత బహదూర్ సుభాగారి ముల్కు పెద్ద కుమారుడు నాసరుజంగు ప్రభుత్వంవహించి, యీ సర్కార్లు ఫ్రెంచివారికి విక్రయించారు. తరువాత ౧౧౬౦ ఫసలీలగాయతు ౧౧౬౭ ఫసలీ క్రీ,శ. 1751, 53 వరకు పరాసువారు యీసర్కార్ల మీాద అధికారంవహించి దేవబ్రాహ్మణ వృత్తులలో తురుష్కులు కాజేసిందిపోగా మిగిలినకొంచెంకూడా కాజేసి ఆలయాలు పాడుచేసి దుర్మార్గంగా ప్రభుత్వంచేసారు.

ఫ్రెంచివారు ప్రభుత్వంచేసిన ఏడు సంవత్సరాలలో ఆఖరు సంవత్సరమగు క్రీ. శ, 1758 లో వీరిదృష్టి శ్రీభావ నారాయణస్వామివారి ఆలయముపైనను భావపట్టణముపైననూ బడినది. అపుడు వారు దేవాలయములను, సౌధములను పాడు చేయుచూ శ్రీవారి క్షేత్రములో నుండబడిన యితర దేవాలయ ములను అష్టదిక్కర్తుల దేవాలయములను శిథిలములుగావించిరి. అటనుండి శ్రీ భావనారాయణస్వామివారి అలయమునకువచ్చి అచ్చటనున్న శేషభావనారాయణ స్వామినితాకిరి. వెంటనే ఆ విగ్రహము భిన్నమైపోయినది. అటనుండి వారికి దేవాలయ ములోనున్న స్వాములెవరూ కన్పించరైరి. అట్టివారి దురాగత

చర్యలకు వైకుంఠవాసుండును అఖిలాంతర్యామియు, నిర్వికార, నిరంజన, నిరాఖ్యాత అచింత్యాద్భుత దివ్యతేజోస్వరూపుడైన శ్రీ మన్నారాయణుండు తనకై వెనుకవచ్చిన హిరణ్యకశ్యపు నకు వైకుంఠమునందేయుండి కానబడనట్లు క్షీరభూజోద్భవుం డైన శ్రీ భావనారాయణస్వామివారు తనచుట్టూ ప్రతిష్టించి యున్న వారితో సహా ధ్వంసము చేయవచ్చిన పఠాసులకు కాన బడక ఆలయమందే అదృశ్యులై యుండిరి. దుండగులు ఆలయము నందు స్వామివిగ్రానక ఆలయమునే భిన్నము చేసి పోదమనితలచి ఆలయ కుడ్యములను భేదింపబూనుకొని శక్యముగాక వికలాంగులై తిరోగతులయిరి. యిట్లుజరిగిన సంవత్సరముకాలము శ్రీ వారికి పూజానమస్కారములు జరుగలేదు. ఆ సంవత్సర కాలము రాత్రి వేళయందు ఋషులువచ్చి స్వామివారిని అర్చించి వెళ్ళుచుండెడివారని ప్రతీతికలదు. ఆ సంవత్సర కాలము మాత్రము ఈ పట్టణవాసులకు శ్రీవారి దర్శనభాగ్యము కరువయినది.

అనంతరం ఈ పట్టణము శా 1860. (క్రీ. శ. 1759) న కుంభినీవారి పాలనలోనికి వచ్చినది. ఆకాలమున వారి దివాన్‌జీ అయిన రాజా కొండ్రెగుల జోగిజగన్నాధరావు బహదుర్ (రాజమహేంద్రి) గారు వారిపర్యటనలో దేవేంద్ర పట్టణతుల్యమైన ఈ పట్టణ నిర్మాణమునుచూచి అందందు శ్రీ వారి ఆలయమునుచూచి విస్మయమంది దుర్మార్గుల దుశ్చేష్టలకు విచారించి దుఃఖించెను. తరువాత భక్తుండును కార్యదీక్షాపరుడును ధర్మాత్ముడును, హైందవకుల సంజాతుం డును విప్రకుల తిలకుండును అగు జగన్నాధరావు బహదుర్



♦ శ్రీ రాజా. కాండ్రేగుల జోగిపంతులూ

వరఫ్ శ్రీనివాస జగన్నాధరావు బహాదుర్‌గారు

దివాన్ జీ:- (ఉత్తర సర్కారులు) రాజమహేంద్రవరము

శ్రీ బాపట్ల భావనారాయణస్వామివారి దేవాలయ

పునరుద్ధారకులు:

శ్రీ సోమేశ్వరస్వామివారి ఆలయ నిర్మాతలు

పునః ప్రతిష్ఠాపకులు :

---

♦(ఆంధ్ర హిస్టారికల్ రిసర్చి సొసైటి వారి సౌజన్యంతో త్రైమాసిక పత్రికనుండి సేకరించబడినది.)

గారు స్వామివారి అనుజ్ఞపై దైవజ్ఞులరావించి శ్రీవారి కైంకర్యార్చనలకుగాను గౌతమస గోత్రోద్భవులైన శ్రీ నల్లూరి నరసింహాచార్యులగారిని, భార్గవసగోత్రోద్భవులైన శ్రీ శ్రీనివాసుల భావనాచార్యులగార్లను ప్రార్థించి వైఖానసాగమరీతినే పునః ప్రతిష్టాదికములు గావించి శ్రీ భావనారాయణస్వామివారికిని, ఆలయమందున్న సోమేశ్వరస్వామివారికిని, తక్కినవారికిని నిత్య నైవేద్య దీపారాధనలు జరుగునట్లుచేసిరి.

చోళరాజులచే ఏర్పాటుచేయబడిన అష్టశక్తుల దేవాలయములు పరాసులవారిచే పాడుచేయబడిన తర్వాత గ్రామస్థులు పోలేరమ్మవారు అను గ్రామశక్తిని ఈ గ్రామమునకు పడమట దిక్కున ప్రాఙ్ముఖముగా ప్రతిష్ఠించిరి.

ఆ కాలముననే శ్రీ జోగిజగన్నాధరావు బహదూర్ గారు శ్రీ వారి దేవాలయంలోనున్న శ్రీ సోమేశ్వరస్వామివారికి కూడా ప్రత్యేక ఆలయం ఏర్పరిచి అందు ప్రతిష్టింపతలచి 40 రోజులు దీక్షతో శ్రీ వారి క్షేత్రమున తపస్సుచేసి స్వామివారి ఆజ్ఞపై శ్రీ సోమేశ్వరస్వామిని శ్రీ భావనారాయణస్వామివారికి వామభాగంలో కట్టబడిన నూతన దేవాలయమునందు ప్రాఙ్ముఖముగా ప్రతిష్టించి రెండు దేవాలయములలోను నిత్యనైవేద్య దీపారాధనలు సక్రమముగా జరుగునట్లు స్వాస్థ్యములు ఏర్పరిచి కృతార్థులయిరి. శ్రీ సోమేశ్వరస్వామివారికి కైంకర్యార్చనలు జరుపుటకుగాను బ్రహ్మమూర్తులయిన స్వర్ణ బ్రహ్మన్న అనే శివద్విజుల్ని రావించి వారి నేర్పాటుచేసిరి. వంశపరంపరాపై వారలే స్వామివార్ల కైంకర్యములు చేయవలసినదిగా కోరబడి నేటికిని వారి వంశీకులే శ్రీవార్ల అర్చనాదులను శాస్త్రోక్త

ముగా జరుపుచున్నారు. ఈ విధంగా ౧౨౧౨వ ఫసలీ (క్రీ. శ. 1803) వరకు ఈస్టిండియాకంపెనీ వారిక్రింద దివానుగా నుండి దేవబ్రాహ్మణ భూస్వాస్థ్యములను ధర్మయుతముగా పాలించి చరితార్థులైరి

అటుపిమ్మట ౧౨౧౨ వ ఫసలీలో (క్రీ. శ. 1803) ప్రభుత్వంవారు ఈ సర్కారులను వేలంవేయగా రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడు మన్నెసుల్తానుదొరగారుకొనిరి. రాజావారు అమరావతిని రాజధానిగాచేసికొని ౧౨౨౧వ ఫసలీవరకు (క్రీ.శ. 1811) రాజ్యపాలన గావించిరి. వారిపాలనలోగల భావపట్టణమును పరిశీలించినసమయములో శ్రీ భావనారాయణస్వామిని దర్శించి క్షేత్రమహాత్మ్యమును తెలిసికొని శ్రీవారికి వైఖానస ఆగమ రీత్యా జీవ, కీర్తి ధ్వజముల నెలకొల్పి కీర్తిధ్వజమునకు బంగారు మలామాచేసిన తొడుగు వేయించి నిత్యోత్సవాది సమస్తోత్సవములు పూర్వపువారికన్న వైభవముగా జరిపించిరి. వీరికాలములోనే శ్రీవారి అర్చకస్వాములును భిషగ్వరులును కవివరులును గౌతమసగోత్రవిరాజితులును అగు శ్రీమద్వైదమార్గ ప్రతిష్ఠాపనాచార్యాభిధేయ వేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ నల్లూరి వెంకట్రాయాచార్యులువారు మన్నెసుల్తానువారి ఆస్థానము నందు పండిత, భిషగ్వరులుగా రాజావారి గౌరవపాత్రులయిరి.

అనంతరం వాసిరెడ్డివారు ఈ దేవాలయ పాలకత్వము విరమించుకొనగా దేవాలయం సక్రమముగా నడుపుటకు అర్చకుల స్వాధీనమయ్యెను. అప్పటినుండి అర్చకులే భక్తుల ప్రోత్సాహంచుచు సకలోత్సవములను జరిపించిరి. ఆకాలముననే గోదాదేవిని (పూర్వము సోమేశ్వరస్వామి ఉన్నచోటున) శ్రీ సీతాలక్ష్మణ

సమేత కోదండరామస్వామివార్లను ప్రతిష్ఠగావించిరి. అందు
వలన తదాది నేటివరకును (శ్రీ) వారి అర్చకస్వాములే (శ్రీ)
కోదండరామస్వామివారికి ప్రతి చైత్ర శు. నవమికి వారి
ఖర్చుతో కళ్యాణోత్సవములు జరిపించు చున్నారు.

తదుపరి కొంతకాలమునకు (1850) లో యడవల్లి
వెంకయ్యగారు ఈ తాలూకాకు శిరస్తామేజస్ట్రేటుగావచ్చిరి.
వారు ఆలయమును అందలి దివ్యమంగళవిగ్రహములను చూచి
అప్పటిస్థితిగతులను గ్రామస్తులవలన విచారించి చింతించి గాలి
గోపురమును సత్రమును, ఒక పూలతోటను ఏర్పరిచిరి. వారి
శక్తికిలోపములేకుండా (శ్రీ)వారి ఉత్సవాది సమస్తకైంకర్యము
లలో తోడ్పడుచు సేవచేసి కృతార్థులయిరి. వారి అనంతరం
ఈ దివ్యదేశము స్థిరస్వాస్థ్యములు లేనందున క్షీణించిఅర్చకుల
స్వాధీనమందేయుండి జరుగుచూవచ్చెను. తరువాత కొంత
కాలమునకు వింజమూరి వెంకటరావు పంతులుగారు (1865
సంవత్సరము) ఈతాలూకాకు తహసీలుదారుగారైరి. వారు
ఈదేవస్థానపు స్థితిని చక్కగా పరిశీలించి విశిష్టాద్వైత పరులగు
టచే పరిస్థితులు (శ్రీ)వారి భక్తులకు చెప్పి చక్కబరచ నెంచి
దేవాలయము చుట్టు ప్రాకారము కట్టించి వాహన శాలను,
ఏర్పరచి, ధ్వజస్తంభాదులను బాగుచేయించి తిరిగి దివ్య
దేశమును చక్కదిద్దించి సకలోత్సవములను చక్కగాజరిపిరి.
వారి తదుపరి ఈ గ్రామ కరణములు పెద్దలునగు శిఖరంవారు
బాపట్లవారు, దేశిరాజువారు స్థానంవారు ఆముదాలపల్లివారు
మొదలయినవారి పర్యవేక్షణలక్రింద దివ్యదేశము మొదలయిన
పూజాదివిశేషోత్సవాదులు అన్నియును జరుగుచూవచ్చెను ఈదివ్య

దేశ కట్టడికై ఒకభక్తురాలైన వక్కభట్ల తాయమ్మ అనునామె అత్యంతభక్తితో ఆలపాడు గ్రామంలో 12 ఎకరముల వల్లప భూమిని (శ్రీ) భావనారాయణార్పణము గావించిరి. యిప్పటికి దివ్యదేశము ఆభూమినుండివచ్చుఆదాయముపై జరుగుచున్నది.

ఈ దేవాలయము పురావస్తు పరిశోధన శాఖవారిచే గుర్తించబడి నేటివరకు వారి రక్షణక్రిందయున్నది.

వాసిరెడ్డివారి కాలంలో వేయబడిన కీర్తిధ్వజమునకు జీర్ణావస్థకలిగినందున స్వస్తి(శ్రీ) శా. శ ౧౮౧౩ (క్రీ. శ. 1891) సరియగు మన్మథనామ సం.ర వైశాఖ శుద్ధ పంచమి యిందువాసరమున (శ్రీ) శిఖరం వెంకటగురవయ్యగారు మరి యొక నూతన (కీర్తి) ధ్వజమును పునఃప్రతిష్ఠించినారు. ఈ ధ్వజమునకు క్రింద ఒక గరుడవిగ్రహము ప్రక్కన పశ్చిమముగా వీరాంజనేయస్వామియును, తూర్పున పాలరాతి నాగస్తంభమును జీవ, కీర్తిధ్వజముల మధ్య ఒక పాలరాతి స్థాపమున్ను కలవు.

1920 సంవత్సరములో ఈ దేవస్థానము జీర్ణోద్ధారణలో ప్రక్కముకాబడినది. అప్పటినుండి దేశరాజు రంగారావుగారు, స్థానం భావనారాయణగారు, బొసట్ల వెంకట చలపతిరావుగార్లు అనువారలు ధర్మకర్తలుగానుండినేటివరకు వారు, వారివంశీకులు ధర్మకర్తృత్వాధికారం సేవ మర్యాదలను పొందుచూ (శ్రీ)వారి అనుగ్రహపాత్రులై కైంకర్యములన్నియు చక్కగాజరుగునట్లు చూచుచున్నారు.

వీరికాలముననే దేవాలయమునకు ఆదాయము పెంపు గావించి భక్తులవలన చందాలు వసూలుచేసి రెండు గదులను

పాతవాహన శాలను ఆదాయము వచ్చురీతి కొట్లుగా నిర్మించి వాహనములకు రంగులు వేయించి క్రొత్తవాహనశాల నేర్పరచి విశేష వైభవమును చేకూర్చిరి. 

మొదటినుండియు ఈ దేవాలయోధ్వర్యము గౌతమ గోత్రీకులయిన నల్లూరి కుటుంబమువారును, సమర్పణ (అలంకారము) భార్గవ గోత్రీకులయిన శ్రీనివాసుల కుటుంబ వారును వంశానుగత మర్యాదల ననుసరించి జరుపుచున్నారు.

దేవాలయ యాజమాన్య దీక్షాదులు మొదటనుండియు ధర్మకర్త వంశీకులైన బాపట్లవారును, తరువాత శిఖరంవారును, వారి తరువాత దేశరాజువారును వారి తరువాత స్థానంవారును వారివారి అసందర్భములనుబట్టి వరుసగా వహించుట ఆచారమై యున్నది. 

ఈ దేవాలయము అర్చకుల స్వాధీనమునందున్న సమయముననే సకలోత్సవములు భక్తుల ప్రోత్సహించి జరిపించుచు శ్రీ స్వామివార్ల అలంకారాదులకు అత్యావసరములగు కిరీటాద్యాభరణములను సమకూర్చిరి. 

క్రీ.శ. 1904 సం.లో పండితులైన భిషగ్వరులైన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులుగారు శ్రీ బాపట్ల భావనారాయణ స్వామివారి స్థలప్రభావము, అర్చావతార ప్రభావము, ఎదుర కోలరాయబారము, తిరుమంగయాళ్వారు చరితము, శ్రీ హరి నామ సంకీర్తనలు, అను పంచకుసుమముల రచించి శ్రీ భావనారాయణస్వామివారి కంకిత మొనరించిరి.

శ్రీవారి భక్తులగు ముప్పా శేషయ్యగారి కుమార్డు సోమయ్యఅనువారు శ్రీవారిని రథారోహణచేయుటకు

ఉపయోగపడునట్లుగా సోపానసహితమైన మంటపమొకటి కట్టించి కృతార్థులయిరి.

ఆలయమునకు తూర్పు భాగములో ఒక పాకశాలను జిల్లెళ్ళమూడి అగ్రహార కాపురస్థులు కర్ణా పున్నయ్యగారు అను భక్తులు కట్టించిరి.

శ్రీ వారి ఆలయములో చోళరాజు నిర్మించిన రాతి భావి ఈశాన్యభాగమందు గలదు. క్రీ. శ. 3-10-1920 న తహాశీలుదారుగారైన సాగరపాల నసుకోజిగారి భార్య సోనా బాయమ్మగారు అత్యంత భక్తితో ఆలయమునందు పడమట దిక్కున ఒక ఇటుక రాతిభావిని కట్టించి కృపాపాత్రులైరి.

కంకటపాలెం గ్రామకాపురస్థులు సమిశిపాళ్ల గోత్రవిరాజితులగు గొట్టిముక్కల వెంకయ్యగారి పౌత్రుండును వెంకమాంబ, కోటయ్యగార్ల పుత్రుండును శ్రీ భావనారాయణస్వామివారి చరణ సరోజ భక్తుండును అగు అప్పన్న చౌదరిగారు శ్రీవారి జీవ (పెద్ద) ధ్వజమునకు స్వస్తిశ్రీ దుందుభినామ సం. మార్గశిర బ దశమి సౌమ్యవాసరము నాడు సరియగు క్రీ. శ. 13-12-1922 న రాగి రేకుగు వేయించి చరితార్థులయిరి.

తరువాత శ్రీవారి భక్తులు దానశీలురును అగు బొలిశెట్టి ఆదినారాయణగుప్తగారు స్వామివారి ముఖమండపమునకు రెండువైపుల నాల్గు గదుల నల్లరాతి మంటపమును, పశ్చిమదిశయందు మఱియొక పాకశాలను, రధశాలకు సున్నపుపూతను చేయించి కృతార్థులయిరి.

పిదప శ్రీ సోమేశ్వరస్వామివారి ఆలయములో కళ్యాణ మంటపమునుకూడ నిర్మించిరి.

1937 సం. లో గ్రామకరణములును పెద్దలునగు శ్రీ శిఖరం వెంకట చలపతిరావుగారును, అర్చక స్వాములలో ఒకరైన నల్లూరి వెంకట రంగాచార్యులుగారును ధర్మకర్తలు కలసి చందాలు వసూలుచేసి గాలిగోపురమునకు నున్న పురాతను బొమ్మకట్టునుచేయించి జీర్ణమైన శిఖరములను తిరిగి నూతనముగావించి ప్రతిష్టించిరి.

ఈ సమయములో శ్రీ వారి భక్తులును విశిష్టాద్వైత సంప్రదాయ పరులునగు చీదెళ్ళరఘునాధం శ్రేష్టిగారు స్వామి వారికి పెద్దగంటను గోపురములో అమర్చుటకు వీలుగా చేయించి అత్యంతభక్తితో సమర్పించిరి.

1940 సంవత్సరంలో ధర్మకర్తలకు అర్చకులకు గలిగిన బేదాభిప్రాయ కారణంగా కొంతకాలము అనాదిగానున్న వైఖానసాగమమును మార్చిరి. అప్పుడు ఈగ్రామస్థులు తీవ్ర నిరోధమువలన ఈ కార్యము అన్యాయమని, ఆనాడే హిందూ దేవాదాయ ధర్మాదాయ బోర్డు కమీషనరుగారికి రిపోర్టు చేయగా అప్పుడు కమీషనరువారు అనాదిగానుండు ఆగమము మార్పుచేయుట పనికిరాదని తిరిగి వైఖానసాగమ రీతినే పూజా విధానములు జరిపించవలసినదని ఉత్తరువులు చేసియుండిరి. ఆ ఉత్తర్వుల ననుసరించి దేవాలయాధికారులచే పూజా విధానములు పూర్వస్థితికి తేబడినవి.

తదనంతరం 1942 స్కీములో తిరిగి కొన్నిమార్పు లతో కాబడెను ఆమార్పు కారణముగా మరి యిద్దరుతాత్కా

లిక ధర్మకర్తలను యర్లికోర్టు ఆఫీసరుగారిని కలుపుకొని వంశపరంపరా ధర్మకర్తలు పరిపాలన చేయుచుండిరి. తర్వాత ధర్మకర్తలచే స్వామివారికిప్పున్న స్వరూపము (బొట్టు) నుగురించి దావా వేయబడి హైకోర్టునందు శ్రీవారి దేవస్థానములో స్వామివార్లకు ఫాల భాగమున తిలకలములు మాత్రము ఉంచవలసినదిగా తీర్పుకాబడినది. ఆ తీర్పు ననుసరించియే శ్రీ వారి తిరుముఖ మండలమున తిలకముండియుండుట భక్తులందరు చూచుచున్న విషయమే.

అర్చక స్వాములును నల్లూరి నరసింహాచార్యులగారి కుమారులును వైద్యులునగు నల్లూరు వెంకట రంగాచార్యులు గారు శ్రీవారి ఉత్సవ మూర్తికి రజితకవచమునుచేయించి ధన్యులయిరి. వైద్యనాథులును, కవీశ్వరులును స్థలపురాణాది గ్రంధకర్తలునగు శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులగారి కుమారులు వెంకటాద్రియాచార్యులవారు వారి ధర్మపత్ని రాఘవమ్మగారి జ్ఞాపకార్థము శ్రీ కోదండరామస్వామి వారికి రజిత కిరీటము (రాజముడి) శ్రీ జ్వాలానరసింహా స్వామి వారికి రజిత అభయ హస్తమునుచేయించి సమర్పించి ధన్యతజెందిరి. వీరికుమారులగు నల్లూరి వెంకటరంగాచార్యులు వీరి ధర్మపత్ని వెంకట లక్ష్మమ్మగారలు శ్రీ జ్వాలా నరసింహస్వామి వారికి రాళ్ళతో కూర్చిన తిలకము (బొట్టును) సమర్పించిరి. వీరును తక్కిన అర్చక స్వాములైన నారాయణం రంగా చార్యులుగారును, బృందావనం పార్థసారథి ఆచార్యులుగారును శ్రీనివాసుల సత్యనారాయణా చార్యులుగారును, శ్రీనివాసుల రామాచార్యులుగారును. వినుకొండ నరసింహాచార్యులు

గారును, ధర్మకర్తలయిన బాపట్ల వెంకట చలపతిరావుగారును దేశరాజు రామచంద్రరావుగారును స్థానం నరసింహారావు గారును తాత్కాలిక ధర్మకర్తలుగానున్న యడవల్లి సూర్య నారాయణరావుగారును భృగుమళ్ళ సత్యనారాయణగారును, ఎడ్యుకేషన్ ఆఫీసర్లనుకలసి గ్రామస్తులను ప్రోత్సహించి ఆలయ మందు విద్యుద్దీపములను స్వామివారికి విశేషాభరణములను వాహనములను రజితకవచాదులును ఏర్పడునట్లుచేసిరి.

వల్లూరి గ్రామ కాపురస్తులు చీదెళ్ల వెంకటప్పయ్య, శాంతమ్మగార్ల కుమార్తె వెంకటరత్నం శ్రేష్టిగారు శ్రీ సీతా లక్ష్మణ సమేత కోదండరామస్వామివారి ధృవమూర్తులకు వెండి తిరువాభరణమును శఠారిని చేయించి సమర్పించిరి. నోరి విశ్వనాథం అనువారు ఈ స్వామికి యిత్తడి మకరతోరణ మును చేయించి సమర్పించిరి.

శ్రీ జ్వాలా నరసింహస్వామివారికి వెండి శఠారిని స్థానం సుబ్బారావుగారి భార్య పున్నమ్మగారుసమర్పించిరి.

రాములవారి ఉత్సవమూర్తికి కోట పిచ్చమ్మ (శబరి) అను భక్తురాలు వెండి సర్వాంగమును సమర్పించినది

శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారికి అభయవరద హస్తము లను పంటూరి వియన్నగారిభార్య శేషమ్మగారును, కమల హస్తములు కోటంరాజు అన్నపూర్ణమ్మగారి దౌహిత్రకుమారుడు వెంకటకృష్ణమూర్తిగారును, బంగారు బులాకిని నారాయణం రంగాచార్యులుగారును, నత్తు, ముక్కుపుడకలను, బూర్లె శేషార్తమ్మగారును, వారికుమార్తె సీతారామమ్మగారలును, రాళ్ళబొట్టును శ్రీవారి ఆలయమును శుభ్రపరచుదాసిఅయిన

నంగు సుబ్బలక్ష్మి అను నామెయు, కిరీటమును, బూర్లె లక్ష్మయ్య గారు వారి భార్య సుబ్బమ్మగారు అనువారలును, మాంగల్య ములు వెండి కర్ణపత్రములు, మకర తోరణమును, బూర్లె నాగయ్యగారి కుమార్తె వెంకటనర్సుగారు వారిభార్య సుబ్బమ్మ గారు అను వారలు అత్యంతభక్తితో సమర్పించి కృతార్థులయిరి.

శ్రీ భావనారాయణస్వామి వారి ధృవమూర్తికి దేశరాజు బాపారావుగారు యిత్తడి మకరతోరణమును చేయించి సమర్పించిరి. తరువాత వెండిపాదములను మల్లాది వెంకటరామ దీక్షితులుగారును, పీతాంబరమును గంగరాజు వెంకటసుబ్బా రావుగారిభార్య విజయలక్ష్మి భారతమ్మగారును, అభయహస్త కటిహస్తములను దేశరాజు రాజ్యలక్ష్మమ్మగారును, వక్షస్థ లము, శంఖచక్రములు. కర్ణపత్రములను గుంటూరు వాస్త వ్యులయిన చింతలపూడి వెంకటసుబ్బయ్యగారు వారిభార్య సామ్రాజ్యమ్మ అనువారలు, కిరీటమును మామిళ్లపల్లి చలపతి రావుగారును, మకరతోరణమును పులిగడ్డ వెంకటప్పారావు గారిభార్య బాలాత్రిపుర సుందరమ్మగారును, ఛత్రమును బొలిశెట్టి సీతారామయ్యగారును అత్యంతభక్తితో సమర్పించిరి.

ధర్మకర్తలు స్వామివారి ద్రవ్యమునుండి శ్రీ భావనారా యణస్వామివారి ధృవులకు రాళ్ళుకూడిన బంగారు తిలకము (బొట్టును) రాజ్యలక్ష్మితాయారు ఉత్సవమూర్తికి వెండికిరీట మును, శ్రీ భూదేవి ఉత్సవమూర్తులకు రెండు కొండికిరీటము లను, ఉడయర్ల ఉత్సవమూర్తికి ఒకకిరీటమును పెద్దశఠారిని ఇంకా అవసరమగు ఇత్తడి వస్తువులనుచేయించి సమర్పించిరి. మామిళ్లపల్లి నాగేశ్వరరావుగారు ఉత్సవమూర్తికి వెండిరాజ

ముడికిరీటమును, దేశరాజు వెంకటచలపతిరావుగారి భార్య వరలక్ష్మమ్మగారు స్వామికి వెండిబిందెను, చెంబును సమర్పించిరి, బూర్లె రత్తయ్యశ్రేష్టిగారు పెద్దవెండితీర్థ పాత్రను, ఉద్ధరిణెను సమర్పించిరి. యిట్లు యింకా అనేకమంది భక్తులు అజ్ఞాతముగా అనేక వస్తువులను శ్రీవారికి సమర్పించి కృతార్థులయిరి. అనేకమంది భక్తులు పాత్రలను, విలాసాలు వేసిన నాపరాళ్లను దేవాలయమందు వేయించి కృతార్థులయిరి.

శ్రీరంగము, తిరుమల, కంచి, శ్రీ కూర్మము, సింహాచలము మొదలయిన దివ్యక్షేత్రములలో వలెనే స్వయం వ్యక్తస్థలమైన ఈ భావననారాయణ క్షేత్రమునకుకూడా త్రిమతపీఠస్థులువచ్చి శ్రీ స్వామినివారిని, ఆలయమర్యాదలతో సేవించి వారివారి మతసాంప్రదాయములనుగూర్చి భగవత్కల్యాణ గుణగణాదులనుగూర్చియు ఈ క్షేత్రమందలి ప్రజలకు మహోపన్యాసము లొసంగికృతార్థుల గావించియుండిరి, నేటికిని అట్టి ప్రవచనములు పండితులవల్ల జరుగుచునేయున్నవి. ఇవిగాక ప్రత్యేకముగా హరికథలు, పురాణములు అనేకములు ఎల్లప్పుడు జరుగుచుండును. ప్రఖ్యాత హరికథకులయిన ఆదిభొట్ల నారాయణదాసుగారుకూడా శ్రీ వారి సన్నిధిని రామాయణ కథాకాలక్షేపముచేసి కృతార్థులయిరి. ప్రముఖ వయొలిన్ విద్వాంసులైన ద్వారం వెంకటస్వామినాయుడుగారుకూడా ఈ సన్నిధిని తమవిద్యా ప్రదర్శనమును గావించిరి.

దివ్యదేశముతిరిగి చక్కపరచినతర్వాత, తళిహాస్వామిగను, అధ్యాపక స్వామిగను శ్రీమాన్ కిడాంబి వెంకటాచార్యులగారువచ్చిరి. తర్వాత వారి మేనల్లుడు గోమఠం

వరదాచార్యులు గారును వారి తర్వాత రాఘవాచార్యులగారి కుమారులయిన శ్రీనివాసాచార్యులగారు వచ్చిరి. ఆ కాలము నుంచి శ్రీవారి సన్నిధిని అర్చకులు పండితులుఅగు శ్రీమాన్ నల్లూరి నృసింహాచార్యులువారున్నూ వారితరువాత వారి తమ్ములు కవులు భక్తాగ్రేసరులు ఉభయవేదాంత ప్రవర్తకులును, స్తల ప్రభావాది గ్రంథకర్తలును అయిన శ్రీమాన్ నల్లూరి రంగాచార్యులగారును పురాణ కాలక్షేపము చేసిరి. వారి తరువాత బ్రహ్మశ్రీ ఓగిరాల వెంకటేశ్వర శాస్త్రిగారును, తరువాత అద్వైత వేదాంత శిరోమణులును, బ్రహ్మశ్రీ వేద మూర్తులయిన ఇనపకుతిక శంకరశాస్త్రిగారున్నూ పౌరాణికులుగా కాలక్షేపముచేసియుండిరి. వీరితర్వాత అధ్యాపకులుగను పౌరాణికులుగను విశిష్టాద్వైత మతసంప్రదాయులగు శ్రీమాన్ కొమాండూరి యిడయవల్లి శ్రీనివాస రామానుజాచార్యులు గారు నియమితులై కాలక్షేపములుజరిపిరి. వీరువిరమించుకొన్న తర్వాత దేవాలయాధికారులచే నియమింపబడినవారు అధ్యాపకాది కైంకర్యములు జరుపుచున్నారు. ఈనాడు తళిహాస్వామిగా శ్రీమాన్ కిడాంబి శ్రీనివాసాచార్యులుగారును అధ్యాపకులుగా శ్రీమాన్ ఉత్పల వెంకటప్పలాచార్యులుగారును స్వామివారి కైంకర్యములు జరుపుచున్నారు. స్వస్తికిగాను బ్రహ్మశ్రీ పిశుపాటి త్రియంబకావధానులుగారు నియమింపబడిరి. తర్వాత సూర్యనారాయణావధానులుగారు వేదాధ్యాయన కైంకర్యమును చేయుచున్నారు. పురాణ కాలక్షేపములు ఎందరెందరో పండితవరులు కాలపరిమితముగా చెప్పుకొనుచు భక్తులెల్లరును కానుకలతో తృప్తిచెందుచు జరుపుచున్నారు.

శ్రీవారి దేవాలయములో ప్రతిసంవత్సరము 4 కళ్యాణోత్సవములు 5 గరుడోత్సవములు. యింకా అనేక విశేషోత్సవములు జరుగును. ఈ ఉత్సవములన్నియు భక్తులచే యొసగబడిన స్థిరస్వాస్థ్యములనుండియు ఉభయములనుండియు శ్రీవారి ద్రవ్యమునుండియు జరుగుచున్నవి,

ఉగాది పండుగ ఉత్సవమునకును, కృత్తిక దీపోత్సవమునకునుగారు భృగుబండ వెంకటకృష్ణయ్యగారు కొంతస్వాస్థ్యమేర్పరిచిరి శ్రీరామనవమికి పెండ్లికుమారుని ఉత్సవమును, గోపాళం రామస్వామిగారును, కళ్యాణమున్నూ శ్రీవారి అర్చకస్వాములును, గరుడోత్సవము శ్రీమాన్ డాక్టరు దీవినరసింహాచార్యులు(సుదర్శనాచార్యులుగారును)ఏకాంతసేవ కోటపిచ్చమ్మ (శబరి) యు పదహారు రోజులపండుగ ఉత్సవము శ్రీమాన్ బృందావనం వెంకట శేషాచార్యులుగారును చేయించుచున్నారు. శ్రీ వారి అర్చకస్వాములు ప్రతి శ్రవణానక్షత్రము నాడు శ్రీ విఖనసాచార్యులవారి మాస తిరునక్షత్రమును శ్రావణశుద్ధ పూర్ణిమకు సంవత్సర తిరునక్షత్రమును ఉత్సవమును చేయించుచున్నారు.

ఉడయవర్ల (రామానుజాచార్యుల) ఆండాళ్ తాయార్లు సంవత్సర తిరునక్షత్రము ఉత్సవములకుగాను అప్పలస్వామి నాయుడుగారు ఏర్పాటుచేసిన సందునుండి జరుగుచున్నవి. శ్రీ వారి బ్రహ్మోత్సవము వైశాఖ శుద్ధ సప్తమినుండి నవాహ్నికముగా జరుగును. అలంకార తిరుమజ్జనముతో సహా పెండ్లికుమారుని ఉత్సవమును, యద్దనపూడి లక్ష్మమ్మగారును, ధ్వజారోహణ ఉత్సవము దేవరాజు రాజమ్మగారును; హంస

వాహనము, దేశరాజు వెంకటప్పారావుగారును, సింహవాహనం, శ్రీ పుష్పయాగోత్సవములను దేశరాజు సార్వభౌమరావుగారును, హనుమంతవాహనము ఓసూరి యతిరాజులుగారును, గజోత్సవము, కొమరవోలు లక్ష్మీనారాయణగారును శేషవాహనోత్సవము, మోదడుగు పేరయ్యగారి కుమారులును, పొన్న వాహనోత్సవమును, అధ్యయన ఉత్సవములలో 9వ రోజు ఉత్సవమును, బాపట్ల ఆర్యవైశ్య సంఘమువారును, నృసింహ జయంతి స్థానం కుటుంబమువారును, మోహినీ ఉత్సవము చోరగుడి రామదత్తుగారిభార్య మహాలక్ష్మమ్మగారు, కళ్యాణము గుంటూరు వాస్తవ్యులైన దేశరాజు హనుమంతరావుగారును, అక్షతారోపణ కొండపాటూరు గ్రామస్తులును, గరుడోత్సవమును, శిఖరం వెంకటచలపతిరావుగారును, రథోత్సవమును మునుకుదురు వాస్తవ్యులు దాసరి తిరుపతిగారును, చక్రతీర్థోత్సవమును, తూర్పుసత్రం ట్రస్టుబోర్డువారును, దోపుసేవ కర్లపాలెం రామకృష్ణమూర్తిగారును, చేయించుచున్నారు. శ్రీవారికి సదహారు రోజులపంటుగవరకు అనేకమంది భక్తులు ఏకాంత సేవలనుచేయించుచు ధన్యులగుచుందురు. బ్రహ్మోత్సవములలో ఉదయ ఉత్సవములు జరుగుటకుగాను బ్రహ్మాండం రత్తయ్యగారును కొంత స్వాస్థ్యమేర్పరిచిరి. ఇప్పుడు వారి కుమారుడు సత్యనారాయణగారు జరిపించుచున్నారు.

శ్రీ భావనారాయణస్వామివారికి ప్రతి వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు రథోత్సవము శ్రీవారి ఆలయమునుండి ప్రసన్నాంజనేయస్వామివారి సన్నిధికిపోయి తిరిగి శ్రీవారి ఆలయమునకుచేరును, అందుచే ఈ వీధిక తేరువీధి అని పేరు

సార్థకమైయున్నది. ఈ పూర్ణిమకు "భావాయిపున్నమి" అను పేరు జగద్విఖ్యాతమైయున్నది. దసరాలో శ్రీ రాజ్యలక్ష్మి తాయార్లకు విశేషపూజలు జరుగును. మొదటి 5 రోజులు జరుగుటకుగాను మైసూరు వాస్తవ్యులు దేశరాజు సీతారామా రావుగారి కుమార్లు నరసింహారావుగారు ఉభయమునిచ్చి యున్నారు. నవరాత్రిములలోవచ్చు మొదటి శుక్రివారము నాడు అమ్మవారికి ఉత్సవము చేయుటకును; క్షీరాబ్ధి ఏకాదశికి స్వామికి గరుడోత్సవము చేయుటకుగాను గొట్టిపల్లి పున్నమ్మ గారు శాశ్వితముగా జరుగు నేర్పాటుగావించిరి పారువేట ఉత్సవమునకు బాపట్ల కాంతమ్మగారును, నరకచతుర్దశి ఉత్స వమునకు గండవరపు వీరమ్మగారును మణవాళ మహాముని సంవత్సర తిరునక్షత్రిమునకుగాను ప్రస్తుతము శ్రీవారి తళిహా స్వామిగానున్న కిడాంబి శ్రీనివాసాచార్యులగారు శాశ్వతనిధి నేర్పాటుచేసి జరించుచున్నారు. ధనుర్మాసమంతయు భక్తుల స్థిరస్వాస్థ్యములనుంచియు, ఉభయములనుండియు శ్రీ గోదా దేవికి ఉత్సవములు జరుగును. వైకుంఠ ఏకాదశికిముందు దశమనాటిరాత్రి శ్రీవారికి మోహినీ ఉత్సవమును గరికిపాటి వాస్తవ్యు శ్రీమాన్ భిషగ్రాజ బృందావనం నరసింహా చార్యులుగారు చేయించుచున్నారు. వైకుంఠ ఏకాదశి, గరుడో త్సవము ద్వాదశి ఉత్సవములు గుడివాడ వాస్తవ్యులు అవుట పల్లి పట్టాభిరామయ్యగారు ప్రత్యేకభూస్వాస్థ్యమొసగి జరుగు నట్లు చేసినారు. అధ్యయన ఉత్సవములోకూడా కొన్ని స్థిరస్వా స్థ్యములనుండియు ఉభయములనుండియు జరుగుచున్నవి. ఈ సమయమున స్వామికి భక్తులుకోరిన విశేషాలంకారము

చేయుట ఈ క్షేత్ర మర్యాదయైయున్నది. పరమపద ఉత్సవము ను బూర్గె కుటుంబమువారు చేయించుచున్నారు. ధనస్సులో 27వ రోజున కూడారు ఉత్సవమునకుగాను సుబ్బరాయలు నాయుడుగారు ప్రత్యేకనిధి నేర్పరచి జరుగునట్లుచేసిరి.

భోగిపండుగనాడు, గోదాకళ్యాణమును, చీదెళ్ళ గురునాథం శ్రేష్టిగారును, సంక్రాంతి ఉత్సవమును రావినూతల వెంకటప్పయ్యగారి దత్తకుమారుడు బుచ్చిరామయ్యగారును, గోదాపర్యంకాసవమును, తూనుగుంట్ల సుబ్బారావు శ్రేష్టిగారి కుమారుడు లక్ష్మీనారాయణగారును చేయించుచున్నారు.

మాఘశుద్ధ చతుర్దశినుండి శ్రీ వీర, భోగలక్ష్మి యోగలక్ష్మి సమేత జ్వాలా నరసింహస్వామివారికి కళ్యాణ ఉత్సవములను, గరుడోత్సవమును పుష్పయాగోత్సవమును కైవారం నారాయణరావుగారి కుమారుడు భోగానంద శర్మ గారు చేయించుచున్నారు.

ఫాల్గుణ శుద్ధ పూర్ణిమనాడు శ్రీ ధ్యాననారాయణ స్వామివారికి పవిత్రోత్సవము (వర్ష వర్షనోత్సవము) జరుగును. దీనిని శాశ్వతముగా జరుగునట్లు చంద్రపాటి వెంకటసుబ్బమ్మ గారు ప్రత్యేక వ్యవస్థ మొనంగిరి.

ఇవిగాక యింకా అనేక ఉత్సవములు. మాస, సంవత్సర తిరునక్షత్రములు ఏకాదశి పూజలు పంచామృతస్నపనలు, విశేషపూజలు భక్తులకోరికపై ఎల్లపుడు నిత్యకళ్యాణము పచ్చతోరణముగా జరుగుచూ విశేషవైభవముతో ప్రకా శించు చుండును. కొన్ని తిరునక్షత్రములకుకూడా శాశ్వతనిధులు కలవు, ఏకాదశి ఉత్సవములకుగాను, సంకా రావమ్మ అనునొక

భ_స్త్రాలు కొంత శాశ్వితనిధిని, నంబిరాజుతోట వాస్తవ్యులు కరి సుబ్బయ్యవారి సోదరులు ఒక ఎకరము భూమిని శ్రీవారికి సమర్పించియున్నారు.

ప్రతి ప్రతిష్ఠోత్సవమునాడు శ్రీవారి సన్నిధిని స్థల ప్రభావమును, శ్రీవారి కళ్యాణ గుణములగూర్చియు కాలక్షేపము జరుగును. ప్రతివారును శ్రీవారిని దర్శించి సేవించినంత కృతార్థులగుదురనుటలో అతిశయోక్తిలేదు. ఈ స్థల ప్రభావమునుగూర్చి చదివినవారికిని విన్నవారికిని క్షేత్రదర్శనముగావించినవారికిని శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేతులైన శ్రీభావనారాయణస్వామివారి అనుగ్రహమునుపొంది సమస్త కోర్కెలు నెరవేరి అంత్యమున మోక్షప్రాప్తిని పొందగలరు.

బాపట్ల భావనారాయణస్వామివారి క్షేత్రమునకు క్రీ.శ. 1959 లో శ్రీ వైఖానసాగమ ధర్మ పాఠశాల అను సంస్థయొకటి స్థాపించబడినది. దీనిని గౌరవనీయులైన శ్రీపైడి లక్ష్మయ్యగారు (ఛీఫ్ కమీషనరు. H. R. & C. E.) గారు ప్రారంభోత్సవముగావించియుండిరి. ఈ సంస్థను తర్క-వేదాంత మహావిద్వాంసులును, కులపతియును శ్రీమత్తిరుమల (తిరుపతి) దేవస్థానముల ఆస్థాన విద్వాంసులును అగు పణ్డిత వేదాంతం జగన్నాథాచార్య స్వామివారును, వైయాకరణ పంచానన రాంపిచర్ల పార్థసారథి భట్టాచార్యులవారును, ఆంధ్రప్రదేశ్ అర్చక సంఘకార్యదర్శి దీవిరంగనాథాచార్యులుగారును అష్ట భాషా చక్రవర్తియు ఆరాధనపత్రికా సంపాదకులునగు శ్రీమాన్ దీవి లక్ష్మీనరసింహాచార్యులగారును పరిశీలించి అమూల్యమయిన సలహాలనొసంగియుండిరి. ఈ సంస్థకు మొదట ఆగమ

పండితులుగా శ్రీమాన్ వేదాంత శ్రీనివాసాచార్యులు ఘనాపాఠిగారిని ఏర్పాటుచేసిరి. వారితర్వాత ప్రొఫెసర్ రత్నాకరం సత్యానంద స్వామివారిని ఆగమపండితులుగా ఏర్పాటుచేసిరి. దీనిఅభివృద్ధికై కమిటీవారుకృషి చేయుచున్నారు.

క్రీ. శ. 1959 అక్టోబరులో ఈ పట్టణములోనున్న యిమ్మడిశెట్టివారి పాతెంలో నీటికొరకై దొరువు త్రవ్వుచుండగా అందు 13 లోహ విగ్రహములు 3 గంటలు దొరికినవి. కొన్ని జైనతీర్థంకరులవి. మరికొన్ని స్త్రీ విగ్రహములు యిందులోకొన్ని రాగితోను మరికొన్ని పంచలోహములతోను తయారై షుమారు 12 అంగుళముల యెత్తు కలిగియున్నవి. యింతకుపూర్వము ఇచ్చటనే ఒకప్పుడు నాగలిక్రుబలు కెల్లని పొడిగల నగిషీ కుండలు దొరికియున్నవి. అప్పట్లో వాటివిలువ తెలియనందున భద్రపరచ లేకపోయిరి. ఈ విగ్రహములను, గంటలను పురావస్తు శాఖవారు స్వాధీనపరచుకొని భద్రపరచిరి. ఇప్పటికిని పట్టణమున అచ్చటచ్చట అనేక దేవతావిగ్రహములు కానవచ్చుచున్నవి. ఈ చారిత్రికాంశములవలన ఈక్షేత్రముయొక్క పూర్వవిశిష్టత వెల్లడియగుచున్నది.

ప్రస్తుతము శ్రీభావనారాయణస్వామివారి ఆలయధర్మకర్తలుగా బొప్పన్ల వెంకటచలపతిరావు గారును, దేశరాజు రామచంద్రరావుగారును, స్థానం నరసింహారావుగారును బూన్లె రత్తయ్య శ్రేష్ఠిగారును, దాసరి సింగయ్యనాయుడుగారును, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారుగా యెఱపాటి వెంకటారావుగారును పనిచేయుచున్నారు. ఎండో మెంట్సు ఇనస్పెక్టరుగా బి. వీరభద్రరావుగారును ఉంటూ స్వామిని సేవించుచున్నారు.

ఈ క్షేత్రమునందున్న ఎండోమెంటు ఆఫీసునకు అసిస్టెంటు కమీషనరుగా శ్రీ కె. గోపాలన్ గారును, డిప్యూటీ కమీషనరుగా శ్రీ జి. సుబ్బారెడ్డిగారును, చీఫ్ కమీషనరుగా శ్రీ పైడి లక్ష్మయ్యగారును ఉంటూ శ్రీవారి క్షేత్రమును దర్శించుచు సకలోత్సవములు జరుగునట్లు చూచుచున్నారు. పై అధికారులు ఇటీవల ఏర్పడిన బాపట్ల శ్రీభావనారాయణ స్వామి శ్రీ సోమేశ్వరస్వామివార్ల దేవస్థానముల పునరుద్ధరణ సంఘము వారి సలహాల తీసికొనుచు క్షేత్రాభివృద్ధికై కృషిచేయుచున్నట్లు తెలియుచున్నది - ఈ రచనా సమయమున శ్రీమతి టి. యన్. సదాలక్ష్మిగారు దేవాదాయ ధర్మాదాయ శాఖామంత్రిణిగాను గౌ॥ కాసు బ్రహ్మానందరెడ్డి గారు ఆంధ్రప్రదేశ్ ప్రధానామాత్యులుగాను, గవర్నరుగా శ్రీ పట్టన్ థానుపిళ్ళెగారును పాలించుచున్నారు.

భారతదేశ అధ్యక్షులుగా గౌ॥ శ్రీ డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్ గారును ప్రధానమంత్రిగా శ్రీ పండిట్ జవహార్ లాల్ నెహ్రూగారును పరిపాలనము గావించుచుండిరి.



| సేకరణ | రచన |
|---|---|
| డా॥ నల్లూరి వేంకటరంగాచార్యులు. | కస్తూరి రాఘవ |
| ,, వేంకటసీతారామాచార్యులు. | రామచంద్రశర్మ. |



# శ్రీ
## సువర్చలా సమేత
# ప్రపత్త్యాంజనేయస్వామి దేవాలయము

క్రీ. శ. 1758 సం॥లో పరాసులు ఈ క్షేత్రములోగల ఆంజనేయస్వామి ఆలయములను, భైరవాలయములను, కాళికాలయమును, అష్టశక్తుల ఆలయములు (శ్రీ భావనారాయణ స్వామి ఆలయముతప్ప) పాడు చేసినతర్వాత 122 సం॥లకు శా॥ శ॥ ౧౮౦౩ విక్రమనామ సంవత్సర చైత్రశుద్ధనవమీ బుధవారం (క్రీ. శ. 14-4-1880) లో శ్రీ ప్రపత్త్యాంజనేయ స్వామివారిని భావనారాయణస్వామికి అభిముఖముగా సుమారు 550 గజములదూరమున ఉత్తరాభిముఖముగా ప్రతిష్టగావించ బడినది. వీరి వెనుక భాగమున పరాసులచే తాకబడి భిన్నమయిన శేషభావనారాయణస్వామివారు నేటికిని కానబడుచున్నారు.

ఈ ఆలయమును ఆత్రేయగోత్రోద్భవులైన గట్టుపల్లి వెంకయ్యపంతులుగారు, సిద్ధపురుషులును యోగీశ్వరులును, వైఖానస శ్రేష్ఠులును గౌతమ గోత్రోద్భవులునయిన పరూచరి కృష్ణమాచార్యుల (వంకాయలపాడు) గారిని రావించి వారిచే ప్రతిష్ఠాదికములు జరిపించిరి. అర్చనకై శ్రీ భావనారాయణ స్వామివారి అర్చక స్వాములలో భార్గవగోత్రులయిన శ్రీనివా సుల వెంకటప్పలాచార్యులగారిని, రామాచార్యులగారిని వంశ పరంపరాయుండునట్లు ఏర్పాటుగావించి కొంతస్వాస్థ్యమేర్పరచి కృతార్థులయిరి. వీరితర్వాత కృష్ణమాచార్యులగారును, విను కొండ జానకిరామాచార్యులుగారును వీరిపెద్దకుమారులు సత్య నారాయణాచార్యులుగారును స్వామివారికైంకర్యములు జరిపి యున్నారు. యిప్పుడు శ్రీ నివాసుల రామాచార్యులగారును, వినుకొండ నరసింహాచార్యులుగారును స్వామివారి అర్చనా కైంకర్యమును చేయుచున్నారు.

గట్టుపల్లి వెంకయ్యగారు ఆలయమునకుముందు విజయ ధ్వజమును పేరమంటపమును విమానసహితముగా నొకటినిర్మించి దానియందు శ్రీభావనారాయణస్వామివారు ఉత్సవాదులలో వచ్చి విశేషపూజలందుకొనునట్లుగా ఏర్పాటుగావించిరి. వీరి కోడలును, శ్రీ రాములుగారి భార్యయైన పున్నమ్మగారు శ్రీ భావనారాయణస్వామివారికి ప్రతిక్షీరాబ్ధి ఏకాదశికి గరుడోత్సవము శాశ్వతముగా జరుగునేర్పాటుగావించిరి. ఈ ప్రాంతమంతయు నేటికిని ఆంజనేయ అగ్రహారమని పిలువ బడుచు భావపట్టణము నందఖ్యాతమై విరాజిల్లుచున్నది.

ప్రిస్తుతము శ్రీ ఆంజనేయస్వామి నారాధించుచున్న అర్చకస్వాములు భక్తుల ప్రోత్సహించుచు విశేషపూజలు జరుగునట్లును స్వామికి మంటపాదులు, రజిత కవచాదులు, స్వర్ణాభరణములు ఏర్పడునట్లుచేసి విశేషభక్తితో స్వామినారాధించుచున్నారు.

ఈ ఆలయమున విజయధ్వజమంటపమునకు ముందు ఎత్తుగామంటపమును ఆచంటి రంగనాయకులుగారు కట్టించిరి. విజయధ్వజమంటపమునకు తూర్పున గుంటూరు సుబ్బయ్యగారి భార్య రాఘవమ్మగారును, పడమర గొరు వెంకటేశ్వర్లుగారును మండపములకట్టించిరి. అలంకారమంటపవేదికను సింగరాజు నాగభూషణరావు పంతులుగారు కట్టించిరి. అలంకారమంటపమును దుర్గావిరన్వర్యుల్న వారితరపున సంకా వెంకటేశ్వర్లుగారును, నంబూరి పిచ్చయ్యగారును కట్టించిరి. ఆలయమునకు నూతనద్వారమును అబ్బరాజు ఆదినారాయణగారు చేయించి సమర్పించిరి.

ధృవమూర్తికి వెండిపాదములను, అచ్యుతుని లక్ష్మమ్మగారును, పీతాంబరము వక్షస్థలము; కర్ణపత్రములను నాగవరపు కృష్ణమూర్తిగారును, వాలమును శేష్లసాంబయ్యగారును, వంగరరాములుగారు రామపట్టాభిషేక పతక సహిత స్వర్ణహారమును, వెలగపూడి లక్ష్మమ్మగారు రాళ్ళుపొదిగిన బంగారు వడగల్ నామమును, కాజనరసింహారావుగారు వెండి కిరీటమును, పాలపర్తి వాస్తవ్యురాలు కాకుమాను ఆదిశేషమ్మగారు వెండి శఠారిని, వెండిపళ్ళెమును గొల్లపూడి నాగరత్తమ్మ

గాజును సమర్పించి కృతార్థులయిరి. ఉత్సవమూర్తికి కిరీటము లను మునిపల్లి జానకిరామయ్యగారు సమర్పించిరి.

ఈ సన్నిధిని ప్రతిభాను వారమునాడు మారుతీ భక్త సమాజము (రామదండు) వారిచే సంకీర్తన జరుగుచుండును. ప్రతి వైశాఖ బ॥ దశమికి జయంతి, కళ్యాణఉత్సవము జరుగును.

ఈ కళ్యాణ ఉత్సవములలో ఆ ఖరునాడు స్వామికి గజవాహనోత్సవమును సోదరులైన గుంటూరు వెంకటాద్రివు, పుల్లయ్య శ్రేష్ఠిగారు అనువారలు చేయించుచున్నారు ఇవిగాక భక్తులకోరికపై ఎల్లప్పుడు స్వామికి విశేషపూజలు అతివైభవముతో జరుగుచుండును. ఈ ఆలయమునకుకూడా తూర్పు సత్రము ట్రస్టుబోర్డువారు ప్రతివత్సరము జయంతికి ద్రవ్యమిచ్చుచున్నారు. భక్తులైన భృగుమళ్ళ ముత్తేశ్వరరావుగారు వారితండ్రిగారైన శ్రీ॥ శ్రీ॥ సత్యనారాయణగారి జ్ఞాపకార్థము స్వామివారికి ఉష్ట్రి (ఒంటె) వాహనమును చేయించి శాశ్వతముగా ఉత్సవము జరుగు ఏర్పాటుగావించిరి.

శ్లో॥ వైశాఖమాసి కృష్ణాయాం
దశమ్యాం మందవాసరే
పూర్వాభాద్ర ప్రసూతాయ
ఆంజనేయాయ మఙ్గళమ్.

—[౦]—

# శ్రీ సోమేశ్వరస్వామి దేవాలయము



శ్రీబాలాత్రిపురసుందరీ సహిత అభినవ సోమేశ్వరస్వామివారు.

క్రీ. శ. 1759లో ఈస్టిండియావారి పాలనలో వారి దివాన్‌జీగారగు పూతిమాష సగోత్రోద్భవులయిన శ్రీరాజా కాండ్రేగుల జోగిపంతులు వరఫ్ శ్రీ శ్రీనివాస జగన్నాథ రావు బహదూర్ (రాజమహేంద్రి) గారు శ్రీభావదేవుని ఆలయమున నున్న గంగాపార్వతీ సమేత శ్రీసోమేశ్వరస్వామిని శ్రీ భావనారాయణస్వామివారి అనుజ్ఞతో తూర్పుగా 50 గజ

ములదూారములో ఆలయ నిర్మాణము గావించి శ్రీస్వామిని పీఠముతో సహా తెచ్చి ప్రతిష్ఠ గావించిరి. ఆకాలమున కౌండిన్యస గోత్రోద్భవులైన స్వర్ణ బ్రహ్మన్న అను శివద్విజుల్ని శ్రీ స్వామివారికి నిత్యాభిషేక పూజాకైంకర్యములకుగాను నియమించి స్వాస్థ్యమేర్పరచి చరితార్థులైరి. నేటివరకు వీరి సంతతివారే స్వామి నారాధించుచున్నారు.

క్రీ. శ. 1892 లో ప్రసిద్ధ తెలుగు న్యాయవాదులును, ధర్మాత్ములును, భక్తులునైన బ్రహ్మాండం బాపయ్యపంతులుగారు శ్రీవారి ఆలయమున కిరుప్రక్కల రెండు ఆలయములను, ముఖ మంటపమును నిర్మించి వాహనాదులు చేయించి స్వామికి బ్రహ్మోత్సవమును ప్రారంభింపజేసిరి. శ్రీభావనారాయణ స్వామివారితోపాటు శ్రీ సోమేశ్వరస్వామివారినిగూడ మొదట క్రీ. శ. 594 లో శ్రీ క్రిమికంఠ చోళచక్రవర్తి మీనసంక్రమణయుక్త ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ ఆదివారమునాడు ప్రతిష్ఠించుటచేతను సోమేశ్వరుడగుటచేతను షోడశకళా పరిపూర్ణుడగు ప్రథమవసంత చంద్రదినముననే కళ్యాణము జరుపుట గ్రామశ్రేయస్కరమని దైవజ్ఞులు తెలిపినందున శ్రీసోమేశ్వర స్వామికి చైత్రశుద్ధపూర్ణిమకు బ్రహ్మోత్సవము జరుగునట్లు యేర్పాటు చేయబడినది

శ్రీభావనారాయణ స్వామికి మొదటినుండియు వసంతమున (వైశాఖ శుద్ధ పూర్ణిమ)నే బ్రహ్మోత్సవము జరుగుట అందరును యెరిగిన విషయమే. ఈకారణమువలన శివకేశవులిద్దరకు వసంతముననే చైత్ర వైశాఖమాసములలో బ్రహ్మోత్సవములుజరుగుట ఈక్షేత్రమునకు ప్రత్యేకవిశేషమైయున్నది.



శ్రీ గంగాపార్వతీ సమేత శ్రీ సోమేశ్వరస్వామి
బాపట్ల
చోళరాజుచే క్రీ॥ శ॥ 594 సం॥లో శ్రీభావనారాయణ
స్వామివారి ఆలయములో ప్రతిష్ఠింపబడి
శ్రీ జోగి జగన్నాధరావుగారిచే యిప్పటి ఆలయములో
క్రీ॥ శ॥ 1759సం॥లో పునః ప్రతిష్ఠింపబడిన మూర్తులు

క్రీ. శ. 1895లో మన్మధనామ సంవత్సరమున శ్రీ బాపయ్య పంతులుగారు వారి ప్రథమ పత్నియగు జానికమ్మ గారి పేర నొక రథమును చేయించి స్వామికి సమర్పించిరి.

క్రీ. శ. 1897 సం॥లో భారద్వాజసగోత్రి పవిత్రురా లును, చివుకుల పున్నయ్యశాస్త్రిగారి కుమారులైన సుబ్బరామ య్యగారి భార్యయునగు వెంకాయమ్మ అనుభక్తురాలు ఉత్సవ మునకు అందముగా నుండునట్లు పెద్దఉత్సవమూర్తులను గంగా పార్వతీ సమేతముగా శ్రీసోమేశ్వరస్వామినిచేయించి సమర్పించి నది. నాటినుండి ఆమూర్తులకే సకలోత్సవములు జరుగు చున్నవి.

క్రీ. శ. 1917 సం॥లో శ్రీ బాపయ్యపంతులుగారు నిర్మించిన ఆలయములలో వారి ద్వితీయభార్యయగు రామా బాయమ్మగారి ఆజ్ఞపై కుమారులైన వేంకటలక్ష్మీనారాయణ రావు పంతులుగారు వారి ప్రథమ పత్నియయిన కనకసుందర మ్మగారితో కలసి శ్రీ బాలాత్రిపురసుందరి సహిత అభినవ సోమేశ్వరస్వామిని గణాధిపతిని నందీశ్వరుని ప్రతిష్ఠలను శ్రీ శ్రీ శ్రీ ప. ప. బ్రహ్మానందతీర్థులవారి అధ్వర్యమున జరిపించి జీర్ణధ్వజోద్ధరణ గావించిరి. వాహనశాలను రథశాలను నిర్మించి 5 ఎకరముల 22 సెంట్ల భూమిని శ్రీస్వామికి అత్యంతభక్తితో సమర్పించి యుండిరి. ఈ సమయమున ధ్వజ సమీపమున నున్న నందిసహిత నాగ స్తంభమును, వినాయకుని, నందీశ్వరుని ఆలయ పశ్చిమభాగమున నుండునట్లు శ్రీతీర్థులవారు ఏర్పాటు గావించిరి. నేటివరకు అనేకమందిభక్తులు వారివారి విభవాను సారముగా స్వామిని సేవించుచున్నారు. కరణం నరసమ్మగారు

వెండి మకరిపాదములను సమర్పించియుండిరి. బ్రహ్మాండం చినబాపయ్య పంతులుగారు వెండి ధారాపాత్రను సమర్పించిరి. ఈ స్వామికి కళ్యాణమంటపమును బొలిశెట్టి ఆదినారాయణ గారు కట్టించి కృతార్థులయిరి.

శ్రీ వారికి చైత్రశుద్ధ సప్తమి మొదలు నవాహ్నికముగా బ్రహ్మోత్సవము జరుగును. పెండ్లికుమారుని ఉత్సవము శ్రీ పి.యల్. రామస్వామి అయ్యరుగారును, పెండ్లికుమార్తెల ఉత్సవమును, కీ శే గండవరపు వీరమ్మగారి నిధినుండి శ్రీ శిఖరం వెంకటచలపతిరావుగారును, ధ్వజారోహణ ఉత్సవము (విడిది) ను పాలపర్తి ఆదిశేషయ్యగారి జ్ఞాపకార్థము నాగభూషణ శాస్త్రిగారును సింహవాహన ఉత్సవమును కంభంపాటి బుచ్చిరామకృష్ణయ్యగారును, నందివాహన ఉత్సవమును కీ. శే. చదలవాడ సుబ్బారావుగారి ధర్మనిధినుండియు, ఏనుగ వాహనమును కీ. శే భృగుమళ్ళ సత్యనారాయణగారి జ్ఞాపకార్థము వారికుమారులు ముక్తేశ్వరరావు సహోదరులును, భృంగివాహనోత్సవమును, కీ. శే. వేలూరి వెంకటాచారి గారి ట్రస్టునుండి విశ్వబ్రాహ్మణ సంఘమువారిచేతను, కీ. శే. నోరి వెంకటేశ్వరశాస్త్రిగారి జ్ఞాపకార్థమై కుమారులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గోపాలకృష్ణమూర్తిగారు ఇత్తడిశేష వాహనమును చేయించి స్వామికి సమర్పించి ఆ ఉత్సవమును వారే వైభవోపేతముగా జరిపించుచున్నారు. రావణ వాహనోత్సవమును బ్రహ్మాండం వేంకట లక్ష్మీనారాయణరావు పంతులుగారున్నూ, ఎదురుకోల కళ్యాణము వృషభవాహనోత్సవములను బాపట్ల ఆర్యవైశ్య సంఘమువారున్నూ, రథోత్స

వమును, కర్తల రంగయ్య. భీమా ఆదిశేషయ్య (రిటైర్డు సబ్ యిన్‌స్పెక్టరు) అనువారును వసంతోత్సవమునూ, త్రిశూల స్నానములను తూర్పుసత్రం ధర్మకర్తలున్నూ, దేవస్థానము వారిచే దోపుసేవ, ధ్వజావరోహణమున్నూ, పుష్పయాగోత్సవమును వల్లూరి హనుమంతరావుగారు, పంగులూరి వెంకటాద్రి యుడుగారు అనువారలున్నూ చేయుచున్నారు. స్వామికి భక్తుల ఉభయములచే పదహారు రోజుల పండుగవరకు ఏకాంత సేవలు జరుగును. ధ్వజారోహణము మొదలు ఆఖరువరకు నిత్యము ఉదయమున స్వామికి మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకములు (అభిషేకప్రియో శివః అనుసూక్తి ననుసరించి) జరుగును. ఇత్తడి భృంగివాహనమును వేల్పూరి భావనాచార్యులుగారును ఇత్తడి ఏనుగువాహనమును చివుకుల వెంకటప్పయ్యగారి తల్లిగారును చేయించి సమర్పించిరి.

క్రీ. శ. 1921 సం॥లో బ్రహ్మాండం వెంకట లక్ష్మీ నారాయణరావు పంతులుగారు వారి ప్రథమభార్యయైన కనక సుందరమ్మగారి జ్ఞాపకార్థము వెండి కర్పూరహారతిని సమర్పించిరి. వీరే స్వామికి 1925 సం॥లో రావణ, ప్రణవనంది, సింహవాహనములను, తిరుచి, మకరతోరణాదుల చేయించి సమర్పించిరి.

వీరు నవరాత్రులయందు పూజలును, శమీపూజ ఉత్సవమును, కార్తీకమున నిత్యాభిషేకములు, ధనుర్మాసమున ఆగ్రోత్సవమును, సంక్రాంతి పండుగ ఉత్సవములనుకూడా చేయించుచున్నారు. ధనుర్మాసమంతయు భక్తుల ఉభయములతో అమ్మవారి చిన్నమూర్తులకు ఉత్సవములు జరుగును.

ముక్కోటి ఏకాదశి ఉత్సవమును యడవల్లి కామేశ్వరరావు గారి కుమారులు పురుషోత్తము పంతులుగారు చేయించు చున్నారు. శివరాత్రి ఉత్సవమును కొండూరి పిచ్చయ్యగారి కుమారులు రామకోటిగారు చేయించుచున్నారు. కార్తీక పూర్ణిమకు జ్వాలాతోరణ ఉత్సవము జరుగును.

ప్రస్తుతమీ దేవాలయమునకు కొక్కు సుబ్రహ్మణ్యం గారును, వెదురుపర్తి వీరాచార్యులుగారును, శిఖరం రామ కృష్ణారావు గారును, కత్తి రత్తయ్యగారును, కర్ణపూడి కమలా దేవిగారును ధర్మకర్తలుగానుంటూ స్వామికి సకలోత్సవములు చేయించుచు విశేషవైభవము చేకూర్చుచున్నారు.

—:o:—

## శ్రీ రామలింగేశ్వర స్వామివారిదేవాలయము

శ్రీ భావదేవుని ఆలయమునకు తూర్పుదిశలో షుమారు ఆరుఫర్లాంగుల దూరములోగల సత్యనారాయణపుర అగ్రహారమునందు ప్రాఙ్ముఖముగా శ్రీ పర్వతవర్ధనీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి ఆలయము గలదు. 31-10-1925లో స్వస్తిశ్రీ క్రోధననామ సంవత్సర కార్తీక శుద్ధ పూర్ణిమ శనివారమునాడు బ్రహ్మశ్రీ వేదమూర్తులగు పొన్నాడ రామచంద్ర యినులుగారి రెండవ కుమారుడు లక్ష్మీనారాయణగారు ప్రతిష్టించిరి. వీరును, ఆదూరి రాధాకృష్ణమూర్తి గారును, నరసింహారావు గారును, చిల్లర నీలకంఠరావుగారును స్వామికి నిత్యపూజాదులు జరుగునట్లు వారివారి శక్త్యానుసారముగ సాహాయ్యము లొసంగి సేవించుచున్నారు. ఈ ఆలయము



శ్రీవీరాంజనేయ స్వామివారి
మూలవిరాట్ ప్రతిష్ట
ప్రమాది సం॥ వైశాఖ శు. ౭
దీ 26—4—1939 తేదీన
శ్రీ శ్రీ శ్రీ సద్గురు
జగన్నాధస్వామివారి శిష్యులు
భృగుమళ్ల ముత్తయ్యగారి
కుమారులు
సుబ్బారావు దంపతులచే
ప్రతిష్ఠితము.

బాపట్ల,
పాండురంగవీధి.



పాండురంగస్వామివారి ఆలయ దృశ్యము.

నకు కూడా ప్రతిసంవత్సరము తూర్పుసత్రముట్రస్టుబోర్డువారు పూజాదులకై కొంత ద్రవ్యము యిచ్చుచున్నారు.

ఈ ఆలయమునకు చిలంకూరి అప్పయ్యనాయుడుగారు ధ్వజస్తంభమును వేయించిరి. 1962 సం॥లో భీమా ఆదిశేషయ్య నాయుడుగారు చందాలు వసూలుచేసి ధ్వజమునకు కవచమును ఏర్పరచిరి. ఈ ఆలయమునకూడ లక్షబిల్వార్చన మొదలగు పూజలు అభిషేకాదులు జరుగుచుండును.

## శ్రీ పాండురంగ స్వామివారి దేవాలయము

ఈ ఆలయము భావదేవుని ఆలయమునుండి షుమారు ఒక మైలుదూరమున బందరు రోడ్డునకు దక్షిణభాగమున ఉత్తరాభి ముఖముగా యున్నది. ఇది క్రీ.శ. 1937 సం॥లో భక్తుల ప్రోత్సాహ విరాళములచే నిర్మింపబడినది.

ఈ ఆవరణములో పశ్చిమమున నిర్మింపబడిన ఆలయమందు శ్రీ రుక్మిణీ సమేత పాండురంగస్వామి ఉత్తరముఖముగా యున్నారు. తూర్పుననిర్మించిన ఆలయమునందు వీరాంజనేయ స్వామివారు ఉత్తరాభిముఖముగా యున్నారు. ప్రతి కార్తీక శుద్ధఏకాదశిన పాండురంగ స్వామివారికి కల్యాణోత్సవములు జరుగును. ఆలయ నిర్వాహణ పోషణాదులను శ్రీవారి భక్తులైన భృగుమళ్ళ సుబ్బారావుగారు చూచుచున్నారు. వీరు నగర సంకీర్తనము చేయుచు స్వామిని సేవించుచున్నారు. ఈ సన్నిధిన ప్రతి కార్తీకమున వనసమారాధనలు, పూజలు విశేషముగా జరుగుచుండును. ఈ మాసముననే స్వామివారికి గ్రామోత్సవముకూడ జరుగును.

# శ్రీ సత్యనారాయణ స్వామివారిదేవాలయము
## విజయలక్ష్మీపురము.

శ్రీసత్యనారాయణ స్వామివారి దేవస్థానము శ్రీభావదేవుని ఆలయమునకు దక్షిణమున సుమారు 6 ఫర్లాంగులదూరములో విజయలక్ష్మీపురమను పేటలో గలదు. ఇందు శ్రీ లక్ష్మీ సమేత సత్యనారాయణ స్వామివారు పంచాయతనముగ ఉద ఙ్ముఖముగను, వారికి అభిముఖముగ శ్రీ ప్రసన్నాంజనేయ స్వామియు, పశ్చిమమున నిర్మింపబడిన ఆలయమందు షష్ఠీ సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ప్రాఙ్ముఖముగను, శంకరా చార్యులవారును తూర్పున నవగ్రహ మంటపమున నవగ్రహ మూర్తులు వారికి దక్షిణమున మృత్యుంజయలింగాకార మూర్తియు గలరు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాలయము వెనుక శమీ, అశ్వత్థనారాయణ వృక్షములు చుట్టూ వేదికపై నాగప్రతిష్ఠలు కలవు.

క్రీ. శ. 1938 సం॥లో ఇట విజయలక్ష్మీపురమను పేట నిర్మించుచు 52 నెంబరు లాటు దేవతాప్రతిష్ఠకై వదలబడినది. ఈ పేట అనుకోనకుండా త్వరలో నిర్మాణము కాబడి ప్రకా శించుటచే గ్రామస్థులు దీనిని "మాయాబజార్" అని ఆశ్చర్య ముగా పిలచిరి క్రమముగా ఈపేట మాయాబజార్ అను పేరుతో సర్వజనీనమై నేటికిని ఆపేరుతోనే పిలువబడుచుండుట అందరకు తెలిసిన విషయమే! పేటనిర్మాణమైనదిగాని దేవతా ప్రతిష్ఠమాత్రము జరుగలేదు.

తరువాత దేశరాజు కృష్ణయ్య, శేషమ్మగార్ల కుమారు లైన సార్వభౌమరావుగారు వారి గురువరేణ్యులయిన భాగ



శ్రీ సత్యనారాయణస్వామి - శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివార్ల ఆలయ దృశ్యము
విజయలక్ష్మీపురం, బాపట్ల.

వతుల అన్నపూర్ణయ్యగారు 52 వ లాటులో శ్రీ లక్ష్మీ సమేత సత్యనారాయణస్వామివారి పంచాయతన ప్రతిష్ట యున్నూ శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివారి ప్రతిష్ఠయున్నూ జరుపమని వారికి వారి ఉపాసనాదేవత తెలియపర్చిరని చెప్పగా అట్లు జరుపుటకు సాహసించలేక ప్రసిద్ధ న్యాయవాదిన్ని గుంటూరు వాస్తవ్యులగు శ్రీ దేశరాజు హనుమంతరావు గారితో ప్రస్తాపించగా వారు తమ గురువరేణ్యులైన శ్రీశ్రీ శ్రీ ప. ప. కళ్యాణానంద భారతీ స్వాముల వారితో ప్రస్తా పించగా వారున్నూ తప్పక జరిగించ వలసినదని సెలవివ్వగా మైసూరు వాస్తవ్యులున్నూ మైసూరు రైల్వేల ఛీఫ్ ఇంజనీరు పదవి అలంకరించిన శ్రీ దేశరాజు నరసింహారావుగారితో నున్నూ, బాపట్ల వాస్తవ్యులున్నూ సుప్రసిద్ధ వైద్యులైన శ్రీ దేశరాజు వెంకటప్పారావుగారితో నున్నూ అందరిలో పెద్దవా రైన శ్రీ దేశరాజు చినబాపారావుగారితో నున్నూ పై హంశ ములను తెలియపర్చి వారల ఆమోదమును పొంది, పెద తండ్రుల కుమారులైన వారందరు స్థాపకులు గాయుండి అంద రిలో చిన్నవారైన సార్వభౌమరావుచే ది2-12-1955 వ శంకుస్థాపనను శ్రీ భాగతుల అన్నపూర్ణయ్యగారి అధ్వర్యమున జరిపిరి. ఆముహూర్తముననే శ్రీ ఒంగోలు శ్రీనివాసరావు గారుకూడా షష్ఠీ సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర ఆలయమునకై శంఖుస్థాపనను గావించిరి. తదుపరి 2-5-1956 తేదిన ప్రతిష్ఠా దులు జరిగినవి.

పై ఉద్యమములో సార్వభౌమరావుగారు, వారి సోదరు లైన లేటు భావనారాయణ, వెంకటచలపతిరావు, పార్థసారధి రావు, వెంకటలక్ష్మీ నరసింహారావుగారల కుటుంబము

వారున్నూ సార్వభౌమరావుగారి భార్యయైన అన్నపూర్ణమ్మ వారి తలిదండ్రులయిన తల్లాప్రగడ అచ్చమ్మ, భగవానుల జ్ఞాపకార్థమై యొసగిన మొత్తముతో నున్నూ శ్రీ సత్యానారాయణస్వామి పంచాయతన ఆలయమున్నూ శ్రీప్రసన్నాంజనేయస్వామి ఆలయము నిర్మాణము గావించిరి.

శ్రీ దేశరాజు నరసింహారావుగారు లక్ష్మీ, సత్యానారాయణస్వామి, సూర్యనారాయణస్వామి, చండీదేవి, గణేశ్వరుల శిలామూర్తులను ప్రఖ్యాత శిల్పాచార్యులైన మైసూరులోని నాగేంద్ర స్థపతిగారిచే చేయించి సమర్పించిరి శ్రీ లక్ష్మీ సత్యనారాయణ స్వామివారి ఉత్సవమూర్తులను దేశరాజు అన్నపూర్ణమ్మగారి సోదరులైన తల్లాప్రగడ సత్యనారాయణ మూర్తిగారున్నూ, చక్రపెరుమాళ్ళ చంద్రయ్యగారున్నూ చేయించి సమర్పించిరి. శంకుస్థాపనకు పూర్వమే కళ్యాణానంద భారతీస్వాములవారు చెప్పినప్రకారము వారి శిష్యవర్గము లింగ మూర్తిని సమర్పించి ప్రతిష్ఠాదులను జరిపించిరి. ఈ ఆలయములకు దక్షిణముగాయున్న 1 శెంట్లు స్థలమును కీ॥ శే॥ నోరుడుగు భావనారాయణగుప్తగారి భార్య ఆదెమ్మగారు సమర్పించిరి. ప్రతిష్ఠ కలాపమునకు దేశిరాజు హనుమంతరావుగారు రు 2000/-లు, వెంకటప్పారావుగారు రు500/-లు సమర్పించిరి.

శ్రీ వంగోలు శ్రీనివాసరావుగారు తలపెట్టిన షష్ఠీ సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిఆలయమును వారితో పాటు శ్రీ సింగరాజు నాగభూషణరావుగారు, శ్రీశిఖరం గురురాజారావుగారు, లేటు వెలగపూడి సుబ్బారావుగారు, శ్రీ కోటంరాజు వెంకటకృష్ణమూర్తిగారు శ్రీ పి యస్ రామస్వామి సుబ్రహ్మణ్య అయ్యరుగార్లు, నాగులపాలెం వాస్తవ్యులు శ్రీ కొల్లా వెంకయ్యగారు, శ్రీ దేశరాజు అన్నపూర్ణమ్మగారు,

వారిసోదరియైన కేసాప్రగడ శేషమ్మగారి జ్ఞాపకార్థమై యొసం గిన మొత్తములతో పై ఆలయనిర్మాణము పూర్తిగావించబడి నది. నిత్య నైవేద్యమునకు శ్రీ దేశరాజు హనుమంతరావు గారు, అప్పారావుగారు, చినబాపారావుగారున్నూ, భూవసతి నేర్పరచిరి గుంటూరు తాలూకా వరగాణి వాస్తవ్యురాలు యేలూరి వీరరాఘవయ్యగారి భార్య శేషమ్మగారు నిత్యదీపారా ధన జరుగు నేర్పాటు గావించిరి

ఇంకా అనేకమంది భక్తులొసంగిన సమర్పణలతో స్వామికి మంటప ప్రాకార గోపురాదులు నిర్మించబడినవి. రు 500/- లకు పైగా సమర్పించిన భక్తులపేర్లు ఆలయమున కానబడుచున్నవి.

క్రీ. శ. 2-6-63 న ఈ ఆలయములో తూర్పుభాగ మున కొమ్మరాజు లక్ష్మీకాంతానందయోగిగారి అధ్వర్యమున నూతనముగా భక్తులచే నిర్మించబడిన మంటపమునందు నవగ్రహ ప్రతిష్ఠయు మృత్యుంజయ ప్రతిష్ఠయు సుబ్రహ్మణ్య ఆలయములో శ్రీ శంకరాచార్యుల ప్రతిష్ఠయు, వెనుకనున్న అశ్వత్థనారాయణ వృక్షముల కళ్యాణమున్నూ చుట్టూ నిర్మిం చిన వేదికపై నాగప్రతిష్ఠలు జరిగినవి. నవగ్రహ మూర్తులను పేరలి బాపయ్యగారిభార్యయైన చెంచమ్మగారు చేయించి రందు శనిగ్రహ ప్రతిష్ఠను వారే జరిపించిరి.

రవిగ్రహ ప్రతిష్ఠను ఆరణి ఆంజనేయులుగారి భార్య వెంకట రత్నమ్మగారును, చంద్రగ్రహ ప్రతిష్ఠను యరాసి వీరయ్యగారి భార్య హనుమాయమ్మగారును, కుజగ్రహప్రతి ష్ఠను మోదడుగు చినరంగయ్యగారును, బుధగ్రహ ప్రతిష్ఠను భక్త బృందమువారును, బృహస్పతిగ్రహ ప్రతిష్ఠను పేరకం పున్నయ్యగారును శుక్రగ్రహ ప్రతిష్ఠను బయ్యా సుబ్బారావు

గారును, రాహుగ్రహ ప్రతిష్ఠను అప్పిచర్ల సీతారామారావు గారును, కేతుగ్రహ ప్రతిష్ఠను దేశరాజు సార్వభౌమరావుగారి కుమారులయిన కృష్ణయ్యగారును జరిపించిరి. ఈ మంటప నిర్మాణమునకై వల్లూరి వెంకటేశ్వర్లుగారు రు 616/- లను కొండా కోటయ్యగారు రు 200/- లను సమర్పించిరి. కొండూరి పిచ్చయ్యగారి కుమారులు రామకోటిగారు రు 500/- లు సమర్పించి. యీ మంటపమున లింగాకారమూర్తిగా మృత్యుంజయుని ప్రతిష్ఠించిరి. ఈ సమయముననే శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాలయములో శ్రీ శంకరాచార్యులవారిని దేశరాజు సార్వభౌమరావుగారు ప్రతిష్ఠగావించిరి. ఆలయమునకు తూర్పుభాగములో 10 సెంట్లలో తోట నేర్పాటుగావించిరి. వఝ సూర్యనారాయణగారి జ్ఞాపకార్థమై వారి కుమారులు శివరామయ్యగారు బావి నొకదానిని నిర్మాణము గావించిరి.

శ్రీ సత్యనారాయణ స్వామివారికి ప్రతి మాఘ శుద్ధమున బ్రహ్మోత్సవము జరుగును. ఇందు, అంకురార్పణ ధ్వజారోహణ కళ్యాణము, ధ్వజావరోహణములు స్థాపకులే చేయించుచున్నారు. బెండపూడి నారాయణరావుగారు మిద్దె రథమున కుపయోగపడు కారుచట్రమును సమర్పించిరి. శేష వాహనమును కొమరవోలు రాజయ్య పంతులుగారును, గరుడ వాహనమును నండూరి బాపిరాజుగారును, సూర్యప్రభ, చంద్రప్రభ వాహనములను నల్లూరి నాగయ్యగారును, కీలుగుర్రపు వాహనమును మోపదుగు రామేశంగారును, అంబారితో సహా ఏనుగవాహనమును పులిపాక వెంకటకృష్ణయ్య గారి కుటుంబమువారును చేయించి ఆయా వాహనముల ఉత్సవములను వారలే చేయించుచున్నారు.



శ్రీ మృత్యుంజయస్వామి సహిత నవగ్రహమూర్తులు
విజయలక్ష్మీపురం, బాపట్ల.

గంధర్వాశ్వమును(రెక్కల గుఱ్ఱము)మాగులూరి సుబ్రహ్మణ్యాంగారు సమర్పించిరి. ఈ ఉత్సవము పేరలి చెంచమ్మగారు శాశ్వతముగా జరిపెదమని వాగ్దానముచేసి చేయించుచున్నారు. రథమందిరమును బుద్ధవరపు నారాయిణమూర్తిగారు చేయించి సమర్పించిరి. ఈ రథోత్సవము మాఘ శుద్ధ పూర్ణిమకు అతి వైభవముగా గ్రామమంతటను జరుగును. దీనిని పెనుమచ్చ చినసుబ్బరాజుగారు శాశ్వతముగా జరుపు నేర్పాటుతో చేయించుచున్నారు. ఎదురుకోల ఉత్సవములో స్వామివారికి అశ్వవాహనోత్సవము మలిశెట్టి సుబ్బయ్యగారి కుమారుడు భావనారాయణ గుప్తగారును, అమ్మవారికి బూర్లె లక్ష్మయ్య వెంకటసర్సు వారల జ్ఞాపకార్థము వారి కుమారులు ముత్తు పందిల్ ఉత్సవమును జరుపుచున్నారు. శ్వేతచ్ఛత్రమును (భూచక్ర గొడుగు) మునిపల్లె వెంకటేశ్వర్లు(వకీలు)గార్లు సమర్పించిరి. బయ్యా సుబ్బారావుగారు శ్రీసత్యనారాయణస్వామివారికి శార్దూలవాహనము చేయించి ఉత్సవము చేయించుచున్నారు. ఏ కేషష్ఠీసహిత సుబ్రహ్మణ్యస్వామివార్ల ఉత్సవమూర్తులను చేయించి ప్రతిష్ఠించి వారికి ప్రతి మార్గశిర శుద్ధ షష్ఠికి కళ్యాణమును చేయించుచున్నారు. ప్రత్యేకముగా స్వామికి మయూర వాహనమునుకూడా చేయించి ఆ ఉత్సవమునుకూడా వీరే జరిపించుచున్నారు

తూర్పుసత్రం ట్రస్టుబోర్డువారు శ్రీసత్యనారాయణస్వామి వారి బ్రహ్మోత్సవమునందును. శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారికి కళ్యాణ ఉత్సవ సందర్భములోను జరుగు సాంస్కృతిక విజ్ఞాన కార్యక్రమములకు ధన సహాయము నొసంగి జరిపించుచున్నారు. వైకుంఠ ఏకాదశి (ముక్కోటి)నాడు సత్యనారాయణ

స్వామివారికి ఉత్సవమును కొమరవోలు నాగేశ్వరరావుగారు వారిసోదరులును, సుబ్రహ్మణ్యేశ్వర స్వామివార్ల ఉత్సవమును ఒంగోలు శ్రీనివాసరావుగారును చేయించుచున్నారు.

ఈ ఆలయము స్థాపకులయొక్క పాలనయందుండి దినాదినాభివృద్ధి నందుచు విజయలక్ష్మీపురము విజయలక్ష్మీప్రదమై విరాజిల్లుచున్నది.

## పోలేరమ్మ గుడి

ఈ గుడి శ్రీ భావనారాయణస్వామివారి ఆలయమునకు 2½ ఫర్లాంగుల దూరములో నిరుకుతి దిక్కున జి. బి. సి. రోడ్డుకు ఆనుకొని దక్షణమున తూర్పు ముఖమునగనున్నది. చరిత్రను బట్టిచూడగా కీ॥ శ 594 సం॥ లో శ్రీ చోళచక్రవర్తిచే అష్టశక్తుల ఆలయములుకూడ ప్రతిష్ఠించినట్లును క్రీ॥శ॥ 1758 సం॥ లో పరాసులచే ఈ ఆలయములు శిధిలములు గావించబడినట్లు తెలియుచున్నది. క్రీ॥ శ॥ 1759 సం॥ లో కాండ్రేగుల జోగీపంతులూ వరస శ్రీనివాస జగన్నాథరావు బహదూర్ గారిచే శ్రీ భావనారాయణస్వామివారి ఆలయ పునరుద్ధరణ, శ్రీ సోమేశ్వరస్వామిని ప్రత్యేక ఆలయమున పునః ప్రతిష్ఠించుట జరిగినది. ఆసమయముననే గ్రామస్థులచే పొలిమేర దేవతగా ఈఅమ్మవారిని ప్రతిష్ఠించినట్లు చెప్పుకొనుచలవాటుకలదు. కాని సరియైన ప్రతిష్ఠాకాలము దొరకనందున మీకు తెలుపలేకపోతిని. ఈ తల్లివద్దకు అన్నివర్ణములవారు వచ్చి వారివారి విభవానుసారముగా అమ్మవారిని సేవించి చల్లగా సుఖించు చున్నారు. భక్తులు పర్వదినములలో భజన మొదలగు కాలక్షేపములు చేయుచు కొలుచుచుందురు

# పడమర సత్రము క్రీ. శ. 1779.

స్థాపకులు

కీ॥ శే॥ మణపాక రామానాయుడుగారు, బందరు.

ఈక్షేత్రమునగల సత్రముల చరిత్రలుమీకు తెలుపుచున్నాను.

ఇది శ్రీభావనారాయణస్వామివారి గుడికినైరుతి దిశలో సుమారు 6 ఫర్లాంగుల దూరములో యీ పట్టణమునకు పడమరగా జి. బి. సి. రోడ్డుకు దక్షిణభాగములో గలదు. ఈ క్షేత్రప్రభావమును తెలిసికొన్నవారును విశిష్టాద్వైతమత సంప్రదాయులును బందరులోని రామానాయుడుపేట వాస్తవ్యులు కీ॥ శే॥ మణపాక రామానాయుడుగారు 1779 సం॥ లో యాత్రికుల కొరకుగాను ఈక్షేత్రమున పడమర సత్రమను పేరుతో నిర్మించి దాని నిర్వహణకై భూవసతి నేర్పరచి కృతార్థులైరి తరువాత వీరి వంశీకులయిన బుచ్చి వెంకటరెడ్డి నాయుడుగారును కొంతకాలము వీరి కుమారులు బుచ్చిరామానాయుడుగారును (చిదంబర క్షేత్రములో న్యాయవాది) సత్రయాజమాన్యము వహించి తనకువీలుపడక ది 14–11–1926 తేదినుండి ఈసత్ర నిర్వహణకై ఈగ్రామకరణముగారైన శిఖరం వెంకటచలపతిరావుగారిని సర్వహక్కులుగల ఏజంటుగా 25–3–1935 తేదీ వరకు నియమించిరి. తరువాత గోవిందరాజుల నాయుడుగారుకూడా వీరినే 10–5–43 వరకు నియమించి తర్వాత గోవిందరాజులు నాయుడుగారే (మద్రాసు) ఈ సత్రమును తమ స్వాధీనములో నుంచుకొని దాని పోషణ చేయుచున్నారు. శిఖరం వెంకట చలపతిరావు గారు ఏజంటు గానున్న సమయముననే ఈసత్రము నూతనము గావింపబడి భవననిర్మాణము చేయబడినది.

# తూర్పు సత్రము క్రి. శ. 1850

## స్థాపకులు

### కీ॥ శే॥ పేరం గరుడాచలంనాయుడుగారు బందరు

ఈ సత్రము భావదేవుని ఆలయమునకు సుమారు 6 ఫర్లాంగుల దూరములో జి. బి. సి. రోడ్డుకు ఉత్తరమున గలదు. దీనిని బందరు వాస్తవ్యులును విశిష్టాద్వైతమత సాంప్రదాయులగు పేరం గరుడాచలం నాయుడుగారు ఈ క్షేత్ర మహాత్మ్యమును తెలుసుకొని బాటసారులకు యాత్రికులకు మొదలగువారికి సౌకర్యము కలిగించుటకై ఈ క్షేత్రమున దీనిని నిర్మించి గొప్పస్థితికివచ్చు నేర్పాట్లుచేసి చరితార్థులైరి.

వీరు ఈక్షేత్రాధినాథులైన శ్రీభావనారాయణస్వామి వారికి బ్రహ్మోత్సవములో అవబృధోత్సవమునాడు ఈ సత్రమునకు విచ్చేసి చక్రతీర్థోత్సము జరుగునట్లు ఏర్పాటుగావించి ధన్యులయిరి. ఈ సత్రమునకువచ్చు ఆదాయమునుండి బాటసారులకు పేలపిండి, మజ్జిగ యిచ్చునట్లును దైవకార్యములకు విద్యావిషయములకు, ధర్మకార్యములకు వినియోగించునట్లును యేర్పాట్లుచేసి వర్ఘుల రామయ్య అనువారిని సత్రనిర్వహణ చేయునట్లు యేర్పాటుచేసిరి. నాటినుండి నేటివరకు ప్రతివైశాఖ బహుళ పాడ్యమినాడు శ్రీభావనారాయణ స్వామివారు యీ సత్రమునకు విచ్చేసి చక్రతీర్థ ఉత్సవములో ఇచ్చట భక్తులకు దర్శన మొసంగుచు కాపాడుచున్నారు,

ది 19—3—42 న ఈధర్మాదాయము స్కీము కాబడి ప్రతి 5 సంవత్సరములకొకసారి సబ్ కోర్టువారిచే ధర్మకర్తల నియామకము జరుగునట్లును, దాతవంశీకులలో పెద్దవారు వంశపరంపరా ధర్మకర్తగా నుండునట్లును మరికొన్ని విషయ

ములతోను తీర్పుకాబడినది. మొదట కోర్టువారిచే పేరంబాబు వరదయ్యనాయుడుగారు వంశపరంపరా ధర్మకర్తగాను, వెలగపూడి సుబ్బారావుగారు, వేదాంతం వాసుదేవరావుగారు, శిఖరం వెంకట చలపతిరావుగారు, మాధవపెద్ది కాళిదాసుగారు ధర్మకర్తలుగాను ఉండునట్లు యేర్పాటు చేయబడినది. వీరు క్రీ. శ. 1948 సం॥లో సత్రమునకు నూతనభవన నిర్మాణము గావించిరి. సీ్రమములో శ్రీభావనారాయణ స్వామివారిచక్ర తీర్థోత్సవముతో పాటు శ్రీసోమేశ్వరస్వామివారికి త్రిశూల స్నానోత్సవముకూడ జరుపవలసినదిగా మార్చబడినది.

తరువాత ఎలగంబేడు వేదవల్లి తాయారమ్మగారు వంశపరంపరా ధర్మకర్తగాను. దేశరాజు సార్వభౌమరావుగారు, కొక్కు సుబ్రహ్మణ్యంనాయుడుగారు, ఆదెళ్ళ రంగనాయకులు నాయుడుగారు, మోదడుగు నాగేంద్రగుప్తగారు అనువారలు ధర్మకర్తలుగాను నియామకము జరిగినది. వీరు సత్రమును అభివృద్ధిచేయుచు మరికొన్ని కట్టడములకూడ, నేర్పరచిరి.

ప్రస్తుతము వంశపరంపరా ధర్మకర్తగా ఎ. ఎతిరాజులు నాయుడుగారును, (మద్రాసు) ట్రస్టుబోర్డు అధ్యక్షులుగా, యడవల్లి సూర్యనారాయణగారును, బ్రహ్మాండం పురుషోత్తముగారును, శీరం రాధాకృష్ణమూర్తిగారును, వఝు శివరామయ్యగారును ధర్మకర్తలుగా నుంటూ దాత యాశయముల ననుసరించి ధర్మ, దైవకార్యములను నిర్వహించుచు, సత్రాభివృద్ధి చేయుచున్నారు. వీరు ఈ ధర్మాదాయము నకువచ్చు ఆదాయము పెంపగునట్లు కృషిచేసి ఈ సత్రమును

నవీకరణముగావించి క్రొత్త భవనములను పై అంతస్తులను నిర్మించి నూతన శోభనుచేకూర్చిరి. ఈ భవనములకు విద్యు ద్దీపాలంకరణమును గావించిరి వీరు స్థాపకులైన కీ॥ శే॥ పేరం గరుడాచలం నాయుడుగారి యాశయముల ననుసరించి వారిపేర అనేక సత్కార్యములచేయుచున్నారు. ఈ పూర్వ సత్రము ఒకానొకప్పుడు ఈ గ్రామప్రజలకే ఏమూలనున్నదో తెలియని పరిస్థితియందుకలదు. నేడు ఈసత్రపు విషయము తెలసి అనేక మంది గృహస్థులు వివాహాది శుభకార్యములు చేసికొనుటకై ఇచ్చటకువచ్చి శుభకార్యములు జరుపుకొను చున్నారు. ధర్మకర్తలు సత్రమునకు వలయు పాత్రసామానుకూడ నేర్పరచి యున్నారు. ఈ సత్రము నిత్యకళ్యాణము పచ్చతోరణముగా నుండి ఆశ్రితులపాలిటి కల్పవృక్షమై అలరారుచున్నది

ఈ ట్రస్టుబోర్డువారు ఈ ధర్మాదాయము క్రిందగల భూములను మరమ్మతులుచేయించి ఆదాయము పెరుగునట్లు చేసిరి. వీరీ ధర్మాదాయమునుండి అనేకమంది బీదవిద్యార్థులకు సహాయ మొనరించుచున్నారు. బీదవిద్యార్థులకు మధ్యాహ్న భోజనములకుగాను కొంత సహాయ మొసంగుచున్నారు.

ప్రత్యేకముగా సాంస్కృతిక కార్యక్రమములు నిర్వ హించుచు పండిత గోష్ఠులు జరుపుచు సాహిత్యసేవ చేయు చున్నారు. ఈ క్షేత్రాధినాథులైన శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేతులైన శ్రీ భావనారాయణస్వామివారి అవ భృధోత్సవమునాడు ప్రత్యేకకార్యక్రమముల నేర్పాటుచేసి సమారాధనలు, బీదలకు అన్నదానము జరుపుచున్నారు.

శ్రీసత్యనారాయణస్వామివారి బ్రహ్మోత్సవములోను, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారి కళ్యాణోత్సములోను, శ్రీ ప్రసన్నాంజనేయస్వామివారి కళ్యాణోత్సవ సందర్భములోను ప్రత్యేకముగా సాంస్కృతిక కార్యక్రమములనేర్పాటుచేసి ధన సహాయ మొసంగుచున్నారు

బీదలైనవారికి దహనసంస్కారములకై ప్రత్యేకముగా సహాయమొనరించుచు హిందూమత సంస్కారములకులోపము కలుగకుండునట్లు చూచుచున్నారు. ఇంతకుముందున్న సత్రి భవనములు శుభకార్యముల కుపయోగపడు చుండుటచే అచ్చట పైతృకాది కార్యముల కిచ్చుట బాగుండదని తలచి ఈ ట్రస్టుబోర్డువారు భవనమునకు పడమర ప్రత్యేకముగా పితృ సంస్కారములు చేసికొనువారి కుపయోగపడునట్లుగా నొక గృహమును నిర్మించిరి. దాని సమీపమున నొక మంచినీటి బావినిత్రవ్వించి నీటి సౌకర్యమునుగూడ గల్గించిరి. ఈసత్రము యొక్క స్థలములోగల పెద్ద వృక్షములకు చుట్టూ అరుగులను నిర్మించిరి. ఇవిబాటసారులకును విహారార్థమై వచ్చినవారికిని కూర్చుండుటకు సుఖముగానుండి ఆనందమును గల్గించుచున్నవి. వికలాంగులైనవారికిని అంగవైకల్యము పొందినవారికిని బీదలకును. అనాథలకు వారి వారి పరిస్థితుల గమనించి ఫండునుండి ఈ ట్రస్టుబోర్డువారు తగుసహాయ మొనరించుచున్నారు. క్రీ॥ శ॥ 1963 సం॥ లో దైవికముగా కల్గిన అధిక వర్షములచే ఇళ్ళువాకిళ్ళు పోగొట్టుకొని బాధపడుచున్న వరద బాధితులకు ఈ ట్రస్టు ఫండునుండి ధర్మకర్తలు 10 వేలరూపాయలకు

పైగా సహాయ మొనర్చి వారిని వరద బాధనుండి కాపాడి తాత్కాలికముగా భోజన సదుపాయమునుకూడా ఏర్పరచిరి.

1962 సం॥ లో శ్రీ భావనారాయణస్వామివారి అనుగ్రహముచే ఈ గ్రామస్థుల అవిరళ కృషిచేత స్థాపించబడిన "ది ఆర్ట్సు కాలేజి బాపట్ల"కుగాను శ్రీమతి ఎలగంబేడు వేదవల్లీ తాయారమ్మగారు వంశపరంపరా ధర్మకర్తగానున్న సమయమున తీర్మానించబడిన 50 వేల (అర్ధలక్ష) రూప్యములను ప్రస్తుతము ధర్మకర్తలుగానున్న శ్రీ ఎలగంబేడు యతిరాజులు నాయుడుగారును శ్రీ యడవల్లి సూర్యనారాయణగారును శ్రీ బ్రహ్మాండం పురుషోత్తముగారును, శ్రీ శీరం రాధాకృష్ణ మూర్తిగారును వర్ఘు శివరామయ్య గారును కలసి కీ॥ శే॥ పేరం గరుడాచలం నాయుడుగారు ట్రస్టు ఫండునుండి ట్రస్టు బోర్డు అధ్యక్షులైన శ్రీ యడవల్లి సూర్యనారాయణగారి ద్వారా "ది బాపట్ల ఆర్ట్సుకాలేజికి" భూరి విరాళ మొసంగి ఈ పట్టణమునన్న విద్యార్థులందరకు ఉన్నత విద్యాభ్యాసావకాశము లేర్పడుటకు తోడ్పడిరి. నేడీ తూర్పుసత్రము బాటసారులకేగాక గ్రామస్థులు మొదలైనవారికికూడ కోరిన సౌకర్యములకు అనువుగానుండి ఈ క్షేత్రమున కల్పవృక్షమై విరాజిల్లుచున్నయది.

# రామానుజ కూటము క్రీ. శ. 1861

స్థాపకులు

క్రీ॥ శే॥ మాకర్ల వెంకటస్వామినాయుడుగారు బందరు

ఈ రామానుజకూటము శ్రీ భావదేవుని ఆలయము నకు 25 గజములదూరములో సన్నిధి వీధియందు ప్రాఙ్ముఖముగాగలదు, దీనిని బందరు గ్రామవాస్తవ్యులయిన మాకర్ల వెంకటస్వామినాయుడుగారు స్థాపించిరి. వీరు విశిష్టాద్వైత మత సాంప్రదాయులగుటచే శ్రీవారిసన్నిధి కతిసన్నిహితముగనుండునట్లు వైష్ణవ మతానుసారముగా రామానుజకూటమను పేరుతో క్రీ॥ శ॥ 1861 సం॥ లో నిర్మించి దీనిపోషణకై భూవసతి నొసంగి స్వామివారి కృపకు పాత్రులయిరి.

క్రీ॥ శ॥ 1938 నుండి పన్నెండు వత్సరములు యిచట శ్రీ శ్రీ శ్రీ ప. ప. అనుభవానంద స్వాములవారిచే శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు తాత్కాలికముగా ప్రతిష్టింపబడి సర్వదేవీదేవతా సాంప్రదాయముల ననుసరించి పూజాదులు జరుపబడినవి వీరిచట భక్తులందరకు సాధన రహస్యముల నుపదేశించి కృతార్థులగావించియుండిరి.

ఈ రామానుజ కూటము శిధిలమైనందున కోకా కృష్ణారావు నాయుడుగారు మేనేజిమెంటుచేయుచు నూతన భవన నిర్మాణముగావించిరి. క్రీ॥ శ॥ 1959 సం॥ లో ముందు భాగము కొట్లుగా నిర్మించబడినందున ఆదాయముపెరిగి నూతన శోభల వెదజల్లుచు ఈ సత్రము ప్రకాశించుచున్నది. ప్రస్తుత మీరామానుజకూటము పాపినేని భావనారాయణగారి యాజమాన్యమున నడుచుచున్నది. ఇందు వైష్ణవులకేకాక తదితరులకుకూడ సౌకర్యములు కల్పించబడుచున్నవి. దీని ఫండునుండి వేసవియందు చలివేంద్రము నడపబడుచున్నది.

# బ్రంహ్మాండం బాపయ్య పంతులుగారిధర్మ సత్రము

క్రీ॥ శ॥ 1901

స్థాపకులు

క్రీ॥ శే। బ్రింహ్మాండం బాపయ్యపంతులుగారు బాపట్ల.

ఈ సత్రిము శ్రీ భావదేవుని ఆలయమునకు ఈశాన్య దిక్కుగా 1 ఫర్లాంగు దూరమునను శ్రీ సోమేశ్వరస్వామి ఆలయమునకు ఈశాన్యములో 25 గజముల దూరములోను పశ్చిమాభిముఖముగగలదు. దీనిని బాపట్ల వాస్తవ్యులయిన బ్రింహ్మాండం బాపయ్య పంతులుగారు క్రీ॥ శ॥ 1901 లో స్థాపించిరి. దీనిపోషణకై ఎ 5-73 సెంట్లమాగాణి భూమిని ఏర్పాటుచేసిరి. వీరు యిట్టి అనేక ధర్మ దైవకార్యాదులొనరించి శాశ్వతకీర్తి నార్జించిరి. వీరి కుమారులైన వేంకటలక్ష్మీ నారాయణరావు పంతులుగారు క్రీ॥ శ. 1917 సం॥ లో శ్రీ సోమేశ్వరస్వామివారి ఆలయములో శ్రీ బాలాత్రిపుర సుందరీసహిత అభినవ సోమేశ్వరస్వామిని గణాధిపతిని, నందీశ్వరుని, ధ్వజ స్తంభాదులను ప్రతిష్ఠించిరి. వీరు క్రీ. శ. 1959 సం॥లో తండ్రిగారిచే స్థాపించబడిన ధర్మసత్రములో ముందు భాగమునకు జీర్ణావస్థ కలిగినందున నూతనముగా నొకభవనమును నిర్మించి యాత్రికులకును, బాటసారులుకును విశేష సౌకర్యములు కలుగునట్లుచేసిరి. ఈ సత్రిము శివకేశవుల ఆలయములకు అత్యంత సమీపమునందుండి బ్రహ్మోత్సవాదులకు వచ్చు యాత్రికులకును, సింధుస్నానమునకై వచ్చువారికిని చాల సౌకర్యముగానున్నది. ఇదియుగాక బాపట్ల రైలుస్టేషనుకు కూడా అత్యంత సమీపముగానుండుటచే యాత్రికులైనవారికి ప్రయాణ సౌకర్యమునకు వీలుగానుండి విరాజిల్లుచున్నది.

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ సత్రము (క్రీ॥ శ॥ 1914

స్థాపకులు

శ్రీ బాపట్ల ఆర్యవైశ్యసంఘమువారు

ఇది శ్రీ భావదేవుని ఆలయమునకు ఆగ్నేయ దిశలో సుమారు 3 ఫర్లాంగుల దూరములో జి. బి. సి రోడ్డున కుత్తరమున దక్షిణాభిముఖముగ గలదు. దీనిని క్రీ. శ. 1914 సం॥లో శ్రీ బాపట్ల ఆర్యవైశ్య సంఘము తరపున అప్పటికి పెద్దలుగానున్న బొమ్మిశెట్టి వెంకటరత్నంగారును. శ్రీ రాములుగారును వేముల సుబ్బారాయుడుగారును, బొలిశెట్టి ఆదినారాయణగారు భృగుమళ్ళ ముత్తేశంగారును పొన్నూరు కోటయ్యగారు బొమ్మిశెట్టి వీరభద్రుడుగారును కలసి విరాళములు సేకరించి నిర్మించిరి

క్రీ. శ. 1942 సం॥లో ఇందు "మారుతీ గ్రంధాలయ" మను పేరుతో నొక గ్రంథాలయము స్థాపించబడినది. ప్రస్తుత మీగ్రంథాలయము కోళ్ళపూడి నాగేంద్రగుప్తగారి అధ్యక్షత న దినదినాభివృద్ధి చెందుచున్నది.

క్రీ. శ. 1955 సం॥ లో బొలిశెట్టి సీతారామయ్యగారు అధ్యక్షులుగను బొమ్మిశెట్టి రాఘవయ్యగారు ఉపాధ్యక్షులుగను, బూర్లె ఆదినారాయణగారు, గుంటూరు నాగేశ్వరరావుగారలు కార్యదర్శులుగా నొకకమిటీ నేర్పరుచుకొని సంఘము తరపున ఈ సత్రమునకు పై అంతస్థును నిర్మించి విద్యుద్దీపాలంకరణాదుల చేయించి నూతనత్వమును కల్గించిరి.

ఈ సంస్థకు కొంతకాలము అధ్యక్ష ఉపాధ్యక్షులుగా బొమ్మిశెట్టి రాఘవయ్యగారు, బూర్లె లోకనాథంగారును,

కార్యదర్శులుగా బొమ్మిశెట్టి వెంకటరత్నంగారు, వక్కలగడ్డ కోటయ్యగారును, కోశాధికారిగా కొత్తమాసు లక్ష్మయ్య గారును ఉండి తక్కిన కార్యవర్గముతో కలసి అభివృద్ధికల్పించిరి. వీరితో పాటు వేముల కృష్ణయ్యగారు, గెల్లి ఆదిశేషుగారు బొమ్మిశెట్టి సుబ్రహ్మణ్యంగారు మొదలయినఉత్సాహవంతులు పూనుకొని మందిరమునకు నూతన శోభను చేకూర్చిరి.

ప్రస్తుతము అధ్యక్షులుగా బొలిశెట్టి సీతారామయ్య గారును ఉపాధ్యక్షులుగా కోళ్ళపూడి సుబ్రహ్మణ్యంగారును కార్యదర్శులుగా గెల్లి సత్యనారాయణగారు, బొమ్మిశెట్టి వెంకట లక్ష్మీనారాయణగారును కోశాధికారిగా బూర్గెర త్తయ్య గారును యుంటూ అమ్మవారి ఆలయమును నిర్మింపదలచి కృషి చేయుచున్నారు.

ది 7-8-1959 ఈ సంస్థయందు 250 మంది సభ్యులతో శ్రీ "వాసవి కన్యకాపరమేశ్వరి అన్నదాన సమాజ" మొకటి స్థాపించబడినది. ఇందు ప్రతిసోమవారము 50 మంది వికలాంగు లకు అన్నదానమును, నిత్యము వైశ్యేతరులకుకూడ సదావర్తి యివ్వబడుచున్నది. దీనికి అధ్యక్షులుగా డా॥ సంకా వెంకట చలపతిరావుగారును కార్యదర్శులుగా తడికమళ్ళ వెంకటేశ్వర్లు గారును, జూలగంటి సత్యనారాయణగారునుయున్నారు.

బాపట్ల ఆర్యవైశ్య సంఘమువారు ఈక్షేత్రాధిపతియైన శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీ సమేతులైన శ్రీ భావనారా యణస్వామివారి బ్రహ్మోత్సవములో 7వ రోజున పొన్న మాను సేవను అధ్యయన ఉత్సవములలో 9వ రోజు ఉత్సవ మును, శ్రీ సోమేశ్వరస్వామివారికి బ్రహ్మోత్సవములో 8వ

రోజున ఎదురుకోల ఉత్సవము, కళ్యాణమును, వృషభ వాహనోత్సవమును ప్రతివత్సరము అత్యంతభక్తితో శాశ్వతముగా చేయించుచున్నారు. వీరు ఈమందిరమున శ్రీరామనవమి ఉత్సవములను నవరాత్రియందు అమ్మవారికి పూజాదులను మహాత్ముల జయంతులను పండుగలలో విశేష ఉత్సవములను అలంకారాదులను చేయించుచు భక్తుల కత్యంతానందమును చేకూర్చుచున్నారు.

నవరాత్రిలలో అమ్మవారికి పూజలు జరుపుటకై బొమ్మిశెట్టి సుబ్బయ్యగారిభార్య భ్రమరాంబ అనునామె బజారునందుగల కొట్టు నొకదానిని ధర్మముచేసెను. దానిని వికృయించి దానిపైవచ్చు ఆదాయముతో దాతపేరున పూజాదులు జరుపుచున్నారు.

ఈ సత్రమును "శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి గుడి" యనికూడ పిలుచు నలవాటుకలదు ఇందుదాదాపు 10 వేల రూపాయలకుపైగా పాత్రసామాగ్రి లుకలవు. వీటిని గ్రామస్థులకు అన్నికార్యములందును అద్దెలకిచ్చుచు దానిపైవచ్చు ఆదాయమునుకూడాచేర్చి దైవ ధర్మకార్యములకు వినియోగించుచుందురు.

క్రీ॥ శ॥ 1964 సం॥ లో శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ ఆలయ నిర్మాణముచేయ సంకల్పించి అధ్యక్షులుగా బొమ్మిశెట్టి రాఘవయ్యగారు కార్యదర్శులుగా కోళ్ళపూడి సుబ్రహ్మణ్యం గారు. బూర్లె రత్తయ్యగారును కోశాధికారిగా కోళ్ళపూడి కాశీ విశ్వనాథంగారునుకలసి కమిటీగాఏర్పడి విరాళముల సేకరించుచు ఆలయనిర్మాణమునకై కృషియుచున్నారు. నిర్మాణముగానున్న ఆలయమునకై బూర్లె రత్తయ్యగారు సుమారు ఆరువేల

...ను, శ్రీ గాయత్రి అమ్మవారిని, శ్రీ శంకరా ... వారిని ప్రాముఖ్యముగా ప్రతిష్ఠించిరి. ఈ సంస్థకు ... ంతం ...పయ్యగారి ధర్మపత్ని శ్రీమతి రామా ... గారును వారి కుమారులు వేంకటలక్ష్మీనారాయణ ... లుగారు (ఉపాధ్యక్షులు) 12 ఎకరముల మాగాణి ... ధర్మముగా ఇచ్చిరి.

శ్రీ శ్రీ 1929 సం॥ లో పై కట్టడములకు పడమర ... లో ధర్మకర్తారక శ్రీ వీరవల్లి అయ్యవారు (ప్లీడర్లు) ... వారి ధర్మముతో "అన్నపూర్ణామందిరమను" పేరుతో ... వసతిగృహమును (హాస్టలు) కట్టించిరి, ఇపుడు ... పై భాగమున "యమునానంద" గదులను పేరుతో ... వసతిగదులు నిర్మించబడినవి. ది 23-4-1958 న ... వములో ఈ విద్యాలయ స్థాపకులైన శ్రీశ్రీశ్రీ ప.ప. ... వారి విగ్రహము ఆగమోక్తముగా ... ప. ప. బ్రహ్మానంద సరస్వతీస్వాములు (పూర్వాశ్రమ ... రాజు నరసింహారావు) వారిచే ప్రాముఖ్యముగా ... ంచబడినది

శ్రీ శ్రీ 1960 సం॥ లో దత్తమందిరమునకు దక్షిణ ... మున "శ్రీరామ శరణ్" అనుమంటపము నిర్మాణముకాబడి ... 13-4-1961 న ఈమంటపమును శ్రీ శ్రీ శ్రీ ప. ప. ... శంకరాచార్య శ్రీ మదభినవ విద్యాభారతీ స్వాముల ... (శృంగేరి పీఠాధిపతి) ఆవిష్కరించిరి. వీరిసమయము ... ధర్మసంస్థాపనలమైన ఈ క్షేత్రప్రభావమును విని ... దేవుని సన్నిధికి ఆలయ మర్యాదలతో విచ్చేసి స్వామి ... ఆర్ష సాంప్రదాయములగూర్చి మహోపన్యాసము ... ఈ క్షేత్రములోని ప్రజలను కృతార్థులగావించిరి.



పరహంస పరివ్రాజకాచార్య
శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానంద తీర్థులవారు
బాపట్ల శ్రీ శంకరవిద్యాలయ స్థాపకులు

ఈ సంస్థయందలి విద్యార్థులకు ఉచిత విద్యావసతియే గాక గృహవసతి, భోజనవసతి వైద్యవసతులుకూడకలవు. ఈ సంస్థకు ఆయుర్వేదవైద్య భిషగ్వరులైన శ్రీమాన్ డా॥ నల్లూరి వెంకటరంగాచార్యులు (R. M. P.) గారు వైద్యులుగా నుండి వైద్యసహాయము నొసర్చుచున్నారు,

నేటికి ఈ సంస్థనుండి 500 మందికి పైగా వేదవిద్య నభ్యసించియుండిరి యిందునేడు వేదమున ఘనాంతమువరకును శాస్త్రమున భాషాప్రవీణ ప్రవేశపరీక్షవరకును స్మార్తములో షోడశకర్మ విద్యలున్నూ నేర్పబడుచున్నవి. 1963 నుండి ఈ విద్యాలయములో జట, ఘన, తరగతులు ఏర్పాటుచేసి నందున "వేదకళాశాలగా" స్థాయిహెచ్చి అభివృద్ధినందు చున్నది. ఈ సంస్థకు ప్రతిసంవత్సరము షుమారు 10 వేల రూపా యల వరకు ఆదాయమువచ్చుచున్నది.

ప్రతిసంవత్సరము ఈసంస్థ వార్షికోత్సవమును ప్రతిమార్గ శిర శుద్ధ ఏకాదశినుండి పౌర్ణిమివరకు దత్తజయంతి వైశాఖమాస మున శంకరజయంతి, ప్రతిష్ఠాపకులైన శ్రీ బ్రహ్మానందతీర్థుల వారి జయంతియు జరుపుచుందురు ఈ సమయములలో ప్రస్థాన త్రయముపై గొప్పగొప్ప పండితులచే ఉపన్యాసాదికము లిప్పించబడుచుండును. ప్రస్తుతమీవేదకళాశాలకు అధ్యక్షు లుగా శ్రీ శ్రీ శ్రీ ప. ప. త్రివిక్రమ రామానంద భారతీ స్వాములు (కురుతాళం పీఠాధిపతి) వారును, ఉపాధ్యక్షులుగా శ్రోత్రియందారు శ్రీ బ్రింహళ్మడం వేంకటలక్ష్మీనారాయణరావు పంతులుగారును, కార్యదర్శిగా శ్రీ ప్రాత్తూరి లక్ష్మీనారాయణ శర్మగారు సంయుక్త కార్యదర్శిగా శ్రీ ఏకాసీతారామయ్య గారును పనిచేయుచు తక్కిన సభ్యులతో కలసి ఈ సంస్థను విజయవంతముగా నడుపుచున్నారు.

# శ్రీ రామకృష్ణ పరమహంస మందిరము క్రీ.శ. 1933
## శ్రీ సహజానంద గ్రంధమాల

స్థాపకులు.

శ్రీ శ్రీ శ్రీ ప. ప. అనుభవానంద స్వాములవారు.

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామి ఆలయవీధిలో [illegible] ఫర్లాంగు దూరములో రోడ్డునకు దక్షిణమున [illegible] భాగమున పశ్చిమాభిముఖముగ గలదు. ఈ మందిరము శ్రీ శ్రీ శ్రీ ప. ప. అనుభవానంద స్వాములవారిచే నిర్మించ[illegible] వారి ఆధ్వర్యముననే నిర్వహింపబడుచున్నది.

క్రీ. శ. 1937 సం। లో శ్రీ అనుభవానందస్వాముల వారు శ్రీ రామకృష్ణమఠ సాంప్రదాయకముగా సన్యాసాశ్రమ [illegible] పుచ్చుకొని ఈ పట్టణమునకు విచ్చేయగా శ్రీవారి [illegible] తపస్సున కనుకూలమగునట్లు అద్దంకివారి [illegible] లో కుటీరమేర్పరచిరి. 1938 సం॥ లో గ్రీష్మమున మౌన [illegible] వహించి తరువాత శ్రీ భావనారాయణస్వామి సన్నిధిన [illegible] ఉపన్యాసములపాటు శ్రీ రామకృష్ణ పరమహంస దేవుని [illegible] సందేశముల నుపన్యసించి భక్తుల కానందము చేకూర్చిరి. ఈ సమయమున 1-8-1938 న శ్రీ శారదా సేవాసంఘమను [illegible] నొక స్త్రీ సమాజమును 21-8-1938న శ్రీ రామకృష్ణ [illegible] సమాజమను పేర రెండవ సమాజమును శ్రీ స్వామివారి ఆధ్వర్యమున ఏర్పరచి ఆధ్యాత్మిక జిజ్ఞాసాకారకములగు ఉపన్యా[illegible] కార్యక్రమములు నిర్వహించుటకును ఆధ్యాత్మిక గ్రంథా[illegible]లయమును నెలకొల్పుటకుగాను ఏకైక లక్ష్యముతో కలసి పనిచేయుచు ఒకే సంస్థగా రూపొందినవి.

ఈ సమయమున స్థానిక చిత్రకారులగు పసుపులేటి అంజయ్యగారు శ్రీ రామకృష్ణుని విగ్రహమును రూపొందించి

స్వామివారికి సమర్పించగా వారు దాని నుచితరీతి సవరణలు గావించి అప్పటికి తాత్కాలిక వసతి ప్రదేశమయిన రామానుజ కూటమునసుంచి 1949 వరకు 12 సంవత్సరములు ఆమూర్తికి సర్వదేవీదేవతా సాంప్రదాయముగా పూజల జరిపించుచు భక్తుల కానందము చేకూర్చియుండిరి.

శ్రీ స్వామివారు శ్రీ రామకృష్ణ పరమహంసదేవునకు స్థిరమైన మందిర నిర్మాణము గావింపదలచి ప్రస్తుత నివేశనమైన విశాలస్థలమునుకొని అందు మందిరనిర్మాణముగావించి ది 12-12-49 న శ్రీ శారదా జయంతినాడు రామకృష్ణవిగ్రహమును శాస్త్రోక్తముగా ప్రతిష్ఠగావించిరి. ది 6-3-1959 లో శ్రీ స్వామివారిచే తయారు చేయబడిన శ్రీ శారదాదేవి విగ్రహమును శ్రీ శారదా శతవార్షిక జయంతి సందర్భములో శ్రీ రామకృష్ణ జయంతినాడు శాస్త్రోక్తముగా ప్రతిష్ఠించిరి. నాటినుండి ఈ సంస్థ దినదినాభివృద్ధినందుచు సర్వదేవతా సంబంధమగు పండుగలకు పూజాదులుజరుగుచు ప్రతిఫాల్గుణశుద్ధ విదియ ప్రభృతి పంచాహ్నికముగా శ్రీరామకృష్ణ జయంతి ఉత్సవములు జరుగుచున్నవి. ఈ సమయములలో అనేకమంది పండితులు సన్యాసులు గాయకులు హరిదాసులువచ్చి ఈ ఉత్సవాదులలో పాల్గొనుట ప్రత్యేకవిశేషమైయున్నది.

శ్రీ అనుభవానందస్వాములవారు సర్వశక్తి సంపన్నులు సర్వజ్ఞులు, తపోసంపన్నులగుటయేగాక సంఘకార్యనిర్వహణ పాలనలయందును నిపుణులు. మఱియు దేశవ్యాప్తకీర్తి నార్జించిన ప్రసిద్ధవక్తలు, గ్రంథరచయితలు వీరు రచించిన సాధన రహస్యము సర్వసిద్ధాంత సౌరభమను గ్రంథములను తదితర గ్రంథములను ఎఱుగని ఆంధ్రుడుండడు. వీరు భారతదేశమునసేగాక ఇతరదేశములయందుకూడ గ్రంథములద్వారా ప్రసిద్

కెక్కిన మహనీయులు. వీరు సుమారు 10 సంవత్సరముల వయస్సు బాలికనుచేరదిసి ఆమెకు సన్యాస మొసంగి జ్ఞానబోధ గావించి శ్రీ శ్రీ శ్రీ మాతాజీ త్యాగీశానందపురిగా రూపొందించి ఆధ్యాత్మిక జ్ఞానమునందించి ప్రసిద్ధవక్తగను, రచయితగ నొనరించిరి. వీరిరువురును భారతదేశమున పర్యటన చేయుచు జిజ్ఞాసువుల ప్రబోధించుచు అనేక అమూల్యమయిన గ్రంథములరచించి సాధకలోకమున కందించుచు పరమోప కారముచేయుచు జగద్విఖ్యాతినందియున్నారు.

వీరు కొంతకాలము భావపురి (బాపట్ల) యందును, కొంతకాలము విశాఖజిల్లాలోని భీమునిపట్నమున నిర్మింపబడిన శ్రీ శారదా రామకృష్ణమందిరమునందును. కొంతకాలము దేశపర్యటనము గావించుచు భక్తులతరింపజేయుచును కొంతకాలము రచన ముద్రాపణములయందును వినియోగించుచుందురు.

శ్రీ అనుభవానంద గ్రంథమాలయనుపేరుతో నొక గ్రంథ మాలనుకూడ స్థాపించి జయప్రదముగా నడుపుచున్నారు. ప్రస్తుతమీమందిరము శ్రీ స్వాములవారి నిర్వహణలోనుండి అనేకమంది భక్తుల ప్రోత్సాహములచే మంటపాదులు నిర్మింప బడి దేదీప్యమానముగా వెలుగొందుచున్నది.

శ్రీ॥ శ॥ 10 4-1961 శృంగేరీ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ ప. ప. జగద్గురు శంకరాచార్య శ్రీ మదభినవ విద్యాభారతీ స్వాములవారు ఈ మందిరమునకు విచ్చేసి భక్తులకు సద్బోధ గావించిరి. ప్రతిఆదివారమునాడు యిచట ఉపన్యాసములు జరుగుచు భక్తుల నాకర్షించుచు విరాజిల్లుచున్నది.

ఈ క్షేత్రమునగల శ్రీరామమందిరముల యొక్కయు ఇతర మందిరములయొక్కయు చరిత్రలనుకూడ నాకందినంతవరకు మీకు తెలుపుచున్నాను.

## శ్రీరామ మందిరము భీమావారివీధి క్రీ॥ శ। 1925

ఈ మందిరము శ్రీభావనారాయణస్వామివారి ఆలయ మునకు ఆగ్నేయదిశలో సుమారు అరమైలు దూరమునకలదు. దీనికొరకై క్రీ॥ శ॥ 1925 సం॥లో జిట్టా అచ్చమ్మ అనునామె నుండి స్థలమునుకొని అప్పటికి పెద్దలుగానున్న శిఖరం కోటయ్య, కత్తుల వెంకటపతి, లేళ్ళ సోమయ్య అన్నం కోటిలింగం అను వారలు విరాళములు సేకరించి అతిభక్తితో ఉత్తరముఖముగా నుండునట్లు ఈ మందిరమును నిర్మించిరి. అప్పటినుండి ఆవీధి లోనివారు పెద్దల నెన్నుకొనుచు భక్తులనుచేరదీసి అత్యంత భక్తితో పూజలగావించుచుండిరి. ఈ మందిరమునకు విద్యుద్దీపాలంకరణకూడ గావింపబడినది. ఇచ్చట ప్రతిశనివారము భజనయు శ్రీరామనవమికి కళ్యాణోత్సవాదులు నవరాత్రుల యందు అమ్మవారికి పూజలు జరుగుండును. ఈ పండుగలలో విశేషాలంకారములు చేయించుచు సత్కథా కాలక్షేపముల జరిపించుచు స్వామిని సేవించుచున్నారు.

## శ్రీరామమందిరము శీలంవారిపాలెం క్రీ॥ శ॥ 1930

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామివారి ఆలయ మునకు ఆగ్నేయదిశలో సుమారు ½ మైలు దూరమునను, శ్రీ ప్రసన్నాంజనేయస్వామివారి ఆలయమునకు తూర్పుగా 1½ ఫర్లాంగుల దూరమునసుకలదు. ఈ పాలెమునగల శీలంవారి కుటుంబములోని పెద్దలును ఇతరులునుకలసి విరాళములు సేకరించి ది 22-11-1930 న దక్షిణముఖముగా నిర్మించిరి. ఈ మందిరమందుకూడ భజనలు శ్రీరామనవమి కళ్యాణోత్సవములు పూజలు మొదలగునవి వైభవముగా జరుగుచున్నవి.

# శ్రీరామమందిరము జగన్నాథపురం (బెస్తపాలెం)

క్రీ॥ శ॥ 1935

ఈ మందిరము, (శ్రీ) భావనారాయణస్వామి ఆలయమునకు షుమారు 1/2 మైలు దూరములో తూర్పుగా 1935 సం॥ మార్చి నెలలో నిర్మించబడినది. 1934 సం॥ దీనికి కీ॥ శే॥ గొల్లపెద్ద సుబ్బయ్య అను భక్తులు శంఖుస్థాపనను గావించిరి. ఈమందిరమునకు శ్రీమతి చిలంకుర్తి రామాంజనేయమ్మగారు, శ్రీ శ్రీరాములునాయుడుగారు అను దంపతులు పూజలకును, ఉత్సవాదుల కుపయోగపడునట్లుగా (శ్రీ) సీతాలక్ష్మణ హనుమత్సమేత (శ్రీ) కోదండరామస్వామి వారి దారువిగ్రహములను చేయించి సమర్పించిరి. వీరు ఈ మందిరమునకేగాక అనేక రామమందిరములకుగూడ విగ్రహములను పటములను మంగళద్రవ్యములను సమర్పించియుండిరి. వీరి ప్రోత్సాహముననే ఈ మందిరమునకు విద్యుద్దీపాలంకరణముగూడ గావింపబడినది. వీరికి "(శ్రీ)రామభక్త" అను సార్థక బిరుదముగూడ కలదు. 1957 సం॥లో పిట్టు రెడ్డెమ్మగారను భక్తురాలు మందిర నిర్వాహణమునకై ఒక ఎకరము మాగాణిభూమిని సమర్పించిరి.

శ్రీయడవల్లి సూర్యనారాయణగారు (పవిత్రము తూర్పు సత్రము ట్రస్టుబోర్డు అధ్యక్షులు, మునిసిపల్ కౌన్సిలరు)గారు ఈమందిరమును అభివృద్ధిపరచి ప్రత్యేకమయిన నొకగదినికట్టించి విశేషవైభవమును చేకూర్చుటయేగాక అచటనున్న వస్తుజాలమునకు భద్రతగూడ కలిగించిరి. ఇచట నిత్యము దీపారాధనలు భజనలు. (శ్రీ) రామనవమికి కళ్యాణమును గ్రామోత్సవమును తరువాత అన్నదానమును ఇచటనున్న నూతసంఘము

వారు పూనుకొని అత్యంత శ్రద్ధాభక్తులతో జరుపుచున్నారు.

క్రీ॥ శ॥ 1958 సం॥లో నూతసంఘమువారు ఈ మందిరమునకు దక్షిణభాగమునగల గదియందు వారి కులదేవతలగు (శ్రీ) కామమ్మ, (శ్రీ) మారయ్యఅనువారి దారువిగ్రహములను ప్రతిష్టించిరి. అప్పటినుండి నేటివరకు వీరికి అట్లతద్దెనాడు ఊయల ఉత్సవమును జరుపుచున్నారు ఈ సందర్భమున సువాసినులకు (ముత్తైదువలు) మూసివాయనములు పసుపుకుంకుమలు పంచుట వీరి ఆచారమైయున్నది. ప్రతి యుగాదినాడు వీరు కులదేవతలకు గ్రామోత్సవము జరుపుచుందురు. వీరిశ్రద్ధాభక్తులచే ఈమందిరము దినదిన ప్రవర్ధమానమై వెలుగొందుచున్నది.

## శ్రీ రామమందిరము - రైలుపేట క్రీ॥ శ॥ 1938

ఈ మందిరము (శ్రీ) భావనారాయణస్వామివారి ఆలయమునకు ఉత్తరములో సుమారు 3 ఫర్లాంగుల దూరములో రైల్వేలైను దాటినతర్వాత దామర్ల వారివీధియందు తూర్పు ముఖముగా కలదు. దీనిని 1938 సం॥ లో (శ్రీ) నృసింహస్వామివారి భక్తులయిన స్తానం ఆదెయ్యగారు రైలుపేటలోనున్న దామర్ల అయ్యమ్మ, వెంకటస్వామి అనువారలను కలుపుకొని చందాలు వసూలుచేసి మందిర నిర్మాణముగావించిరి. నాటినుండి ఇచ్చట నిత్యదీపారాధనాదులు జరుగుచు (శ్రీ)రామనవమికి కళ్యాణఉత్సవములు జరుగుచున్నవి. 1952సం॥లో ఈమందిరమునకు ముందుభాగమున వరండా నొకదానిని గోపాళం (శ్రీ)రాములుగారు కట్టించి అభివృద్ధిచేసినారు. ఇచ్చట భజనలు, మొదలగునవి నేటికిని జరుగుచుండును. ఈ ప్రాంతమందలి భక్తులెల్లరు ఈ మందిరాభివృద్ధికై కృషిచేయుచున్నారు.

## శ్రీ భక్తాంజనేయ స్వామిమందిరము క్రీ॥ శ॥ 1938

### సముద్రతీరము

స్థాపకులు

కీ. శే. పసుపులేటి అంజయ్యగారు

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామివారి ఆలయమునకు షుమారు 5 మైళ్ళదూరములో ఈ క్షేత్రమునకు దక్షిణ సరిహద్దుగానున్న పాక్సముద్రతీరమున ప్రాఙ్ముఖముగానున్నది. ఈక్షేత్రమునందున్న సుప్రసిద్ధచిత్రకారులగు పసుపులేటి అంజయ్యగారనుభక్తులు అత్యంతభక్తితో పురుష ప్రమాణాధికముగా శ్రీ భక్తాంజనేయ స్వామివారి విగ్రహమును తయారుచేసి వివిధవర్ణములతో చిత్రీకరించి సింధుసమీపమున మందిరమొకటి నిర్మించి 1938 సం॥లో అందు శ్రీ భక్తాంజనేయ స్వామివారి విగ్రహమును ప్రతిష్ఠించిరి. ఈసత్కార్యమునకై ఈక్షేత్రప్రజలనేకులు తమతమ విభవానుసారముగా సహాయముగావించిరి.

ప్రతిసముద్రస్నానమునాడును శ్రీవారికి అభిషేకము పూజాదులు జరుగుచుండును. ఆ నాడు స్నానానంతరమనేక ప్రజలు స్వామినిసేవించి నివేదనల నొసంగుదురు. ప్రతినిత్యమచటనున్న బెస్తలు స్వామికి దీపారాధనలుచేయుచు శ్రీ భక్తాంజనేయస్వామివారిని సేవించుచున్నారు. ఈ పట్టణప్రజలు ఈ స్వామికికూడ నిత్యనైవేద్య దీపారాధనలకై తగు ఏర్పాట్లు చేయవలెనని సంకల్పించి కృషిచేయుచున్నారు. ప్రస్తుతమీమందిరము స్థాపకులైన అంజయ్యగారి సతీమణియైన అంజమ్మగారి నిర్వహణలోనుండి దినదినాభివృద్ధిచెందుచున్నది.

## శ్రీరామ మందిరము-కాకుమానువారి పాలెం 1947

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామివారి ఆలయ
మునకు దక్షిణముగా సుమారు 6 ఫర్లాంగుల దూరములో
కాకుమాను వారి పాలెములో కలదు. దీనిని 1947 సం॥ లో
ఈ పాలెమునగల భక్తులు విరాళముల సేకరించి ఉత్తరముఖ
ముగానుండునట్లు నిర్మించిరి. నిత్యదీపారాధనలు, భజనలు
శ్రీరామనవమికి కళ్యాణోత్సవములు అతివైభవముగాజరుగును.

## శ్రీరామమందిరము కొట్రావారివీధి క్రీ॥ శ॥ 1953

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామి ఆలయము
నకు పశ్చిమముగా సుమారు 4 ఫర్లాంగులదూరములో
తూర్పుగాగలదు. దీనిని కొట్రా కుటుంబముల వారందరును
శ్రద్ధతో విరాళములుసేకరించి నిర్మించిరి. నిత్యదీపారాధనాదులు
చేయుచు శ్రీరామనవమికి కళ్యాణోత్సవములు జరుపుచుందురు.

## శ్రీరామమందిరము తూర్పు సత్రమువద్ద 1957

ఈ మందిరము శ్రీ భావనారాయణస్వామి వారి
ఆలయమునకు తూర్పుగా సుమారు 7 ఫర్లాంగులదూరములో
తూర్పు సత్రమునకుదాపుగా జి. బి. సి రోడ్డు బందరు రోడ్ల
మధ్యలోగలదు. ఇది క్రీ॥ శ॥ 1957 సం॥ లో శ్రీరామనవమి
నాడు ప్రారంభింపబడి నేటివరకు నిత్యదీపారాధనలు జరుగుచు
ప్రతిశనివారం భజనలు, శ్రీరామనవమికి కళ్యాణోత్సవములు
జరుగుచున్నవి. ప్రస్తుత మీమందిరమొక పర్ణశాలయందుండ
బడినది. ఈ ప్రాంతమందలి భక్తులెల్లరు ఉత్సాహముతో
మందిర నిర్మాణముగావించదలచి విరాళములు సేకరించు
చుండిరి. స్వామి అనుగ్రహముచే తూర్పుదిశయందుగూడ ఈ
మందిరము విరాజిల్లగలందులకు భక్తులు కృషిచేయుచున్నారు.

# శ్రీ శ్రీనివాసమందిరము విజయలక్ష్మీపురము

—క్రీ॥ శ॥ 1961—





ఈమందిరము శ్రీ భావనారాయణస్వామివారి ఆలయమునకు షుమారు 7 ఫర్లాంగుల దూరమునను, శ్రీ సత్యనారాయణస్వామివారి ఆలయమునకు ఆగ్నేయదిశగా ఫర్లాంగు దూరమునను విజయలక్ష్మీ పురమున ప్రాఙ్ముఖముగాగలదు. పరమ భక్తులైన శ్రీ ఉడుతా సుబ్రహ్మణ్యంగారు తమ నివేశన స్థలములో కొంతభాగము స్వామికి సమర్పించి అందు మందిర నిర్మాణముగావించిరి.

తరువాత దైవజ్ఞశిరోమణులును, విద్వత్కవిశేఖరులును బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి గారితో సంప్రదించి శ్రీ తిరుమలతిరుపతివెళ్ళి శ్రీ శ్రీనివాసుని సేవించి శాస్త్రిగారి నిర్ణయప్రకారము ఆక్షేత్రమందే తయారు చేయబడి సిద్ధముగానున్న చక్కటిదివ్యమంగళ విగ్రహములుగా నేత్ర గోచరమగుచున్న శ్రీ శ్రీనివాసమూర్తుల తామ్రబేరములను (ఉత్సవవిగ్రహములు) చూచి శ్రీ శ్రీనివాసుని అనుగ్రహమును కొనియాడుచు వెంటనే ఆమూర్తులను తీసికొని

వచ్చి శ్రీనివాసమందిరమందు విశిష్టాద్వైత మతసంప్రదాయాను సారము క్రీ॥ శ॥ 1961 సం॥ లో అతివైభవముతో ప్రతిష్ఠాది కములను గావించిరి.

ఈ క్షేత్రవాస్తవ్యులును విశిష్టాద్వైత పండితులును, పరిచారకులును, శ్రీమద్వేదమార్గ పరిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ కొమాండూరి ఇళయవల్లి శ్రీనివాస రామానుజాచార్యులవారి అధ్వర్యమున సమర్థులైన ఋత్విక్కుల సహాయముతో శ్రీ శ్రీనివాసమూర్తికి ప్రతిష్ఠాదికములు జరుపబడినవి. నాటినుండి శ్రీమాన్ ఆచార్యులవారి అధ్వర్యముననే స్వామికి అర్చనాది సర్వకైంకర్యములు సమర్థులైన వైష్ణవోత్తములచే జరుపబడుచున్నవి.

ఈ మందిర నిర్వహణమునకు ఉత్సవాదులు జరుగుటకు గాను ఈ క్షేత్రమందలి అనేకమంది భక్తులు తమతమ విభవానుసారముగా విరాళములుసమర్పించిరి. వీరందరుకలసి స్వామికి విశేషవైభవముగా ఉత్సవాదులు జరుపుటకును మంది రాభివృద్ధిగావించుటకును శ్రీ శ్రీనివాసభక్త సమాజమను పేరనొక సమాజమును స్థాపించి కృషిచేయుచున్నారు. ఈ సమాజము ప్రస్తుతము పింగళ రామారావుగారి అధ్యక్షతన నడుచుచున్నది. ఈ మందిరమున ప్రతికార్తీక శుద్ధమున పంచాహ్నికముగా నిత్యకళ్యాణోత్సవములు పండుగ పర్వదినాములలో విశేషోత్సవములు జరుగుచుండును. ఈసందర్భములలో హరికథా కాలక్షేపములు పురాణోపన్యాసములు విశేషముగా జరుగుచుం డును. అచిరకాలముననే ఈమందిరమున శ్రీ శ్రీనివాసమూర్తి శిలాబేరమునుగూడ (ధ్రువమూర్తిని) ప్రతిష్ఠించుటకై ప్రయత్న ములు జరుగుచున్నవి.

1వ అనుబంధము

# శ్రీ మారుతి ప్రణవాశ్రమము

## శ్రీ ఆంజనేయ సద్గురు పాదుకాక్షేత్రము, సీతారామ పురం. బాపట్ల. 1940

ఇది శ్రీభావనారాయణస్వామి వారి దేవాలయమునకు ఈశాన్య మూలగా 6 ఫర్లాంగుల దూరములో (రైలుపేట) సీతారాం పురములోయున్నది. ఇది శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద యోగీశ్వర ఆంజనేయ రాజయోగఅవధూత సరస్వతి స్వామి వారికి 1940 సం॥ లో శ్రీ రైతా సీతారామయ్యగారిచే వుచిత ముగా నొసంగబడిన నివేశన స్థలమందు శ్రీవారి భక్త బృంద ముచే నిర్మింపబడి 'శ్రీరామ సమర్థ' ధ్వజారోహణము సప్త ప్రహారలతో ప్రారంభింపబడెను. ఒక విశాలమగుతోటయందు శ్రీ శ్రీ శ్రీ సద్గురుబ్రహ్మ శ్రీరామదూత శ్రీ సుబ్రహ్మణ్య స్వామి శ్రీ సత్యనారాయణస్వామి జగద్గురు శంకరాచార్య మందిరములు శ్రీవారిచే స్థాపింపబడెను.

రామనామ సంకీర్తనము, మంత్రజపము, సూర్యనమ స్కారములు భగవద్గీతాపఠనము, పరిచారము అనునవి శ్రీ స్వామి వారియొక్క సందేశసారము. ఇవి ప్రస్తుతము శ్రీ వారి ముఖ్యశిష్యులైన శ్రీకంభంమెట్టు మధుసూదనరావుచేనిర్వహింప బడుచున్నవి శ్రీవారి శిష్యులైన వీరున్ను, శ్రీవారును 1934సం వరకు బాపట్ల గ్రామమునకు క్రొత్త. శ్రీ వారి శిష్యులు ఆసీటుకు వృత్తితో తమస్వగ్రామమైన ఏలూరులో (వ. గోదా వరిజిల్లా) యుండగా ఒకానొక దినమున శ్రీ వారు శిష్యులను బాపట్లలో యికముందు స్థిరనివాస మేర్పరచుకొనమని ఆజ్ఞా పించినందువలన అప్పటి నుండియు శ్రీవారిశిష్యులు బాపట్లలో

స్థిరనివాస మేర్పరచుకొని యిప్పటికి నూతని గృహనిర్మాణము గావించి 'పాదుకాక్షేత్రము' అనుపేర రైలుపేటలో నివసించుచున్నారు. శ్రీ వారున్నూ, వారి శిష్యులును 1934వ సం॥ నుండి 1940 సం॥ వరకున్ను బాపట్ల గ్రామములో ప్రభాత సమయములో నగర సంకీర్తనము తోడి బృందముతో బాపట్ల వీధులలో గావించుట ఎఱుగని వారుండరు.

శ్రీ వారి తత్త్వోప దేశములను, భక్తి ప్రచారమును విని శ్రీవారితో పరిచయ భాగ్యము గల్గిన వారిలో యీగ్రంధ కర్త యొకడైయుండుట తటస్థించినది. శ్రీ వారు యిట్టి ప్రచారము గావించిన తమ ముఖ్య శిష్యులకు ఆశీర్వాదము సల్పి 1941 సం॥ అక్టోబరు 11 వ తేదీన బ్రహ్మీభూతులైరి.

1945 వ సం॥ లో శ్రీ మారుతి ప్రణవాశ్రమ లక్ష్మీభవనమందు శ్రీ వారి యాజ్ఞగా వారి ముఖ్యశిష్యులును తదితర భక్త బృందమును 'శ్రీ సువర్చలా సమేత మన్యుస్వరూప విరాట్స్వరూప మహావీర ప్రతాప పంచముఖ వీరాంజనేయ మహాక్రతుదీక్ష' అనుపేరిట 40 దినములు దీక్ష జరిపిరి. ప్రతిసంవత్సరము శ్రీ వారి పేరిట యుత్సవ కైంకర్యములు శ్రీ మారుతి ప్రణవాశ్రమ లక్ష్మీ భవనము నందును, మందిరములందు పూజా కైంకర్యములున్ను జరుగుచున్నవి ఈ ఆశ్రమము శ్రీ వారి ప్రసాదముగ ఒకప్రయివేటు సంస్థగా శ్రీవారి శిష్యులైన శ్రీ కంభంమెట్టు మధుసూదనరావుచే మరి కొంతస్థలము కొనబడి వారి నాయకత్వమున శ్రీ వారి భక్త బృందము యొక్క సహాకారముతో, శ్రీ వారి జీవిత సందేశ ప్రచారము గావింపబడుచు వుపయోగింపబడుచున్నది. బాపట్ల గ్రామము యొక్క ఆధ్యాత్మిక వికాసమునకు తోడ్పడి ఇచటికి వచ్చేసిన మహనీయులలో శ్రీ స్వామివారు చిరస్మరణీయులు.

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి నిలయం
ఓం శ్రీ సదాశివగురు పురమఠం
రైలుపేట – బాపట్ల క్రీ. శ. 1913

ఇది శ్రీ భావనారాయణస్వామివారి ఆలయమునకు వాయువ్యదిశలో 4 ఫర్లాంగుల దూరములో జమ్ములపాలెం గేటు దాటినతర్వాత 25 గజములదూరమున రోడ్డుకు పడమర తూర్పుముఖముగగలదు. దీనిని స్వస్తిశ్రీ సిద్ధార్థి సం॥ లో క్రీ శ. 1918లో) సహస్రారచక్ర బ్రహ్మజ్ఞాన ధర్మసభాపతి బ్రహ్మశ్రీ హాం, హీం, హూం, హేం, హోం, పరమహంస ఆదివీర బాలసుబ్రహ్మణ్య గురుస్వామీజీ(శ్రీహరి గురుస్వామిజీ) గారును వారి సతీమణి క్షాం, సాం, వీరధర్మ వీశ్వరీనాగజ్యోతి దేపమ్మగారునుకలసి ప్రభుత్వమువారిచే యొసంగబడిన సుమారు 50 సెంట్లు స్థలములో ఈ భవననిర్మాణమునుగావించిరి. ఇందు శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి పీఠము దక్షిణాభిముఖముగా స్థాపించబడినది. దీనిముందు వీర పాపమాంబేశ్వరి పీఠముగలదు. ఈమంటపమునకు ముందున్న మందిరమున దక్షిణాభిముఖముగా అల్లాడుపల్లె వీరేశ్వర, భద్ర కాళి, పార్వతీదేవి వార్ల పీఠమున్ను దానిముందు యజ్ఞకుండ మున్నుకలదు ఈమందిరమున 5 జయగంటలు 5 పెద్దగంటలు, ముప్పదిరెండు బిరుదులు (వాయిద్యములు) గలవు.

దీనికిముందు ఓం శ్రీరామధర్మధ్వజ మందిరముగలదు. ఇందు చతుర్గజయుత కూర్మసింహాసనము దక్షిణాభిముఖముగ నుండియున్నది. ఈ సింహాసనముపై విరూపాక్షరభావములో రజిత నిర్మితంబైన ఓం, శ్రీం, అను అక్షరములు స్థాపించబడి

చున్నవి. ఇంను రాజ లాంఛనములగు చత్రిము, రజితదండము హాసికలు, వింజామరలు మొదలగునవికలవు. ముందు ండా భజనలు, హరికధలు, పురాణాది కాలక్షేపములు పుటకువీలుగా నిర్మించబడి భజనమందిరమని పిలువబడు న్నది. ఈ మందిరమున వాయిద్యము లనేకములుగలవు. (1) వాణి. (2) అమృతవాణి (3) బ్రహ్మాండ భీకరము (4) కాంజనము (5) ఢోతాళముఖ్యము (6) సింహాళా త్సనము (7) విజృంభణదట్టము (8) విజయబాల (9) జయ హాం (10) విజయ శిఖోహాం (11 12) మరపాంజనములు (13 14) నగారాలు (15 16) గుమ్మెట్లు (17 18) చేరుంజలు (19 20) సభోత్తాణములు (21 22) రంతాళి మృదంగము తాళము మొదలగు చర్మకట్టు వాయిద్యములు ముప్పదిరెండు ఈమందిరమునకలవు. ఈ మఠమున అఖండము, నిత్యనైవేద్య దీపారాధనలు పర్వదినములయందు భజనలు మొదలగు కాలక్షేపములు, కాలజ్ఞాన పారాయణము పరమేశ్వర పార్వతీ సంవాదపారాయణములు జరుగును.

ప్రతిసంవత్సరము చైత్రమున ఈశ్వరమ్మగారి జయంతి, వైశాఖ శుద్ధదశమికి బ్రహ్మంగారి జయంతి, కార్తీకమున గంగార్చన, నక్తములు మొదలగు విశేషకార్యక్రిమములు దైవ సంకల్ప విశేషపండుగలు జరుగుచుండును. ఈ మఠప్రాంగణ ములో పుష్ప, ఫలవనములు, శాపనాశనము, పాపనాశమను రెండు మంచినీటిబావులుకలవు. ఈమఠమునకు ఎల్లప్పుడు భక్త లనేకులువచ్చి దర్శించుచుందురు. ప్రస్తుత మీమఠము హాం, పాం శ్రీ వీరధర్మ వీశ్వరీ నాగజ్యోతి దేవమ్మగారియాజ మాన్యమునందుండి దినదిన ప్రవర్ధమానమై వెలుగొందుచున్నది.

# వీరబ్రహ్మేంద్రస్వామివారి ఆలయము

## (నిర్మాణమునందున్నది)

—o—

దీనిని శ్రీ భావనారాయణస్వామి ఆలయమునకు ఉత్తర దిశలో సుమారు 1 మైలు దూరమున జమ్ములపాలెం రోడ్డుకు తూర్పునగల స్థలమందు (రైల్వేలైను దాటినతర్వాత నిర్మించుటకై స్వస్తి శ్రీ శోభకృతునామ సం॥ ఫాల్గుణ శు ౯ లు శుక్రవారం నాడు (ది 21-2-1964) ఇచట శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి దేవాలయమునకు శంఖుస్థాపన చేయబడినది. ఈ విషయమున శ్రీ ఆలూరి రామలింగాచార్యులుగారు ప్రధాన కార్యకర్తలుగానుండి కృషిచేయుచున్నారు. త్వరలో ఈ పట్టణమున శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని వారిఆలయమును దర్శించగల భాగ్యము మనకు కలుగనున్నది. భక్తులు వారివారి శక్త్యానుసారము సమర్పించి ఆలయ నిర్మాణమునకై కృషిచేయుచున్నారు. శ్రీ భావనారాయణస్వామివారి అనుగ్రహమున ఈ ఆలయము త్వరలో పూర్తిగావింపబడి ప్రకాశించుగాక.

శ్రీ. భావనారాయణ స్వామి వారి ఆలయమునకు ఎదురుగా నున్న శ్రీ. ప్రసన్నాంజనేయ స్వామివారి సన్నిధి యందుగల విజయధ్వజ మంటపమున స్వస్తి శ్రీ.క్రోధినామ సంవత్సర చైత్ర బహుళ దశమీ పూర్వాభాద్రా నక్షత్ర యుక్త గురువారము (7-5-64) నాడు శ్రీ శ్రీ. శ్రీ. ప.ప. అవధూతేంద్ర సరస్వతీస్వాములవారి అధ్వర్యమున కీ॥ శే॥లగు కామరాజు వెంకట సుబ్బయ్యగారి జ్ఞాపకార్థము వారి సతీమణి యైన సూర్యకాంతమ్మ గారును వారి కుమార్తెయైన హైమవ తమ్మగారును కలసి "శ్రీ హనుమాన్ చాలీసా"ను పూర్తిగా శిలలపై చెక్కించి శాశ్వతముగా నుండునట్లు వేయించిరి. శ్రీ ప్రసన్నాంజనేయస్వామిని దర్శించినపుడెల్ల ఒక్కసారి యైన శ్రీ హనుమాన్‌చాలీసాను చదువుటకు వీలుగా ఈ శిలలమర్చబడి శ్రీ స్వామిని ధ్యానించుటకు వీలుగానున్నవి.

బాపట్ల డివిజనుకు హిందూమత దేవాదాయ ధర్మాదాయ అసిస్టెంటు కమీషనరుగా పని చేయు చున్న శ్రీ టి. సూరయ్యగారు ది 17-8-64వ తేదీన నెల్లూరు డివిజను అసిస్టెంటు కమీషనరుగా బదిలి అయినారు. ఈ స్థానమునకు గుంటూరు డివిజను అసిస్టెంటు కమీషనరుగా పనిచేయుచున్న శ్రీ. కె. వి. నరసింహమూర్తి బి. ఎ. యల్. యల్. బి. గారు ఇటకు విచ్చేసి ది. 17—8—64 నుండి ఈ బాపట్ల డివిజను అసిస్టెంటు కమీషనరుగా పనిచేయుచున్నారు. వీరిపర్య వేక్షణక్రింద ఈ భావపురమందలి దేవాలయములు అభివృద్ధి చెందగలవని ఆశించుచున్నాము.

—o—

గౌతమసగోత్ర విరాజితులును

అనుష్ఠాన సంపన్నులును, ఆగమతంత్రవేత్తలును

శ్రీ భావనారాయణస్వామివారి పాదపద్మారాధకులును

చారిత్రిక పురుషులునగు శ్రీమాన్

# నల్లూరి నరసింహాచార్యులగారి వంశావళి

శ్రీమాన్ నల్లూరి నరసింహాచార్యులుగారు (మూలపురుషులు భార్య రామలక్ష్మమ్మగారు) ఆగమతంత్రవేత్తలు, అనుష్ఠానసంపన్నులు. వీరికిద్దరుకుమారులు జ్యేష్ఠుడు తిరువెంగళాచార్యులుగారు *కనిష్ఠుడు భాష్యకాచార్యులుగారు.

తిరువెంగళాచార్యులుగారు(భార్య లక్ష్మీనరసమ్మ,) పండితులు వాసిరెడ్డివారి ఆస్థాన వైద్యులు పౌన్నారు శ్రీ భావనారాయణస్వామివారి సన్నిధానమున దేవయజన తంత్రాధికారులు. వీరి కుమారులు వేంకటార్యాచార్యులుగారు.

వెంకటార్యాచార్యులుగారికి భార్యలిద్దరు, (1) వేదవల్లి (2) జానకమ్మ వాసిరెడ్డివారి ఆస్థాన వైద్యులు ఆగమవేత్తలు మొదటిభార్యకు ముగ్గురు కుమారులు (1) నరసింహాచార్యులుగారు, (2) రామాచార్యులుగారు, (3) లక్ష్మీనరసింహాచార్యులుగారు, రెండవభార్యకుమారుడు రంగాచార్యులుగారు. కుమార్తెలు ముగ్గురు (1) లక్ష్మమ్మగారు (భర్త బృందావనం నరసింహాచార్యులుగారు గూడవల్లి) (2) లక్ష్మీనాయకమ్మగారు, (3)లక్ష్మీ నరసమ్మగారు, (వీరిద్దరిభర్త బృందావనంరంగాచార్యులుగారు మోపర్రు),

నరసింహాచార్యులుగారు, (భార్యమంగమ్మగారు) వ్యాకరణపండితులు కవిశేఖరులు. వీరికిద్దరుకుమార్లు (1) తిరువెంగళా

చార్యులుగారు, (భార్య శేషమ్మగారు సంతతి లేదు). (2) వేణు గోపాలాచార్యులుగారు, (భార్య అలివేలమ్మగారు) కుమార్తె సుందరమ్మ (భర్త బృందావనం రంగాచార్యులు, కర్లపాలెం) నరసింహాచార్యులుగారి కుమార్తె లిద్దరు (1) శేషమ్మగారు (భర్త నారాయణం చినవెంకటాచార్యులుగారు చెరుకూరు) (2) రంగనాయకమ్మగారు, (భర్త అగ్నిహోత్రం అప్పలా చార్యులుగారు, పరాసుపేట బందరు).

రామాచార్యులుగారు (వెంకట్రాయాచార్యులుగారి రెండవ కుమారుడు) వీరిభార్య శీతమ్మగారు పంచాణభాషా కోవిదులు సంగీతవిద్వాంసులు. వీరి కుమారులు రంగాచార్యులు గారు. (భార్యరంగమ్మగారు.) ఆగమ పండితులు శాస్త్రజ్ఞులు. చిత్రకళానిపుణులు వీరి దత్తకుమారులు కస్తూరి రంగాచార్యులు గారు. (భార్యలక్ష్మీనాయకమ్మ వీరు వైద్యులు (R.M. P. కంచుకూరు తాలూకా చలుకుపాడుగ్రామంలో నున్నారు). వీరికుమార్తె సుబ్బాయమ్మ (భర్త నారాయణం సత్యనారాయ ణాచార్యులు, రావిసూతల)

వెంకట్రాయాచార్యులుగారి మూడవ కుమారుడు లక్ష్మీ నరసింహాచార్యులుగారు, (బ్రహ్మచారి) నాల్గవ కుమారుడు రంగాచార్యులుగారు (వీరు జానకమ్మగారి కుమారులు) భార్య రత్తమ్మగారు. వీరు సంస్కృతాంధ్ర భాషలయందు మహాపండితులు. మహాకవులు, ఆగమవేత్తలు రాజవైద్యులు. వీరొకప్పుడు పౌరాణిక సభారంగస్థలమున కోర్టు న్యాయాధికారులగు శ్రీయుత యం. రామయ్య పంతులుగారి వలన విజయచిహ్నముగా సువర్ణహస్త కంకణములచే బహూక

రింపబడి నాటినుండి కడియాల రంగాచార్యులవారని గౌరవ నామమునొందినవారు. వీరి దత్తకుమారుడు వెంకటాద్రియాచార్యులుగారు (వీరికిద్దరు భార్యలు 1. కమలమ్మగారు, ఈమెకు సంతానములేదు). 2. రాఘవమ్మగారు) ఆగమపండితులు, శాస్త్రవేత్తలు వైద్యులు వీరికి ముగ్గురు కుమారులు 1. వేంకట రంగాచార్యులు. 2. కృష్ణమాచార్యులు (బ్రహ్మచారి) 3 వేంకట సీతారామాచార్యులు. యిద్దరు కుమార్తెలు 1. [illegible]మ్మ (భర్త పెద్దింటి వేంకటనరసింహాచార్యులుగారు, [illegible] 2. చంద్రప్రభావతీ తాయారు (భర్త పెద్దింటిలక్ష్మణాచార్యులు గారు కొమ్మూరు).

వేంకట రంగాచార్యులు (భార్య వేంకటలక్ష్మమ్మ) వీరు ఆగమపండితులు భాషావేత్తలు శంకరవిద్యాలయ [illegible] వైద్యులు. ఆయుర్వేద భిషగ్వర్యులు (R. M P). [illegible] కుమారులు, నలుగురు కుమార్తెలు. పెద్దకుమారుడు [illegible] సుదర్శనజ్వాలానరసింహాచార్యులు (భార్య [illegible]). [illegible] [illegible]భాషాగమవేత్తలు వైద్యులు (R.M.P) [illegible] వేంకటాద్రియ దీక్షితులు. కుమార్తెలు 1. [illegible] 2. గోపాలకృష్ణకుమారి, 3. [illegible]

రెండవ కుమారుడు వేంకటభావనారాయణాచార్యులు పెద్దకుమార్తె జానకమ్మ (భర్త [illegible] శ్రీనివాసాచార్యులుగారు, సంగంజాగర్లమూడి). [illegible] పెద్దింటి రఘునాధ చక్రవర్తిగారు [illegible] డా॥ బృందావనం శ్రీనివాసాచార్యులు [illegible]

(4) రాఘవమ్మ (భర్త పెద్దింటి రంగనాథ[illegible] (M. Sc. ) అభ్యసించుచున్నారు.)

వేంకట సీతారామాచార్యులు (భార్య వేంకట శేషమ్మ) వీరు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషాగమ వేత్తలు ఆయుర్వేద వైద్యులు (RMP) వీరి పెద్దకుమారులు వేంకటపాంచజన్య లక్ష్మీనరసింహ కృష్ణరాయాచార్యులు, రెండవ కుమారుడు వేంకట రంగమోహన్ కుమార్తె వేంకట కమలమ్మ.

*మూలపురుషులు నరసింహాచార్యులుగారి కనిష్ట కుమారులు భాష్యకాచార్యులు. ( భార్య రామమ్మ ) వీరు పండితులు, శాస్త్రజ్ఞులు. వీరి పెద్దకుమారులు పెదవేంకటాచార్యులుగారు, (భార్య నరసమ్మగారు సంతానములేదు.) రెండవ కుమారుడు చినవేంకటాచార్యులుగారు, (భార్య సీతమ్మగారు) వైద్యులు, శాస్త్రవేత్తలు పండితులు. వీరి కుమారులు- నరసింహాచార్యులుగారు. (భార్య మంగమ్మగారు)

వీరికి ఆరుగురు కుమార్తెలుగలరు. దత్తకుమారుడు వేంకటరంగాచార్యులుగారు, (భార్య శేషమ్మగారు. సంతానములేదు.) ఆగమ పండితులు, శ్రీమంతులు, ఘన వైద్యులు. నరసింహాచార్యులగారి పెద్దకుమార్తె వెంకాయమ్మగారు (భర్త నారాయణం వేంకటప్పలాచార్యులుగారు, కొండమూడి) (2) సీతమ్మగారు, (భర్త నారాయణం వేంకటాచార్యులుగారు, పావర్తి) (3) నరసమ్మగారు (భర్త పణతుల కోదండరామాచార్యులుగారు, నెల్లూరు) (4) రామమ్మగారు (భర్త వీపూరు చెంచు నరసింహాచార్యులుగారు, వీపూరు నెల్లూరుజిల్లా) (5) శేషమ్మగారు(భర్త బృందావనం రామానుజాచార్యులుగారు కన్నపాలెం) (6) రంగమ్మగారు (భర్త బృందావనం నరసింహాచార్యులుగారు మోపరు)

భార్గవసగోత్ర విరాజితులును
ఆగమతంత్రవేత్తలును అనుష్ఠాన సంపన్నులును
శ్రీ భావనారాయణ స్వామివారి పాదపద్మారాధకులును
చారిత్రకపురుషులునగు శ్రీమాన్

# శ్రీనివాసుల భావనాచార్యులగారి వంశావళి

—o—

శ్రీమాన్ శ్రీనివాసుల భావనాచార్యులుగారు (మూల పురుషులు) వీరి పెద్దకుమారులుసీనయాచార్యులుగారు *చిన్న కుమారులు వెంకటప్పలాచార్యులుగారు.

సీనయాచార్యులుగారి కుమారుడు శ్రీరంగాచార్యులు గారు పండితులు (భార్య సీతమ్మగారు) వీరి పెద్దకుమారుడు సీనయాచార్యులుగారు. (భార్య రంగమ్మగారు) రెండవవారు వెంకటాద్రిఘువాచార్యులుగారు, (భార్య కృష్ణమ్మగారు) వీరు శాస్త్రజ్ఞులు. మూడవ కుమారుడు రామాచార్యులుగారు, (భార్య నరసమ్మగారు కార్రోచ్చెల గ్రామం వెళ్ళినారు) నాల్గవ వారు భావనాచార్యులుగారు, (భార్య సీతమ్మగారు, కొండ పాటూరుకు ఇల్లింటమునకు వెళ్ళినారు). శ్రీరంగాచార్యులుగారి పెద్దకుమార్తె అలివేలమ్మగారు (భర్త దీవి శేషాచార్యులుగారు కంకటపాలెం) రెండవ కుమార్తె వరదమ్మగారు (భర్త నారాయణం సూర్యనారాయణాచార్యులుగారు. ములుకుదురు)

సీనయాచార్యులగారికి నలుగురు కుమారులు పెద్దవారు రఘునాథాచార్యులుగారు(భార్యరంగమ్మగారు సంతానము లేదు)

... స్తోత్రపాఠకులు, విద్వాంసులు, ఆగమవేత్తలు.
... చార్యులుగారు (భార్య శేషమ్మ దత్తు కుమారుడు కృష్ణ
... చార్యులుగారు. సూళ్లూరు పేటలో వున్నారు). 3 సీతా
... చార్యులుగారు, (బ్రహ్మచారి) 4 రాఘవాచార్యులు
... పితం శ్రీ అయిన వెంకటరాఘవాచార్యులగారికిదత్తు.
... చార్యులుగారి (భార్య రంగమ్మగారు). కుమార్తె
... గారు (భర్త నారాయణం శ్రియఃపతి ఆచార్యులుగారు
...). రాఘవాచార్యులుగారి దత్తుకుమారుడు సత్యా
... చార్యులుగారు (భార్య అలివేలుమంగతాయారు)
... అలంకారశాస్త్ర బిరుదాంచితులు ఆగమపండితులు. వీరి
కుమారులు వెంకటహనుమద్రాఘవాచార్యులు చిన్న
కుమారుడు వెంకటసీతాపతి రంగనాథుడు.

(మూలపురుషులు భావనాచార్యులుగారి రెండవ
కుమారులు) వెంకటప్పలాచార్యులుగారు వీరి పెద్దకుమారుడు
... కటాచార్యులుగారు, వీరికుమారుడు వెంకటప్పలాచార్యులు
గారి (భార్య రాజమ్మగారు పుత్రిసంతులేదు). వీరు అలంకార
శాస్త్ర బిరుదాంచితులు పండితులు వీరి కుమార్తె హనుమా
... గారు(భర్త మేమారినరసింహాచార్యులుగారుధూళిపూడి)

వెంకటప్పలాచార్యులుగారి రెండవకుమారుడు కేశవా
చార్యులుగారు వీరి దత్తు కుమారుడు రామాచార్యులుగారు
(భార్య లక్ష్మమ్మగారు) వీరి కుమారుడు కృష్ణమాచార్యులుగారు.
కుమార్తె సీతమ్మగారు (భర్త నారాయణం వెంకట రంగా
చార్యులుగారు ములుకుదురు).

కృష్ణమాచార్యులుగారు (భార్య లక్ష్మీనరసమ్మగారు) వీరి పెద్దకుమారులు రామాచార్యులుగారు (భార్య సీతమ్మ). వీరు అలంకారాదులు చేయుటయందు నిపుణులు. వైద్యులు (R. M. P.) వీరికి నల్గురు కుమారులు ఇద్దరు కుమార్తెలు పెద్దకుమారుడు కృష్ణమాచార్యులు (భార్య లక్ష్మీతాయారు వీరికుమారుడు రవికుమార్) 2 భావనారాయణాచార్యులు 3 ఆంజనేయదీక్షితులు 4 విఖనసమూర్తి. పెద్దకుమార్తె లక్ష్మీకుమారి రెండవ కుమార్తె విజయకుమారి

కృష్ణమాచార్యులుగారి రెండవకుమారుడు వేంకటశేషాచార్యులు (భార్య జయమ్మ). వీరు ప్రముఖవైద్యులు (ఆర్. యం. పి. కంకటపాలెం). వీరికి నల్గురు కుమారులు ముగ్గురు కుమార్తెలు గలరు. పెద్దకుమారుడు కృష్ణమూర్తి 2 వేదాద్రినరసింహాచార్యులు(బాలభాస్కర్) 3 శ్రీమన్నారాయణ (శీనుబాబు) 4 విజయకుమార్ పెద్దకుమార్తె లక్ష్మీనరసమ్మ (భర్త డా॥ నారాయణం రాజగోపాలాచార్యులు జమ్ములపాలెం) రెండవకుమార్తె పద్మావతి 3 సావిత్రి.

# ఈ గ్రంథమునకై విరాళములు యిచ్చినదాతలు

రు 116-00 విరాళ మొసంగినవారు

కళాతపస్వి అభినవ ప్రసాదరాయ
శ్రీ సింగరాజు నాగభూషణరావుపంతులుగారు
(రిటైర్డు హెడ్మాష్టరు) B.A.L.T. బాపట్ల

రు 50-00 లు యిచ్చినవారు.

శ్రీ దేశరాజు సార్వభౌమరావుగారు బాపట్ల
శ్రీ కంభంమెట్టు మధుసూదనరావుగారు ఆడిటరు ,,

రు 25-00 లు యిచ్చినవారు

శ్రీ బ్రింహ్మాండం వెంకటలక్ష్మీ నారాయణరావు
పంతులుగారు శ్రోత్రియందారు బాపట్ల
శ్రీమాన్ డా॥ దీవి నరసింహాచార్యులుగారు ఆర్. యం. పి.
శ్రీ రామభక్త చిలంకుర్తి శ్రీ రాములునాయుడుగారు, బాపట్ల
శ్రీమాన్ నారాయణం నరసింహాచార్యులగారి
జ్ఞాపకార్థము భార్య వెంకాయమ్మగారు కొండమూది
శ్రీమాన్ నారాయణం రంగాచార్యులగారి జ్ఞాపకార్థము
భార్య సువర్చలమ్మగారు కొండమూది

రు 10-00 లు యిచ్చినవారు

శ్రీ శ్రీ శ్రీ ప. ప. అనుభవానందస్వామివారు బాపట్ల
శ్రీ శిఖరం వెంకటచలపతిరావుగారు ,,
శ్రీ డా॥ దేశరాజు వెంకటఅప్పారావుగారు ,,
శ్రీ దేశరాజు చినబాపారావుగారు ,,
శ్రీ దేశరాజు రంగారావుగారు ,,

శ్రీ పెనుమచ్చ దయనందరాజుగారు — భీమవరం

శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అడ్వకేటు. — బాపట్ల

శ్రీమాన్ డా॥ నారాయణం రంగాచార్యులుగారు B. A. — ,,

శ్రీమాన్ బృందావనం వేంకట శేషాచార్యులుగారు — ,,

శ్రీమాన్ డా॥ బృందావనం పార్థసారధి ఆచార్యులుగారు — ,,

శ్రీమాన్ శ్రీనివాసుల సత్యనారాయణాచార్యులుగారు — ,,

శ్రీమాన్ వినుకొండ నరసింహాచార్యులుగారు — ,,

శ్రీమాన్ డా॥ శ్రీనివాసుల రామాచార్యులుగారు — ,,

శ్రీ డా॥ శ్రీనివాసుల వెంకటశేషాచార్యులుగారు — కంకటపాలెం

శ్రీమాన్ పెద్దింటి హనుమంతాచార్యులుగారు — కొమ్మూరు

శ్రీమాన్ పెద్దింటి రామాచార్యులుగారి జ్ఞాపకార్థము
సోదరుడు లక్ష్మణాచార్యులుగారు — ,,

శ్రీ గంగరాజు హనుమంతరావుగారు — ,,

శ్రీ దాసరి తిరుపతిగారు — ములుకుదురు

శ్రీ కోప్పుపూడి మల్లికార్జున కవిగారు — నిడుబ్రోలు

శ్రీమాన్ డా॥ నల్లూరి కోదండ రామాచార్యులుగారు
ముత్తుపల్లి అగ్రహారం

శ్రీ రామచంద్రిల సూర్యనారాయణగారు — బాపట్ల

శ్రీ నైవారం భోగానందశర్మగారు — ,,

శ్రీ దుద్దుకూరు రామారావుగారు — ,,

శ్రీ సవరం వెంకట్రామయ్యగారి కుమారుడు
వెంకటేశ్వర్లుగారు — ,,

శ్రీ అప్పిచర్ల సీతారామారావు, వెంకటసుబ్బమ్మగార్లు — ,,

శ్రీ సుంకరి తులసీదాసుగారు సెంట్రల్ ఎక్సైజు — ,,

శ్రీ నల్లూరి నాగయ్యగారు — ,,

శ్రీ దర్భా వేంకటలక్ష్మీనారాయణగారు — ,,

శ్రీ వల్లూరి వెంకటేశ్వర్లుగారు అడ్వకేటు హైదరాబాదు
శ్రీ శంకరవిద్యాలయంవారు బాపట్ల
శ్రీ ప్రత్తూరి లక్ష్మీనారాయణశర్మగారు అడ్వకేటు ,,
శ్రీ బూర్లె దత్తయ్యశ్రేష్ఠిగారు ,,
శ్రీ కొక్కు సుబ్రహ్మణ్యాం నాయుడుగారు ,,
శ్రీ బూర్లె చినవెంకటనర్సుగారు ,,
శ్రీ గల్లి ఆదిశేషుగారు ,,
శ్రీ గల్లి సత్యనారాయణగారు ,,
శ్రీ పులకణం రాఘవయ్యగారు ,,
శ్రీ కొత్తమాసు లక్ష్మయ్యగారు ,,
శ్రీ బి. ఆర్. ఎ, దీక్షితులుగారు ,,
శ్రీమతి మలిశెట్టి రంగమ్మగారు ,,
శ్రీ మలిశెట్టి భావనారాయణగారు (సుభామెడికల్ స్టోర్సు) ,,
శ్రీ చేజర్ల వెంకయ్యగారు లారీ బ్రోకర్సు ,,
శ్రీ చేజర్ల జాలయ్యగారు ,,
శ్రీ లేళ్ల రామారావుగారు ,,
శ్రీ సి. కృష్ణమూర్తి ఐ. కోటేశ్వరగుప్తగారలు ఆడిటర్సు ,,
శ్రీ పాలపర్తి నాగభూషణశాస్త్రిగారు ప్లీడరు ,,
శ్రీ నీలంరాజు రామయ్యగారు ,,
శ్రీ బూదరాజు లక్ష్మీనారాయణగారు అడ్వకేటు ,,
శ్రీ బొడ్డుపల్లి సీతారామస్వామిశాస్త్రిగా ,,
శ్రీ వుటుకూరి లక్ష్మణస్వామిగారు ,,
శ్రీ వేదాంతం నరసింహదాసుగారు ,,
శ్రీమాన్ డాక్టరు పుసులూరి, రాధాకృష్ణమాచార్యులు
గారు ఆర్. యం. పి. యిడుపలపాడు
శ్రీ కొండముది హనుమంతరావుగారు కొండముది

శ్రీ ఏలేశ్వరపు వేంకటేశ్వర్లుగారి జ్ఞాపకార్థం — బాపట్ల
నరసింహారావుగారు లీలాస్టూడియో

శ్రీ బుర్రా శివరామకృష్ణయ్యగారు శివాజీడ్రిగ్ హౌస్ ,,

శ్రీ భృగుమళ్ళ సుబ్బారావుగారు ,,

శ్రీ జూలుగంటి రాజారావుగారు రాజాఫోటోస్టూడియో ,,

శ్రీమతి కోం, సాం, వీరధర్మ ఏశ్వరి నాగజ్యోతి దేవమ్మగారు

శ్రీ పిశుపాటి సూర్యనారాయణావధానులుగారు ,,

శ్రీ పి. యల్. రామస్వామి అయ్యర్ గారు ,,

శ్రీ బూర్లె వెంకటచలపతిరావు, కోటేశ్వరరావుగార్లు ,,

శ్రీ వక్కలగడ్డ బాపనయ్యగారి భా॥ నాగరత్తమ్మగారు ,,

శ్రీ డా॥ సూరి ప్రకాశరావుగారు R. M. P. — తుని

శ్రీ డా॥ సూరి జగ్గారావుగారు ,,

శ్రీ డా॥ సూరి రామమూర్తిగారు ,,

శ్రీ డా॥ సూరి నారాయణమూర్తిగారు ,,

శ్రీ డా॥ సూరి నరవయ్యగారు ,,

శ్రీ డా॥ సూరి లక్ష్మీనరసింహామూర్తిగారు L. I. M. ,,

శ్రీ లక్ష్మీ సత్యనారాయణ రైస్‌మిల్ కంపెనీభాగస్థులు బాపట్ల

శ్రీ వక్కలగడ్డ రాధా క్రిష్ణమూర్తిగారు ,,

శ్రీ బొమ్మిశెట్టి రాఘవయ్యగారు, ,,

శ్రీ కోళ్లపూడి సుబ్రహ్మణ్యంగారు, ,,

శ్రీ కోళ్లపూడి రంగారావుగారు, ,,

శ్రీ కోళ్లపూడి లక్ష్మీనారాయణగారు, ,,

శ్రీ బొమ్మిశెట్టి వెంకటసుబ్బమ్మ గార్లు (కలసి వీరు ,,
విరాళముగా రు 25/—లు యిచ్చిరి). ,,

శ్రీ ధనలక్ష్మీ రైస్‌మిల్లు కంట్రాక్టర్సు ,,

శ్రీ కోళ్ళపూడి రత్తయ్య అండ్ కంపెనీవారు బాపట్ల

  

# శ్రీ మత్సుందరవల్లీ రాజ్యలక్ష్మీసమేత శ్రీ భావ నారాయణస్వామివారి దేవస్థానము పాలకవర్గము

(1,2,3 వంశపరంపరా ధర్మకర్తలు)

1 శ్రీ స్థానం నరసింహారావుగారు మేనేజింగుధర్మకర్త
2 శ్రీ బాపట్ల వెంకటచలపతిరావుగారు
3 శ్రీ దేశరాజు రామచంద్రరావుగారు
4 శ్రీ బూర్లె రత్తయ్య శ్రేష్ఠిగారు ట్రస్టీలు
5 శ్రీ దాసరి సిద్దయ్యనాయుడుగారు
6 శ్రీ యడ్లపాటి వెంకట్రావుగారు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు.

వీరు ఈ గ్రంథ ప్రచురణకు రు 200-0-0 లు విరాళ ముగా యిచ్చుటకు తీర్మానించి ప్రోత్సాహ మొసంగినందుకు వారికి మాకృతజ్ఞత.

    

# శ్రీ గంగాపార్వతీ సమేత శ్రీ సోమేశ్వరస్వామివారి దేవస్థానము పాలకవర్గము

| | | |
|---|---|---|
| 1 | శ్రీ కొక్కు సుబ్రహ్మణ్యంనాయుడుగారు | మేనేజింగుట్రస్టీ |
| 2 | శ్రీ శిఖరం రామకృష్ణారావుగారు | ధర్మకర్తలు |
| 3 | శ్రీ వెదురుపర్తి వీరాచార్యులుగారు | ,, |
| 4 | శ్రీమతి కర్రిపూడి కమలమ్మగారు | ,, |
| 5 | శ్రీ కర్రి రత్తయ్యగారు | ,, |

వీరు ఈగ్రంథ ప్రచురణకై రు 200-0-0 లు విరాళముగా యిచ్చుటకు తీర్మానించి ప్రోత్సాహ మొసంగినందులకు వారికి మాకృతజ్ఞత.





శ్రీ భావనారాయణ స్వామివారి ఆలయ ప్రాంగణము

గ్రంథావిష్కరణ మహాసభ, బాపట్ల.

క్రోధి సం. శ్రావణ శుద్ధ షష్ఠి. * 23-8-64 ఆదివారము.

ఓం

# శ్రీ భావనారాయణస్వామి క్షేత్రమాహాత్మ్య గ్రంథావిష్కరణము

-:(శ్రీవారి ఆలయ ప్రాంగణమునందు):-

స్వస్తిశ్రీ క్రోధినామ సం॥ శ్రావణ శుద్ధపూర్ణిమ భాను (ఆది) వారము (23-8-64) నాడు శ్రీ భావనారాయణస్వామివారి క్షేత్రమాహాత్మ్య గ్రంథావిష్కరణము కావించుటకు పెద్దలు శుభముహూర్తమును నిర్ణయించిరి. సుప్రభాత శుభ సమయమునందు శ్రీమత్సుందరవల్లి రాజ్యలక్ష్మీసమేత శ్రీభావ నారాయణస్వామికి శ్రీభావదేవ సుప్రభాతాది శ్లోకాదికము ప్రార్థనాసంఘమువారిచే భావపురి పౌరుల కందరకు వీనులవిందుగా ప్రబోధముగావింపబడెను.

తదుపరి ముద్రితగ్రంథములు శ్రీవారి చరణసన్నిధిలో నుంచబడి ఆరాధింపబడి శ్రీమాన్ నల్లాన్ వేంకటరంగాచార్యులు వేంకట సీతారామాచార్యులగార్లచే కృతిసమర్పణ గావించబడినది.

సాయంకాలము 5 గంటలకు శ్రీ స్వామివారి ఆలయ ప్రాంగణమున కళాతపస్వి, అభినవ ప్రసాదరాయాది బిరుదాంచితులగు మహారాజశ్రీ శ్రీ సింగరాజు నాగభూషణరావు పంతులుగారు బి. ఏ. యల్. టి. (విశ్రాంతి నొందిన ఉన్నతపాఠశాలా ప్రధానాధ్యాపకులు, బాపట్ల) అధ్యక్షతవహించిరి. ఆహూతులగు పండితోపన్యాసకులందరు సభనలంకరించిరి. వెంటనే కృతి భర్తయైన శ్రీవారిని వేద, ద్రావిడ, సంస్కృత ప్రబంధస్తోత్రాదులచే సంస్తుతించిరి. బ్రహ్మశ్రీ పిసుపాటి

[illegible] ఘనులుగారు వేదప్రవచనముగావించిరి. [illegible] వెంకటప్పలాచార్యులుగారు ద్రవిడ వేద [illegible] వించిరి. శ్రీమాన్ చల్లూరి వేంకటసీతారామా [illegible] ప్రార్థనగావించిరి. దేవాలయ ప్రాంగణమంతయు [illegible] యులచే విందీపులకించినది.

[illegible] తమ సహజ గంభీరస్వరముతో నాటి [illegible] ముఖ్యమును వివరించి సభాప్రారంభమునకాదేశించిరి. [illegible] ప్రధానాంధ్రాధ్యాపకులు శ్రీ బొడ్డుపల్లి [illegible] గారు (యం. ఏ) సభను ప్రారంభించుచు బాపట్ల [illegible] ఈ గ్రంథము సువర్ణాధ్యాయమును ప్రారంభించిన [illegible] "భారతీయ సంస్కృతి అరణ్యముల నాశ్రయించి [illegible] నైమిశారణ్యామలవలె బాపట్ల ప్రాంతము [illegible] పవిత్రభూమి. అట్టి పవిత్ర ప్రదేశమున [illegible] క్రిమికంఠచోళ నిర్మితాలయమున శ్రీ భావనారాయణస్వామి స్వయంవ్యక్తుడగుటయు ఈస్వామి [illegible] యించిన పట్టణమయి భావపట్టణముగా వెలయుటయు [illegible] పవిత్ర సంఘటనములు. ఈయది శ్రీ రంగాది దివ్యక్షేత్ర [illegible] వంటి వనుటకు ఎట్టిసందేహము లేదని చెప్పకతప్పదు. అట్టి ఈపట్టణము దినదిన ప్రవర్ధమానమై బహుముఖములగు [illegible] కళాత్మక కార్యకలాపములందు పారంగతులగు పౌరులను విభ [illegible] అదియంతయు శ్రీ స్వామికటాక్షమే. సమతల [illegible] నభివృద్ధినొందిన ఈపట్టణము పలుప్రాంతములందు [illegible] నిర్మించిన ఆలయములు శ్రీ భావనారాయణస్వామివారికళా సామ్రాజ్యమే యనదగియున్నది. అంతేగాక ప్రజాహిత సంస్థ

లును ఆయనకటాక్షవీక్షణముల వెలుగొందినవే. తొలిసారిగ ఆంధ్రరాష్ట్రవాంఛ ఈపట్టణమున చెలరేగుటయు ఆంధ్రప్రదేశము సిద్ధించుటయు శ్రీ స్వామివారి ఆశీర్వాదబలముచేతనే యనుట సమంజసము. శ్రీ స్వామియొక్క దయామాధుర్య కటాక్ష వీక్షణ ప్రభావములచేతనే ఈక్షేత్రవాసులు ముగ్గురు "పద్మశ్రీ" బిరుదాంకితులైనారు వారు 1. నటకావతంస శ్రీ స్థానం నరసింహారావుపంతులుగారు (శ్రీ స్థానం వంశము వారు ఇప్పటికిని శ్రీవారి ఆలయ ధర్మకర్తృత్వమును నిర్వహించుచున్నారు. శ్రీవారి ఆలయచ్ఛాయాచిత్రమున వీరిసౌధము కూడ కానవగును) 2. కొయినాప్రాజెక్టు నిర్మాత శ్రీ నోరి గోపాలకృష్ణమూర్తిగారు 3. ప్రపంచగణిత శాస్త్రసంఘాధ్యక్షులు శ్రీ కొమరవోలు చంద్రశేఖరన్ గారు. వీరేగాక అనేక శాస్త్రనిష్ణాతులైన మహాపండితులు, న్యాయాధికారు లెందరెందరో శ్రీ స్వామివారి ప్రత్యక్ష, పరోక్షలబ్ధ విభవ శ్రీనంది తమతమ రంగముల విజయశ్రీ శోభితులైనారు. అంతేగాక కలా "వేంకటనాయకః" అని భారతీయుల హృదయములందు ప్రతిధ్వనించు శ్రీ మత్తిరుమల శ్రీ శ్రీనివాసమూర్తియొక్క ఆస్థాన విద్వాంసులును తర్కవేదాంత మహావిద్వాన్ ఆగమ శిరోమణులునగు శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథా చార్యవర్యులు ఈ క్షేత్రమునకు ఈశాన్య పొలిమేరయగు అప్పికట్ల గ్రామస్థులగుటయు శ్రీ స్వామివారి కృపావిశేషమే యనకతప్పదు." అని శ్రీ పురుషోత్తమాచార్యులనిరి.

శ్రీ స్వామివారిఆలయ ప్రాముఖ్యమును వివరించుచు కంచి, తిరుమల శ్రీ రంగాదులవలె స్వయంవ్యక్తమగు నీస్వా

[illegible] [illegible]లు తమతమ సాంప్రదాయోచిత రీతుల
[illegible] [illegible] లోకవిదితము. అది ముదావహము.
[illegible] సన్నిధానముననే ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల
[illegible] పాశ్చాత్య దేశమున విద్యాస్నాతులై తమ
[illegible] ప్రారంభించిరి. అద్వైతాంధ్ర కవిప్రపంచ
[illegible] శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు శతావధానము
[illegible]ంచిరి. సరస సంగీత సాహిత్యకళా ప్రపూర్ణుడగు
శ్రీ [illegible] ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథా కాల
[illegible] గావించిరి. అహరహము ఇప్పటికిని హరికథా
[illegible]న్యాసక వేదాంతగోష్ఠి నినాదములతో ప్రతిధ్వనించు
[illegible]ంత పవిత్రాలయ ప్రాంగణము భావస్ఫూర్తి పౌరుల
[illegible] ఆధ్యాత్మిక జీవనమునకాటపట్టు. అట్టి ఆలయచరిత్రను
[illegible] కర్తలతో సేకరించి ప్రచురించిన ప్రకాశకులగు
[illegible] శ్రీ స్వామివారి కత్యంతాత్మీయులైన శ్రీ నల్లూరి
[illegible]లు అనువదించి గ్రంథప్రకాశకులను వారికృషిని బహు
[illegible] ప్రశంసించిరి. సభనలంకరించిన ఉపన్యాసకులను
[illegible] నిశిష్టతను ప్రారంభకులు సభ్యులకు పరిచయ మొనర్చిరి.

శ్రీమాన్ నల్లూరి వేంకటరంగాచార్యులుగారు (ప్రకా
శకులు) తమకు కల్గిన స్వానుభూతిని, తత్ప్రేరణమున వెలు
[illegible] ఈ గ్రంథ ప్రచురణమును సభకు పరిచయమొనర్చి
[illegible]ము నిమిత్తమాత్రులమనియు ఇదియంతయు తమనిత్య
[illegible]మున స్వామిపట్లగలభక్తి ప్రపత్తులకు ఒకచిన్న ప్రతిబింబ
[illegible] తమసహజ వినయసౌశీల్యములను ప్రకటించిరి.



ప్రకాశకులకు సమ్మానము – గ్రంథావిష్కరణ మహాసభలో

శ్రీయుా నల్లూరి వేంకటరంగాచార్యులు, మిత్రమండలిపక్షమున సమ్మానకర్తలు

,, ,, సీతారామాచార్యులు — శ్రీ డా. ఎస్. వి. జోగారావుగారు.

తదుపరి అద్వైత వేదాంత శిరోమణులు బ్రహ్మశ్రీ ఇనుపకుతిక శంకరశాస్త్రిగారు గ్రంథము నావిష్కరించుచూ తమ శిష్యులగు ప్రకాశకుల అవిరళకృషిని ఆశీర్వాదపూర్వకముగా ప్రశంసించిరి. ఇందలి అష్టోత్తరశతనామస్తోత్రాదికములు పితృదేవతాముఖ వినిర్గతములైనవని వాని ధారణయిట్టి అక్షర రూపమును దాల్చినదని ఇందునిసర్గకోమలమగు కవితావేశము నిస్తులముగా వాల్మీకి కోకిలాగానమువలె శోభించుచున్నదని వ్యాఖ్యానించి గ్రంథము నావిష్కరించిరి.

పిమ్మట ప్రకాశకులు బ్రహ్మశ్రీ యినుపకుతిక శంకర శాస్త్రిగారికిని, పౌరాణికాగ్రేసర బ్రహ్మశ్రీ కస్తూరి రాఘవ రామచంద్రశర్మగారికిని పండితశాలువలతో సత్కారమొనర్చిరి. ఈ సందర్భముననే గ్రంథముద్రణమును సకాలములో కళాత్మకముగా నిర్వహించిన రామా ప్రెస్ అధిపతులగు శ్రీ అద్దంకి వీరాస్వామి గారిని ప్రకాశకులు నూతన వస్త్రాలంకృతులను గావించిరి. అందులకు కృతజ్ఞత తెల్పుచూ శ్రీ రాఘవ రామచంద్రశర్మగారు ప్రకాశకుల కార్యదీక్షను ప్రశంసించి యిట్టి గ్రంథము వెలువడుటలో తమపాత్ర స్వల్పమనియూ ప్రకాశకుల అ వి ర ళ కృ షి యే ప్రధానకారణమనియు శ్రీ బ్రహ్మాండం లక్ష్మీనారాయణరావు పంతులుగారు అమూల్యమగు విషయ పత్రములనొసగి ప్రకాశకులకు తోడ్పడిరని కృతజ్ఞత తెల్పిరి. మిత్రమండలి పక్షమున గ్రంథప్రకాశకులను డా॥ యస్. వి. చలపతిరావుగారు శాలువలతో సత్కరించిరి.

శ్రీ విఖనస గ్రంథమండలి ప్రధానకార్యదర్శి ఆంధ్ర నాటక రంగాది బహుగ్రంథకర్తలు శ్రీమాన్ Dr. D. V. A ఆచార్య B. A. G. C. I. M.గారు ఈ విధముగా ఉద్ఘాటించారు.

... చరిత్ర ఒక సుందర నగరంగా
... అట్టిదిగా ప్రసిద్ధిగన్న యీ
... ంది. నిజమైన భారత దేశ చరిత్రను
... వివరించాలి. దాని తప్పకు జీవిత చరిత్రనో,
... కథనం చేసినందువల్ల ప్రయోజనం
... చిత్రమైనచరిత్ర నిజమైన మన భారత దేశ
... అట్టి సత్యాన్వేషణకు పరిశోధనాత్మక
... దేవాలయం తీసుకుంటే, ఆ దేవా
... వారిచరిత్ర, ఆ దేవాలయ నిర్మాణానికి
... శిల్పుల జీవిత చరిత్ర దానికనుబంధముగా
... ఆధ్యాత్మిక తత్వవేత్తల వృత్తాంతం ఆ ప్రా
... పుణ్యగాథలు ఇవన్నీ సేకరించి మేళవిస్తే
... ఆ ప్రాంతీయ దేశ చరిత్ర- ఈవిధముగా భారత దేశం
... దేవాలయాల పావనగాథలను పరిశోధన పూర్వ
... మథించి గ్రథితంచేస్తే మధుర మాకంద సమాన
... చరిత్ర ఉత్పన్నం అయితీరుతుంది. ఈదృక్పథంతో
... విస్తృతాత్మక పవిత్ర కృషికి నాందీవాక్యమే (శ్రీ)
... (శ్రీ) భావనారాయణస్వామివారి క్షేత్రమహా
... ఆది దేవాలయాల పుణ్యగాథలకు ఈవిధమగు రూప
... దానికి దేశములో నిరంతరకృషి జరగాలి అట్టి కృషికి
... దానికి కారణభూతమగు యీ అపూర్వకృషికి
... సంపనీయులు. వారి హారాశీతమై, దేవాలయముల
... సత్రముల, మందిరముల పవిత్ర చరిత్రను
... త్మకంగా సృష్టించినందున ఈ గ్రంథము సార్వజనీనత
... ది అట్టిపవిత్రకృషిని మీరంతా ఆదరించాలని మనవి."

పిమ్మట పొన్నూరు సంస్కృతకళాశాలాధ్యాపకులు బ్రహ్మశ్రీ ధర్మాల సుబ్బరాయశాస్త్రిగారు బాపట్ల భావనారాయణస్వామివారు ఇతర దేవతలకన్న నిత్యజాగృతుడై బాపట్ల నాశీర్వదించుట గొప్ప విశేషమనియు ఆలయ నిర్మాతలగు శిల్పుల ధర్మదీక్ష శాస్త్రవైదుష్యము పూర్వమెట్లుండెడిదో నిరూపించుచు అట్టి కోవకుచెందిన శిల్పులే ఈ ఆలయనిర్మాతలై యుందురని ప్రశంసించిరి. ఇట్టి ఆలయమునకు ఒకచరిత్ర గ్రంథము వెలువడుట బంగారమునకు తావియబ్బినట్లుగా నున్నదని యుద్ఘాటించిరి.

తదనంతరము భాషాప్రవీణులు పర్చూరు ఉన్నతపాఠశాలాంధ్రాధ్యాపకులు శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు గారు, ఈ విధంగా ఉపన్యసించిరి. " 'శ్రీ భావనారాయణస్వామివారి క్షేత్రమాహాత్మ్యము' అత్యంత పరిశోధనాత్మక గ్రంథము విషయసమగ్రతను సాధించుటలో ప్రకాశకుల కృషి సఫలమయింది. భావదేవుని అపారకృపాపాత్రులై తరించిన పుణ్యపురుషుల దివ్యగాధాలహరిని ఇతివృత్తంగా మరొక ఉద్గ్రంథం సృష్టించడం అవసరము. అట్టి పవిత్రకృషికి యీ గ్రంథ ప్రకాశకులు పూనుకోవాలని నా ఆకాంక్ష. పుణ్యపురుషుల ఆఖ్యాన సముదాయమే కలియుగ మానవులకు మార్గదర్శి. అట్టి భాగవత కల్పన పవిత్రకార్యముకాగలదు. లౌకిక ప్రపంచములోఉంటూ పారలౌకిక ప్రపంచములోనికి తొంగిచూచే ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకట్టి ఆర్షగ్రంథములు ఆదర్శకావ్యములు భావదేవుని కృపాకటాక్షవీక్షణపాత్రులైన శ్రీ నల్లూరి సోదరులు సార్థకమగు యిట్టికృషిని సాగింతురుగాక!"

...ం పురాణవిమర్శక బ్రహ్మశ్రీ చుండూరి
...శాస్త్రిగారు తాము పరిశోధించిన అనేక పురాణ
...ములను వివరించి సృష్టి క్రమమును విరాట్పురుష
...ను తెల్పినారు. అట్టి విరాట్పురుషుడు అర్చాస్వరూప
...ముగ వెలయుచున్నాడని శ్రీ భావనారాయణ స్వామిగా
...చుచున్నారు.

...శ్రీ పౌరాణిక శిరోమణి బ్రహ్మశ్రీ కప్పగంతు
...శాస్త్రిగారు (విజయవాడ) శ్రీ భావనారాయణ
...వారి క్షేత్రమాహాత్మ్య గ్రంథమందలి తొలిభాగ
... శ్రీ రాజ్యలక్ష్మి అష్టోత్తర శతనామస్తోత్ర భావనారా
...అష్టోత్తర శతనామస్తోత్రము లందలి విశేషములను సువిధ
...పన్యసించిరి.

శ్రీమాన్ నల్లూరి వేంకట రంగాచార్య, సీతారామా
...చార్యులవారి పితామహులగు శ్రీ మాన్ రంగాచార్యులవారు
... పర్యాయములు శ్రీ మద్రామాయణ ప్రవచనము
...కించి ప్రజల ఆదరాభిమానములొంది సువర్ణహస్తకంక
...ణముల నొంది ప్రజలకు భక్తి ప్రపత్తులొనగూర్చి శ్రీ భావ
...నారాయణస్వామివారి కైంకర్యమొనర్చి జీవితమును సార్థకము
...చేసిరి. శ్రీ భగవానుడు పితామహుల రూపమున వీరికి స్వప్న
...మున దర్శనమిచ్చి యిట్లు రచింప వలసినదని ఆదేశించిన
...కారణమున ఇట్లు వ్రాయుట సంభవించినదని చెప్పియున్నారు
...వీరి ఈ రచనయందు ఎక్కడచూచినను, బ్రహ్మవిద్యోపాస
...నము - హనుమద్విద్యావిధానము - రామతారకమహా
...మంత్ర రహస్యార్థములు ప్రకటితములైయున్నవి. యిందు ఉపా

సనాశ్రమములను ఎరుకజేయు కొన్ని శ్లోకములను కొన్ని శ్లోకపాదములను చదువుచూ వివరణగావించిరి.

1 రాజ్యలక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రమునందు "రామాయణ కథాప్రియా!" అని. అనగా రామాయణ కథయందు ప్రేమకల్గినది సీత అని. ఇట్లు ఉపయోగించుటకు కారణము శ్రీరామ వియోగానలముచే దోదూయమానురాలగు సీతదగ్గఱకు అంగుళీయకమునుఇచ్చి హనుమన్నను పంపుట జరిగినది. అనంతరము అనేకవిధముల శ్రమలకోర్చి రామకార్యమును సాధించు దీక్షతో లంకానగరమున ప్రవేశించి అంతటను అన్వేషించి సీతనుగానక అశోకవనమందున్న శింశుపావృక్షము నధిరోహించి రాక్షసస్త్రీ పరివృతయైన సీతను తాను దర్శించి రామపత్నియని నిర్ణయించి సంతసించి యున్న సందర్భమున, స్త్రీజన పరివృతుడై రావణుడు సీతదగ్గరకు వచ్చి అనేక దుర్భాషలాడుట అట్టి సందర్భమున సీత భిన్న మర్యాదకల్గిన; వేద అవిరుద్ధ ధర్మాచరణ సల్పుచున్న రావణుని లెక్కించక "తృణమంతరతః కృత్వాప్రత్యు వాచ శుచిస్మితా" ఒక తృణమును తనకు, రావణునకు మధ్యాహ్నగానునిచి, అనేక విధముల జ్ఞానబోధచేసినది. అందులో "ఆత్మాన ముపమాంకృత్వా స్వేషుదారేషురమ్యతాం" అని, నన్ను ఉపమానముగా గ్రహించి నీభార్యలతో నీవు కాలయాపనచేయుదువుగాక అను విషయము "రావణజ్ఞానబోధినీ" అని ప్రయోగింపబడినది.

అనంతరము సీతకు 2 మాసములు గడువు ఇచ్చుచున్నాను. యీ లోపల నావశ్యురాలు కానియెడల శరీరమును

ఛేదించి మాంసమును వండించి తినగలను అని అడుగుట వలన రావణదౌష్ట్యము ప్రకటింపబడినది. సీత తనకు వశ్యురాలగునటుల ప్రబోధింప వలసినదని రాక్షస స్త్రీలకు తాను ఆజ్ఞాపించి అంతఃపురమునకు చేరుకున్నాడు రావణుడు.

తరువాత సీత శోకించుట త్రిజట స్వప్న వృత్తాంతమును రాక్షసస్త్రీలకు చెప్పుట జీవితాశలేని సీత మరణోద్యమమును సాగించుట యివియన్నియు హనుమాన్ పైనుండి చూచి సీతకు ఎట్లు రామునితత్త్వము ఎరిగింతునని తహతహపడి రామాను గ్రహమున తాను సంక్షేపముగ రామాయణ కథాగానమొన రించుట దీనివలన ఆచార్యస్థానీయుడు తానయి సీతహృదయ మును తాను చక్కగ గ్రహించి రామునియందు సీతకు దృఢ తరముగ భక్తి ప్రపత్తులు కలుగునటుల, ఉపదేశించుటవలన ఆచార్యుడు లేక, రామమంత్రరహస్యార్థమును శిష్యుడెరుగ లేడన్న విషయము స్పష్టపడుచున్నది. హనుమదనుగ్రహము లేని దేహాను మదనుష్ఠాన ప్రశంస ప్రకటింపబడదనిన్నీ. భావనారాయణ అష్టోత్తర శతనామ స్తోత్రమునందలి శ్లోకములు కేవలము "నగా యత్ర్యైకపరం మంత్రం- నమాతుః పరదైవతం" అను విష యమును ద్యోతకము చేయుచుండుటవలన బ్రహ్మవిద్య ప్రకటిత మగుచున్నది. అదియునుగాక వ్యావహారికమందు శ్రీభావనారా యణస్వామివారిని, బావనారాయణ లేక బావయ్య మరియు బావ అనికూడ పిలుచుటవలననేమో బాపట్ల నామము యీ గ్రామమునకు సార్థకమయినదనుకొనుచున్నాను. అదీగాక ప్రతి నిత్యము ఎవరో ఒకరువచ్చి స్వామిసన్నిధిన పురాణ ప్రవచ నమో లేక హరికథా కాలక్షేపమో సంగీతకచేరీయో జరుపుట

సుప్రసిద్ధమయిన విషయము. అందులో ఎవరెవరి మనోభావ
ములకు తగినట్లు యీ బావ సత్కరించి పంపుతునేయున్నాడు
శూన్య హస్తములతో వెళ్లినవారులేరు దీనివలన పూర్వము
బావ, బావమరుదులైన కృష్ణార్జునుల సంభాషణము ద్యోతకము
చేయుచున్నదా? అన్నట్లు తెలియుచున్నది. యీ ఆచార్య
సోదరుల ద్వారా లోకమునను గ్రహించుటకు అఖండ రచనను
చేయించిన యీ బావదేవుడు వీరిని, వీరివంశములను సర్వదా
రక్షించుగాక మరియు విశ్వకళ్యాణమును చేకూర్చుగాక యని
బావను ప్రార్థించుచూ బావపట్లలో బావదగ్గర నుపన్యసించే
అవకాశము కల్గింపజేసిన శ్రీ రంగాచార్య శ్రీ సీతారామా
చార్యుల వారికి కృతజ్ఞతాపూర్వక అభివందనములను అర్పిం
చుచూ ముగించిరి.

సుదీర్ఘముగా కొనసాగిన ఈ సభాప్రసంగములను
ప్రశంసించి ప్రకాశకులను దీర్ఘాయురారోగ్యములతో నాశీర్వ
దించి సభాధ్యక్షులు సభాపరిసమాప్తినొనర్చిరి. పిమ్మట
సభ్యులకు స్వామివారి ప్రసాదము పంచిపెట్టబడెను. ఇతః
పూర్వమే బావపట్లలో వెలసిన వివిధ దేవాలయముల సంస్థల
పుట్టుపూర్వోత్తరములను శ్రీ నల్లూరి వెంకట సీతారామా
చార్యులుగారు వివరించిరి శ్రీ కె. మల్లిఖార్జునకవిగారు పద్యము
లలో ప్రకాశకులకు కృషినభినందించిరి.

సభ జయప్రదముకావలయునని కోరుచూ శ్రీ శ్రీ
శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ అనుభవానంద
స్వాములవారు, శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన
విద్వాంసులు శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్య

స్వామివారు, శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాలాధ్యక్షులు శ్రీమాన్ భిషగ్రాజ దీవి వెంకటనరసింహాచార్య ప్రభృతులు సభకు రాజాలక పంపిన శుభాకాంక్షలు చదువబడినవి.

శ్రీ నల్లూరి సీతారామాచార్యులవారు సభను జయప్రదముగావించుటలో తోడ్పడిన భక్తులకును, ఆలయాదుల ధర్మకర్తలకును, దేవాదాయ ధర్మాదాయ శాఖాధికారులకును, గ్రంథముద్రణకు విరాళములిచ్చిన ఉదారులకును, వందన సమర్పణగావించిరి. సభామధ్యమున సభాంతమున ప్రసిద్ధ ఛాయాచిత్రకారులు, లీలా స్టూడియో యజమానులు శ్రీ ఏలేశ్వరపు నరసింహారావుగారిచే ఛాయాచిత్రములు తీయబడినవి. మంగళాశాసన మొనర్చుటతో సభ ఆనందాతిరేకముతో ముగిసినది.

— మంగళమహత్ —

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శ్రీ

శ్రీ



నిర్మించదలచిన శ్రీ వీరబ్రహ్మంగారి ఆలయ నమూనా

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | 12 | తవప్రి | తవసుప్రి |
| ౪ | 2 | యుగ్మాం | పద్మాం |
| | 6 | తీవ్రికరకల్పసు | కోటిరుచిరోజ్జ్వల |
| | 12 | శ్రీ బాపట్ల | శ్రీమద్భావ |
| | ,, | మీడఅ | మీశమ |
| | 13 | నా క్తమతుల | నాంచితభుజ |
| | 15 | విలత్భా | విలసత్భా |
| | 16 | శ్రీ బాపట్ల | శ్రీమద్భావ |
| ౭ | 10 | యుగ్మాం | పద్మాం |
| ౧౦ | 7 | స్య | స |
| ౧౨ | 13 | సారిణై | సారిణ్యై |
| 80వనామము | 17 | శ్రీమై | శ్రిమై |
| 94వ ,, | | వామీంక | వామాంక |
| ౧౭ 43వ ,, | | భాతృహితా్రయ | భ్రాతృహితాయ |
| 57వ ,, | | భాగ్వ. | భాగ్య |
| 61వ ,, | | హార్ణే | హారిణే |
| ౨౨ | 15 | జీవిం | జీవినం |
| | 1 | విష్య | విష్వ |
| | 8 | తొమ్మి | తొమ్మిది |
| | 4 | యేబడి | యేబది |
| | 2 | అందరూ | అందరు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 17 | తొండము | తొండముల |
| 6 | 3 | పటణ | పట్టణ |
| 6 | 8 | బొవ్వాడి | బొప్పాడి |
| | 13 | చలదనము | చల్లదనము |
| 8 | 12,20,23 | జ్మ్ర | జ్గ్ర |
| 10 | 21 | దక్ష | దక్షి |
| 12 | 1 | దచ | దీచ |
| 17 | 4 | చార్యల | చార్యుల |
| | 11,17 | ప్రాజ్మ్రఖ | ప్రాజ్గ్రఖ |
| | | వ్రతిష్ఠించి | ప్రతిష్ఠించి |
| | 20 | సోమేశ్వర | సోమేశ్వర |
| 18 | 10 | స్వామని | స్వామిని |
| 19 | 16 | దేవస్తా | దేవస్థా |
| 20 | 20 | కర్తు | కర్తృ |
| | 23 | దేవాలమము | దేవాలయము |
| 21 | 11 | అసందర్భ | సందర్భ |
| 24 | 5 | తిలకలములు | తిలకములు |
| 25 | 17 | భకురాలు | భక్తురాలు |
| | ,, | హస్త | హస్త |
| 26 | 22 | ఉడయర్గ | ఉడయవర్గ |
| 29 | 9 | కళ్యాణమున్నూ | కళ్యాణమును |
| 36 | 2 | పైరవా | భైరవా |
| 38 | 1 | గోత్రోద్ధ | గోత్రోద్భ |
| | 23 | వందర్భా | సందంతర్భా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 7 | ఆచంటి | ఆదెళ్ళ |
| 40 | 19 | మఙ్ఙళమ్ | మఙ్గళమ్ |
| 43 | 4 | 1897 | 1917 |
| 44 | 2 | చినబాపయ్యా | శ్రీబాపయ్యా |
| | 18 | జ్ఞాపకారమై | జ్ఞాపకార్థమై |
| 46 | 14 | ప్రాజ్ఞ | ప్రాగ్జ్ఞ |
| 48 | 57 | పాజ్ఞ | ప్రాగ్జ్ఞ |
| 58 | 12 | ఆశ్రితుల | ఆశ్రితుల |
| 59 | 24 | వేల | వందల |
| 62 | 1 | భావదేపుని | భావదేవుని |
| | 8 | ల్ర్మక్షీ | లక్ష్మీ |
| | 17 | తృహా | తృవా |
| | 66 | పెంకట | వెంకట |
| 67 | 16 | ఆవిష్కంప | ఆవిష్కరింప |
| | 19 | నంస్థ | సంస్థ |
| 68 | 2 | ప్రాజ్ఞ | ప్రాగ్జ్ఞ |
| | 11 | యమునానంద | విమలానంద |
| 71 | 24 | నార్జిం | నార్జిం |
| 73 | 12 | జరుగుండును | జరుగుచుండును |
| 76 | 16 | స్వ్యామి | స్వామి |
| | 19 | మణీ | మణి |
| 78 | 4 | ప్రాజ్ఞ | ప్రాగ్జ్ఞ |
| 80 | 4 | శిక్షిణా | శిక్షణా |

